వణుకునా హెచ్చరిక చేస్తూ నిలుచుండి పోయేడు. అతని వుత్తరాలు కదులు తున్నాయి-ఒకటొకటిగా. శ్రావణ మేఘాలు ఆకాశాన్నిండా ఆవరించు కున్నాయి. చెట్లమధ్య పూతోటలో తిన్నె మీద కూర్చుని ఆకాశంలోకి రెండుకళ్ళూ పైకెత్తి నిర్నిమేష దృక్కులతో చూస్తోంది; తూరీగలు వర్షాగమనాన్ని సూచిస్తూ జయలక్ష్మి తలమీదుగా రొద చేసుకుంటూ సాగిపోతున్నాయి.

చేత్తో మరోవుత్తరాన్ని తీసింది.

జయలక్ష్మిగారికి.

ఇదివరకు ఓ వుత్తరం రాశాను. అది మీకు అందిందో లేదో తెలియదు. సంశయ నివృత్తికి మరోసారి రాస్తు న్నాను. నన్ను మన్నించి నా వుత్తరానికి జవాబు లివ్వండి. మీ స్నేహాన్ని బలా త్కారంగాకోరుకుంటున్న దౌర్భాగ్యుడిని. మీరూపు నామనసులో పాతుకుపోయింది. శరీరంలో చెలరేగే ఈ సంఘర్షణల తాకి డికి తట్టుకోలేకపోతున్నాను. పరిగెత్తు కుని రెక్కలు కట్టుకుని మీ ముందు వాలాలనే మనసుకి నేనెలా సంకెళ్ళు వేయను? నిష్కల్మషమైన మొహం. మాటతీరు యీ జన్మకికాదు-యే జన్మలో నైనా మరిచిపోగలనా?

భగవాన్! ఏమిటీ పరీక్ష? ఏమిటీ స్నేహాలు? ఎందుకీ బాంధవ్యాలు? నే నెలా పరిష్కరించను యీ సమస్యని? మనసు మీ స్నేహంకోసం, సాంగత్యం కోసం పోరాటం పెడుతోంది. అశక్తు డినై పోతున్నాను-క్షణక్షణం. మిమ్మల్ని మరొక్కసారి చూడాలనిపిస్తోంది. సంఘం, నీతి నియమాలు, దుర్భేద్యం అయిన అడ్డుగోడల్లా నిలుచోకపోతే నేను భగవంతుడిని ప్రార్థించి మీ సమ క్షంలో వాలే అవకాశాన్ని కల్పించుకునే వాడిని. మీ మాటలు వింటూంటే నన్ను నేను మరిచిపోయాను, లోకం మరచి, సర్వం మరచి ... తప్పుగా రాశానేమో అనిపి స్తోంది. నన్ను క్షమించండి

— కేవలం మీ స్నేహాన్ని కోరే

దేవేంద్ర,

జయలక్ష్మి జవాబు రాయలేదు. గది లోంచి శంఖానాదంలా తల్లి దండ్రులు సంస్కృత శ్లోకాలు వల్లెవేస్తున్నారు. తులసికోట దగ్గర వదినగారు చేతులు జోడించింది తలారాస్నానం చేసి పూజలో నిమగ్నురాలై పోయింది. మరోవైపు అన్నగారు సంధ్యావందనం చేస్తున్నాడు. సాంఘిక కట్టుబాట్లతో, నియమనిష్ఠ లతో, సత్సంప్రదాయం అయిన కుటుం బంలో జయలక్ష్మి ప్రతిమ నిలబడి పోయింది. తల్లీ — తండ్రీ, సమాజం. మంచీ — చెడూ, కులం - గోత్రం వీటి మధ్య నలిగిపోతోంది-ఆ యిరుకునపడి. మరోవుత్తరం జయలక్ష్మిని వోదారుస్తూ పైకి వచ్చింది.

జయలక్ష్మికి:

నీ గురించి నాకు తెలిసింది. నీ మౌనం

అర్థం చేసుకోగలిగేను; నిజమే-జయా నీకూనాలాంటి కోరికలే కలుగుతున్నాయి. కాని పక్షంలో ఆ రోజు అంత నిష్కల్మషంగా, నిర్మొహమాటంగా ధైర్యంగా అని వుండకపోయే దానివి 'మీరు నచ్చారు నాకు' అని.

జయా నేను చొరవ తీసుకుంటున్నాననుకోవడంలేదు నీ మనసులో మాట నాకు ముందే చెప్పేశావు. నేను అర్థం చేసుకోలేకపోయాను. తప్పు నామీదే వుంచుకుని నిన్ను దోషిగా నిలబెడుతున్నాను. నువ్వు ఒకమాటలోచెప్పగలిగిన విషయాన్ని నేను యెన్ని వుత్తరాల్లో ఇమిడ్చగలను? నేనంటే నీకువల్లమాలిన ఆపేక్ష, అనురాగం వున్నాయని నువ్వు నవ్వినప్పుడు గ్రహించేను. నువ్వు 'ఫేర్ వెల్ టుమై ఫ్రెండ్'అంటూ యేదో పాట పాడేవు. ఆ పాట అప్పట్లో అర్థం కాలేదు. పరదేశీ మనుషులమీద మమత పెంచుకోరాదనే కాబోలు-దాని అర్థం. కానీ-ఆపాటలో సందేశంతో మరీవేరైపోయేవు నువ్వు. నీలా నేను యే విషయాన్నీ చెప్పలేను.

కళ్ళుమూసుకుని కాస్సేపు కూర్చుంటే నీ రూపం నా మనసులో మెదులుతోంది. అమాయకంగా వుండే నీ కళ్ళల్లో యేదో ఆకర్షణ. నీతో యెన్నో విషయాలు చెప్పాలని పెదవి విప్పుతాను. కానీ యేదీ ... నువ్వు కళ్ళముందు ఆని వల్లే అని మటుమాయం అయిపోతావు. నేను యెన్ని సంగతులు చెప్పాలనుకుంటాను; కనీసం రాసేందుకైనా అవకాశం యివ్వు ... ఈసారైనా వుత్తరం రాస్తావా జయా ...

నీవాడు

— దేవేంద్ర

'నీవాడు' -జయలక్ష్మి రెట్టిస్తూ నిరాశగా నవ్వుకుంది. నువ్వు నావాడివే అయితే యింత బాధదేనికి దేవేంద్రా. ఎక్కడినేను, ఎక్కడినువ్వు? యజ్ఞయాగాదులు చేసే సోమయాజులుగారి ఏకైక బిడ్డనినేను.మరి నువ్వో? నీకులం,గోత్రం యివన్నీ నాకు తెలుసుకోవలసి వస్తుందనుకోలేదు. యీ అంతస్థుల్ని యీ జన్మకి అధిగమనించగలనా? సంఘం పురోగమిస్తోందంటున్నారు. కానీ ... జయలక్ష్మి గుండెలు జారిపోయేయి. విప్పలుకడిగే సద్బ్రాహ్మణుల యింట పుట్టినా గారాబంగా పెంచినందుకు చదివించేరు జయలక్ష్మిని. చదువుకున్న పిల్ల మనసుపడిందని వుద్యోగానికి పంపేరే కాని వరాన్వేషణకి 'కాద'ని యిప్పుడు వుత్తరాలు చూపిస్తూంటే భోరున యేడుస్తూండి పోయింది.

'రావోయ్ జయా; అంటున్నాడు కళ్ళయెదుట రెండుచేతులూ చాపి దేవేంద్ర. అతని గుండెల్లో తలదూర్చి హృదయం ముక్కలయ్యేలా యేడవ్వాలనీ అతని కౌగిలిలో కరిగిపోయి అతను చెప్పే




మాటలు వినాలనీ జయ నిస్సహాయంగా కనిపించని దైవాన్ని ప్రార్థిస్తోంది.

మాతా నాస్తి పితా నాస్తి,
నాస్తి బంధుః సహోదరః,
అర్థం నాస్తి గృహం నాస్తి.
తస్మాత్ జాగ్రత! జాగ్రత ॥

ఏనాటిదో తండ్రి చదివే శ్లోకాన్ని జయ మననం చేసుకుంటోంది. యెవరికి యెవరు? బొందిలో ప్రాణం వుండే వరకూ ఆశ చావదే - మనిషికి. దేవేంద్రకి తను వుత్తరం రాస్తే...జయలక్ష్మి పీక నొక్కేసింది సంప్రదాయం.

ప్రియమైన జయా!

ఎంతో రాయాలని మొదలుపెట్టేను. కానీ - యేమి వ్రాయాలో అర్థంకాక అర గంట గడిపేను. ఈ రోజు వుదయం పది గంటలకి నిజామాబాద్ చేరుకున్నాను. గంటల ప్రయాణమే ... యెన్నో రోజులు అయినట్లు అనిపిస్తోంది. నిన్న చూసిన తరువాత ఎంత తృప్తిపడ్డానో యివాళ అంత నిరాశగావుంది. నీమాటలు చేష్టలు కండ్లల్లో మెదులుతున్నాయి. రోజూ చూడాలని ఆశగావుంది - ఎలా? రెండోసారి నిన్న నిన్ను కలుసుకున్నప్పుడు 'నెలకోసారి రండి; దారిఖర్చు యిస్తా'నన్నావు వారానికోసారి వస్తే? నీతో స్నేహాన్ని యేడాది తరువాత మరిచిపోతారన్నావు. ఎవరు మరిచి

పోతారనేది తరువాత నిర్ణయించ వచ్చును.

నిన్నవచ్చాను. నిన్ను చూశేను. యెంతగా, పాలిపోయేవు? మందు తీసుకోవడంలేదా_జయా? ఒకవేళ నేను మళ్ళీ వచ్చేలోగా యిలాగే వున్నావంటే డాక్టరు దగ్గిరికి నేనే తీసుకు వెళ్ళాల్సి వస్తుంది_ఆలోచించుకో.

నేను హైదరాబాదు వస్తున్నానంటే అది నీకోసమే అనిపిస్తోంది. నువ్వంటే నాకు చాలా ఇష్టం. నీముందు ఎన్ని గంటలు గడిపినా చాలడంలేదు_అవకాశం దొరకడంలేదు_నీతో మనసువిప్పిమాట్లా డేందుకు. మొదటిసారి కలుసుకున్నప్పుడే మనం సన్నిహితులం, స్నేహితులం, ఆత్మీయులం అయిపోయేం. మనం హిందువులం కదా - పునర్జన్మ మీద విశ్వాసం వుండడం సహజం. సైంటిఫిక్‌గా కాక సెంటిమెంటల్‌గా ఆలోచిస్తే మన అంతరాత్మలకీ సంబంధం ఈనాటిది కాదనిపిస్తోంది. అంతమంది మధ్య యేది మాట్లాడుతే యెవరేమనుకుంటారో ననే భయం, పూర్తిగా మాట్లాడలేక పోయేననే బాధ.. నాకు జవాబు రాసేందుకు భయంగా వుందా నీకు. అంత బాగా మాట్లాడే నువ్వు యిలా యెలా వుండ గలుగుతున్నావు_జయా నిన్నుచూడాలని యిప్పుడే అనిపిస్తోంది. వుత్తరం రాయి మరి,

నీవాడు
—దేవేంద్ర.

రెండోసారి దేవేంద్ర స్కూలుకి వచ్చేడు. జయనిచూసేడు. అతని మొహంలో కోటి మెర్క్యురీలైట్లు ఒక్కసారిగా వెలిగాయి. జయలో అందంలేదు, ఆకర్షణలేదు; అమాయ కత్వాన్ని జీర్ణించుకున్న ఆమొహం అంటే అతనికి పంచప్రాణాలు. పనిగట్టు కుని అతను అంత దూరంనుంచి జయ కోసమే వచ్చేడు, అతని పెదాలు కదులు తున్నాయి. మాటలు పెగిలి రావటంలేదు. అతని కళ్ళల్లో సందేశాలు పంపించేదాక చక్యం లేనివాడిలా స్థాణువులా కూర్చుండి పోయేడు. జయ అతని సమక్షంలో యెన్నో మాటలు పేర్చి పొందికగా మాలగ్రుచ్చి అతనికి అందించింది. అతనువెళ్ళిపోతూంటే 'నెలకి ఒక్కసారి రండి. మిమ్మల్ని చూడాలని నాకు వుంటుంది.' అంది నెమ్మదిగా. ఆటు తరువాత అతను వుత్తరాల్లోనే ప్రేమని పంపుతూ కంటికి రెప్పలా వూహా లోకంలో ఆరాధిస్తూండి పోయేడు. అతని వుత్తరాలకి జయ జవాబు యివ్వలేక పోయింది. తన అసమర్థతకి గుండెలు పగిలిపోయేలా యేడ్చింది. అతని అవే దనకి ఒక చల్లని కబురు వ్రాయలేక పోతున్నందుకు పిచ్చిదానిలా దైవాన్ని దూషించింది. అతని వుత్తరాలు జయ ప్రాణానికి జపమాలలు.

జయా,

పది రోజులుగా నీ వుత్తరంకోసం



యెదురుచూసి విసిగి వేసారిపోయేను. నువ్వు జవాబురాయవు. అయినా నేను వుత్తరం రాయడం మానలేదు. ఇది నా దౌర్భాగ్యం కాదంటావా? నిరీక్షణ యెంతటి శాపమో భగవంతుడుకి తెలుసును. నాకు ఓకథ జ్ఞాపకం వస్తోంది– యెప్పుడో యెక్కడో చదివాను.

'రాజహంస వొకటి హిమాలయాల మీదుగా యెగిరి వెడుతూంటుంది. మార్గ మధ్యలో చెరువొకటి దాన్ని ఆకర్షించింది. తెల్లగా అందంగా మిస మిసలాడిపోయే ఆ రాజహంస కొద్దిగా చెత్తా చెదారంతో వున్నప్పటికీ ప్రశాంతంగా సాగిపోయే ఆ ప్రవాహంలో ఒక్కసారి స్నానం చేయాలనుకుంటుంది. ప్రొద్దు పడమరకి మళ్ళేలోగా తన స్నానం పూర్తి చేయలేకపోతుందా? అనే ధీమాలో వొకసారి మునుగుతుంది ప్రవాహంలో.

కొటుక కొండలు ఆక్రమించుకుంటాయి ఆకాశాన్ని. గంటలు దొర్లిపోతుంటాయి భారంగా. ప్రవాహపు యెద్దడికి గట్టు పక్కకువున్న బురదనీరు రాజహంస రెక్కని దొరకపుచ్చుకుంటుంది; యెంతో ప్రయత్నంచేసి బయటికి తీసుకునేలోగా మరోరెక్క అందులోకి చొచ్చుకుపోతుంది. ఆకాశం చీకట్లు కమ్మేస్తుంది. ప్రొద్దు యెంతవరకూ వచ్చిందో కూడా తెలియని అంధకార బంధురమై పోతుంది ప్రకృతి.

ప్రళయంలాంటి ప్రకృతి రాజహంసని భయభీతురాల్ని చేస్తుంది. అలలమీద ఒకవైపు ఝంఝూమారుతాలు, మరోవైపు పొంగవడియేటికి యెదురీదలేక కొట్టుకువచ్చే ఆకులూ, కొమ్మలూ, మరోవైపు, కంపిస్తున్న భూదేవి యింకోవైపు రాజహంస కళ్ళముందు వికటాట్టహాసం చేస్తూ విధి సవాలు చేస్తూంటుంది.

యెవరినీ లక్ష్యపెట్టని రాజహంస విధి చేతిలో బంధించబడినా ధైర్యాన్ని కూడ దీసుకుని సూర్యుడికోసం ఆకాశంవైపూ, మబ్బులవైపూ కళ్ళు తటతట లాడించి చూస్తూంటుంది, వురుములు, మెరుపులు, చీకట్లు ఆవరించుకున్న ఆకాశం వొక్కసారి దద్దరిల్లి బ్రద్దలైపోతుంది. చిల్లులు పడినట్లుగా కుండపోతగా ఒకటే ధారగా వర్షం పడుతూంటుంది. రెక్కలు ఆల్లార్చుకుంటూ ఆకాశంవైపు పడమటి దిక్కుగా వాలిపోయే సూర్యుడికోసం కోటి కళ్ళతో నిరీక్షిస్తూ కంటి కొనల్లో రెండు కన్నీటిబొట్లు నిలుచుని వుండగా నిరీక్షణలో అలసిపోయిన రాజహంస ప్రాణాలు విడుస్తుంది.

రాజహంస బలహీనతకి ముఖ్య కారణం– బురదా, వాతావరణంఅను కుంటున్నావా– జయా? కానేకాదు. రాజహంస వేసారిపోయింది నిరీక్షణలో– జయా–నిరీక్షణలో. సూర్యుడు రాలేదు ఆరిపోయే జీవనస్రవంతిలో వెలుగు కిరణాన్ని ఒక్కటి ప్రసరించలేక పోయేడు. అతన్నే నమ్ముకుని కన్నీరు కారుస్తున్న రాజహంస అతని నిరీక్షణలో ప్రాణాన్ని వదిలేసింది...'

నన్నూ అలాగే చేస్తావా–జయా. నీ వుత్తరం వొక్కటిచాలు–నాజీవిత విధానానికి అండదండలుగా పని చేసేందుకు. నన్ని నిరీక్షణలో ముంచేసి యీ అగాధం లోకి, చీకట్లలోకి త్రోసేసి నువ్వు దూరం అయిపోయేవా? 'మీరు నచ్చారు' అని యెందుకన్నావు? నేను నచ్చడంలో గల అర్థాన్ని గ్రహించేందుకు కూడా అవకాశం యివ్వావుకాదు–దేనికీ?

ఇప్పుడు చెప్పు – నీ కోసం నేను ఎదురుచూడడం తప్పా! నేను అందరాని ఫలాన్నే ఆశించేనంటావా? యేడీ ఆ భగవంతుడు? ఎందుకింత నిర్దయుడైపోయాడు? 'నీ బ్రతుకంతాఎదురుచూడడ' మని నా మొహాన మూడుపంక్తులా రాసి వేశాడా? చెప్పు–జయా...ఒక్కమాట

రాయి. 'మీరంటే నాకు ఇష్టంలేదు. పక్తినే ఆ మాట అన్నాన'ని ఒక్కసారి రాయి. అది చూసి తృప్తిపడతాను. తమాషాకి అలా అన్నానని చెప్పొపోనీ. నువ్వు నిర్దయగా 'కాద'ని రాసినా ఆ చేదు విషాన్ని తీయగా మింగేందుకు ప్రయత్నంచేస్తాను. నా కళ్ళు యింటి ముందు సైకిల్ బెల్ మీద ఆగిపోతు న్నాయి చెవులు ఆ కేక కోసం కలవ రించి పోతున్నాయి. మనసు బేలగా మారిపోయి ఆక్రోశిస్తోంది. జయా-నాకు ఉత్తరంరాయి. ఆడదానిమనసు వెన్న లాంటి దంటారు పెద్దలు. నీ హృదయం అంత పాషాణం అయిపోయిందా? ఇంత కఠినంగా యెలా మారిపోగలిగావు? నువ్వు నా జయవికదూ? యీ ఆశ నాకు ప్రాణంపోస్తోంది.

'ఆరడుగుల బలిష్ఠం అయిన మగ వాడు రాసే ఉత్తరమేనా యిది? అని లోకులు నవ్విపోతారు. 'జయా, జయా' యీ కలవరింతలతో అన్నం ముట్టుకో బుద్ధి కావడంలేదు. నీకోసమే నేను బ్రతుకుతున్నాననిపిస్తోంది. కాకపోతే యెక్కడినువ్వు? ఎక్కడినేను? పాఠాలు నేర్పే మనిషిని జీవితం నేర్పే పాఠాల్లో తప్పటడుగులువేశాను. ప్రేమ అంటే ఫార్స్ అనుకునే నేనేనా-ఇలా నీకోసం కలవరిస్తున్నది. ఒక్కసారి నాకోసం... నీ దేవేంద్రకోసం-జాబు రాయవూ... రాస్తావు-నాకు తెలుసు.

నీ
—దేవేంద్ర.

జయా

ఉత్తరాలు రాయడంలో కొందరికి తృప్తి. అందుకుని చదివి ఆనందించ డంలో మరికొందరికి తృప్తి. మనం ఇద్దరం చూశావా-ఎటువంటి తెగలకి చీలి పోయామో...నో, చీలిపోవడం కాదు ఇది. అలా అనుకోవడం కూడా అశుభం; ఉత్తరాలబాటమీద వొకరికి చదువుతే ఇష్టంగా మరొకరికి రాస్తే యిష్టంగా చేయీచేయీ కలుపుకుని ప్రయాణం సాగిస్తున్నాం.

నీ సంగతి నీ యిష్టం. నేను ఇంక ఫోర్సుచేయను; నన్నుఉత్తరాలు రాయ మ్మని నువ్వు శాసించలేదుగదా. అదీ నా అదృష్టమే మరి. నేను ఇన్నాళ్ళూ తలుచు కోలేదు; కానీ- తలుచుకుంటే కవిత్వం రాస్తాను. నా ఈ మనసులో రోజూ ఆరాధన లందుకునే దేవతవి నువ్వు. నా హృదయసామ్రాజ్యాన్ని యేక చ్ఛత్రాధిపత్యంగా యేలుకునే రాజ్ఞివి నువ్వు నారాణీ-నిన్ను నాలో ప్రతిష్ఠించు కుని కోటికలలు కంటున్నాను నేను. నా కలల అలలమీద నాట్యంచేసే రాజ హంసవి నువ్వు.

మొన్న వో కలగన్నాను. కలలు గనడం నా యిష్టం. నువ్వు కాదనలేవు. కల గురించి రాయమంటావా-నన్ను. నేను కలగనడం యేమిటి? కూర్చున్నా నిలుచున్నా కలలమీదే బ్రతుకుతున్న వాడినికద. 'నాగార్జునకొండలమీద మనం

షికారువెళ్ళాం. చాలా ఆహ్లాదకరంగా వుంది ఆ సాయంసమయం; నువ్వు ముందూ, నేను వెనుకా చేయీచేయీ అందుకుని నడుస్తున్నాం మనం. అలా ఎంతో దూరం వెళ్ళేం; కొండరాళ్ళను బ్రద్దలుచేసే లంబాడీలని దాటేసి. నువ్వు అలసిపోయి నిలుచుండిపోయేవు. నేనేం చేయగలను? ముందుకు యెంతదూరం వెళ్ళాలో వెనక్కి మళ్ళినా అంతేదూరం నడవాలి—గమ్యాన్ని చేరుకోవాలంటే.

అలసిపోయిన నువ్వు కొండకి చేరగిలబడి కూర్చుండిపోయేవు. ఎండ అంతగా లేకపోయినా నీచెంపలు కమిలిపోయేయి; రెండుచేతుల్తో నిన్ను లేవనెత్తుకున్నాను. సిగ్గులో మొగ్గలా ముడుచుకుపోయేవు—నా గుండెల్లోకి. నీ మొహంలోకి ప్రేమగా అతృప్తిగా ఆశగా చూస్తున్నాను నేను. భయంతో నీ పెదాలు కంపిస్తున్నాయి. నా వుద్దేశ్యాన్ని పసిగట్టినదానిలా పెదాల మీద చేయి వేసుకున్నావు. నా నవ నాడులూ కృంగిపోయేయి—జయా, ఉప్పెనలా పొంగిపొర్లుతున్న రక్తం దిగంతాలకి జారిపోయింది—చల్లబడిపోయి. నిన్ను ముద్దుపెట్టుకోవాలనీ, నిన్ను నా కౌగిలిలో బంధించేయాలనీ కలగన్నాను. నా కల కలే అయిపోయిందని పించింది. ఛెంగున లేడిలా క్రిందికి దూకావు.

నేనంత ఫూల్‌ని కాను జయా. సంస్కృతికి నేను కట్టుబడివుంటాను. నాకు తెలుసును—హైందవజాతి ఇంకా నాశనంకాలేదని. ఆవేశంలో కొంచెం కోపంవచ్చినా తమాయించుకోగలిగేను. మనం యిద్దరం పవిత్రమైన బంధంతో ఒకటి కావాలి. పెళ్ళి అయేవరకూ స్త్రీ పురుషులు సమానంగా నిలుపుకోవా లంటాను పవిత్రతని. నువ్వు పరుగు పెడుతున్నావు నన్ను కవ్విస్తూ. అంది నట్లే అంది దూరం అవుతున్నావు. ఆఖరికి దొరికావు. నిన్ను నా గుండెల్లోకి తీసుకున్నాను.' కల కరిగిపోయింది. నా గుండెలమీద నువ్వనుకుని కౌగలించుకున్న తలగడవుంది. ఆప్యాయంగా దాన్నే హృదయానికి హత్తుకున్నాను.

కొన్నికొన్ని నియమాలు పాటించే దుకే ఉత్తరాలు వ్రాయాల్సి వస్తూంది. నా కోరికల్ని ఉత్తరాల్లో వ్రాయటం తప్పా—జయా! శరీరాలకీ, మనసుకీ సంబంధించినవి ఉత్తరాలు. మనసులో భావాల్ని కాగితంమీద పెట్టి శరీరాన్ని అనుభవించేట్టుచేసే వూహాగానంలో తేలిపోవడంలో తప్పు లేదనే అనుకుంటాను. ఈ విషయంలో మన్నించాలి నువ్వు నన్ను.

ఇంక యెన్నాళ్ళోలేదు—మనంవొకటయేందుకు. మీ పెద్దల్ని వొప్పించి నిన్ను పెళ్ళి చేసుకుంటాను. మనం యిద్దరం వొకటై యీ లోకం మరచి... వొద్దు యింక రాయను నేను. నిన్ను చూసేందుకు వచ్చేస్తున్నాను. పబ్లిక్




గార్డెన్‌కి రావాలి నువ్వు. పదన్నర తరువాత వస్తావుకదూ –

నీ వాడిని నేను

— దేవేంద్ర.

వర్షపుతుంపరలు ప్రారంభం అయి యేళ్ళూ ఊళ్ళూ యేకం చేసేంతధారగా మారిపోయింది. జయగదిలోకి వెళ్ళిరేపటి కోసం యెదురుచూస్తూ మంచంమీద వాలిపోయింది. తెల్లవారుతుంది; తను స్కూలుకి వెళ్ళేసరికి అతను వచ్చివుంటాడు. అతను వేసే ప్రశ్నలన్నిటికి తను జవాబు చెప్పాలి. తనకోసం పరితపించిపోయే అతనిమీద అనురాగాన్ని లోలోపల పెంచుతున్న జయకి సంఘనియమాలు కళ్ళయెదుట కనిపించగానే వుప్పెనలా ముంచుకువస్తోంది దుఃఖం. రాత్రింబవళ్ళు అతనితో మాట్లాడని క్షణంలేదు అతను వుత్తరాలు రాశాడు. తను వ్యక్తం చేయలేదు ఇంతే తేడాలో అతని యెదుట పడేందుకే భయంగా వుంది.

పోనీ–అతన్నే పెళ్ళిచేసుకుంటే ...

జయ కాళ్ళక్రింది భూమి గిరగిరా తిరిగిపోతోంది. తల్లి, తండ్రి, అన్న, వదిన సంఘపు సౌధానికి పునాదిరాళ్ళల్లా నిలబడి తనని యేవగించుకుంటున్నారు. నలుగురూ వేలెత్తి చూపించి 'సోమయాజులుగారమ్మాయి వాడెవడితోనో లేచిపోయింది,' అంటున్నారు.

జయ కళ్ళు మూసుకుంది. 'లేదు దేవేంద్రా. మనకలయిక ఈ జన్మకి

సాధ్యం అయేకాదు. నా మీద యెందు కిన్ని ఆశలు పెంచుకున్నావు? నేను యె తటి సువర్ణకటకటాలమధ్య ఇరుక్కు పోయేనో నీకు తెలియదు దేవేందర్? నువ్వు మగవాడివి. స్వేచ్ఛగా ఆలోచించేవు. ధైర్యంగా తెగింపు చేసుకున్నావు. సంఘంతో, ప్రపంచంతో ప్రమేయం లేనివాడిలా ఆశాసౌధాల్ని నిర్మించుకున్నావు. నేనే కనిపించేనా నీకు? నువ్వంటే నాకు ఇష్టం అని నే నెలా అనగలిగానో అర్థం కావడంలేదు. ఆ క్షణములో నిన్ను పతిదేవుడిగా ఊహించలేదు, ప్రియుడిగా ఆలోచించలేదు. నీ విందు గాంభీర్యం, నీ మృదుమధుర సంభాషణ, నీ సంస్కారం అన్నీ కలగా పులగం అయికనిపించగానే 'నువ్వంటేచ్చావ'న్నాను. నన్ను అపార్థం చేసుకున్నావు. ఆడపిల్ల వుండవలసిన పరిధుల్ని దాటి రమ్మంటున్నావు. నీ తో టి దే లోకం అంటున్నావు. కానీ...కానీ నేను బ్రతకలేను దేవేంద్రా...నువ్వు లేకుండా బ్రతకలేను, నీ సమక్షంలో ఆంతకన్నా బ్రతకలేను. నే నెందుకు చదువుకున్నాను? ఎందుకు వుద్యోగానికి వచ్చేను? నువ్వెందుకు వచ్చేవు? నీ మీద యిష్టాన్ని యెలా పెంచుకున్నాను? నేను పెంచుకున్న ప్రేమలతని యెలా తృంచివేయను? నా కోసం కొండంత ఆశతో వస్తావు? ఏమని సమాధానం యివ్వను? నిన్ను పెళ్ళి చేసుకుంటాననీ, నీ అడుగుజాడల్లో జీవితాన్ని పూలపాన్పు చేసుకుంటాననీ మభ్యపెట్టి ద్రోహం చేయమంటావా నన్ను? నేను వంచకిని కాను. నువ్వు నాకు కావాలి? కానీ దైవం యెంత కఠినంగా శాసించాడో చూడు. మనిద్దరిమధ్యా యీ జన్మకి దాటలేని అగాధాల్ని సృష్టించి నన్ని దుఃఖంలో ముంచేసి చిత్రంగా ఆడుకుంటున్నాడు తెల్లవారితే నువ్వు వస్తావు. పబ్లిక్‌గార్డెన్‌లో నన్ను చూసి ఏమని ప్రశ్న వేస్తావు; నీ కోసం బెంగతో చిక్కిశల్యం అయిపోయేనంటే నమ్ముతావా? నీకు ఉత్తరాలు రాయలేదనే ఆలోచిస్తావు; నింద వేస్తావు; నీ బాధలో నువ్వు పరుషంగా మాట్లాడినా యేమీ అనుకోను; నేను ద్రోహిని. అమాయకుడివైన నీలో ఒక్కమాటతో ప్రేమ కల్పించాను. ఆశలు పెంచాను. నా కోసమే బ్రతికేట్లు చేసుకున్నాను. చివరికి నీకు కాకుండా పోతున్నాను...పడక మీద పడుకుని ఆలోచిస్తూ తెల్లవారే వరకూ జాగరణ చేసింది జయ.

వదిన శ్యామల వచ్చి భుజంమీద చేయివేసి అడిగింది! అదేం? జయా ఆలా వున్నారు. రాత్రి నిద్ర పట్టలేదా? తమ్ముడిగారిని గురించి ఆలోచిస్తూ జాగరము చేశారా యేమిటి? మీ అన్నగారు పంపిన ఫోటోలో ముగ్ధమోహనమూర్తి యిప్పుడే మిమ్మల్ని విడ్రవోనివ్వక పోతే...

'వదినా' జయ కోపంగా కదిలి వెళ్ళి

పోయింది. శ్యామల క్షణం విభ్రాంత పోయింది. పెళ్ళివాడు వచ్చి చూసి వెళ్ళింది మొదలు జయస్వరూపమే మారి పోయింది. ఒగుటుగా గదిలో కిటికీ గుండా ఆకాశంలోకి చూస్తూ తనలోతనే నవ్వుకునే అవపడుచుని చూసి కొంచెం అనుమానించినా అంతటినింద వేయలేక పోయింది. శ్యామలకళ్ళు జయని పరి కిస్తూనే వున్నాయి.

'ఇవాళ స్కూలుకి వెళ్ళడం లేదా జయా!' తల్లిగొంతు ఖంగుమంది వంట యింట్లోంచి.

'లేదమ్మా. అర్జంటుపని తగిలింది. ఎంప్లాయ్‌మెంటుకి వెళ్ళాలి. మళ్ళీ యింటర్వ్యూకి కాల్ వచ్చింది,' జయ తొట్రుపడింది-అబద్ధం ఆడేందుకు.

దేవేంద్రకి యిష్టం అయిన ఆకు పచ్చని చీర కట్టుకుని అదేరంగు జాకెట్టు వేసుకుని రెండు బస్సులు మారి పబ్లిక్ గార్డెన్‌లో నిర్మానుష్యంగావున్న ప్రదే శంలో తనకోసమే యెదురుచూస్తూ చెట్టుక్రింద నిలుచున్న అతన్ని చూస్తూనే చాపిన అతని చేతుల్లో వాలిపోయి బావురుమంది. దేవేంద్ర ఖంగారుగా జయ మొహాన్ని తనవైపుకు తిప్పుకుని అడిగాడు: 'యేమైంది జయా? యేం జరిగింది? నా వుత్తరాలు యింట్లో యెవ రైనా చూశారా? నిన్నేమైనా బాధ పెట్టారా? అదే జరుగుతే చెప్పు నిన్ను పెళ్ళిచేసుకుంటాను. అమ్మా నాన్నా



మన పెళ్ళికి వొప్పుకున్నారు జయా! చెప్పు- అసలేం జరిగింది? నలుగుర్ని నవ్వించి, నవ్వే నువ్వేనా యేడుస్తు న్నది.'

'నన్ను క్షమించు. నేను పాపిష్ఠి దాన్ని. నీలో ఆశలు రేకెత్తించాను' జయ యేడుస్తూ అన్నది.

దేవేంద్ర ఆశ్చర్యంగా చూశాడు: 'నన్నా నువ్వు మోసగించింది. అదెలా! నువ్వెవరినైనా ప్రేమించేవా? నాకు తెలియని క్రితం నువ్వు యెవరిమీదైనా

యిష్టపడ్డావా? చెప్పు జయా! అందుకే నాకు వుత్తరం రాయలేదా? ఎవరతను? నాకన్నా అందగాడా అతను? యోగ్యుడైన మనిషినే నువ్వు యెన్నుకున్నావా? నా వెర్రి; అయోగ్యుడిని యెన్నుకుంటావా.' దేవేంద్ర కళ్ళల్లో నీళ్ళు తప్పున రాలిపడ్డాయి. అంతెత్తు అందమైన అతడి మొహంలో కన్నీరు కదులుతూంటే బెంబేలుపడి పోయింది జయ. నిర్ఘాంతపోతున్నదానిలా 'నువ్వు యేడుస్తున్నావా? నాకోసం — ఈ దౌర్భాగ్యురాలికోసం. యేడవకు దేవేంద్రా — నా స్థితి నీకెలా చెప్పగలను?' అన్నది.

'అసలు విషయం చెప్పు — జయా. నేనంటే నీకు యిష్టంలేదా? నీకుతగనా నేను. అంత అనర్హుడినా?'

'మేము బ్రాహ్మణులం.' జయ నిశ్చలంగా అన్నది.

దేవేంద్ర పట్టు సడలిపోయింది. జయ భుజాలమీంచి చేతులు క్రమంగా జారిపోయాయి. కళ్ళు రెపరెపలాడిస్తూ జయవైపు చూశాడు— నమ్మలేనివాడిలా. జయ... ఆనాటి జయ... నిష్కల్మషంగా సూటిగా అతనికళ్ళల్లోకి చూస్తూ 'నువ్వంటే నాకు యిష్టం' అంది. ఆ యిష్టాన్ని చిలవలు పలవలుగా అల్లి మేడలుకట్టి ఆ మేడల్ని వూహలనే రెక్కల సాయంతో యెక్కేసి అక్కడే తన కలలపంట అయిన జయతో కాపురం చేశాడు. సౌధాన్ని కూల్చేసిన జయ మాటలకి రెక్కలు తెగిపోయేయి. కలలు భగ్నం అయిపోయేయి. 'బ్రాహ్మణులం'—జయ వొత్తి పలికిన ఆ మాటల వెనుక అహంభావం స్పష్టంగా కనిపిస్తోంది. 'నువ్వేనా యీ మాట అంటున్నది. ఆ విషయమే నా మొదటి వుత్తరానికి జవాబుగా రాయవలసింది. యెందుకిన్నాళ్ళు నాతో చెలగాటం ఆడేవు; నీమీద యిన్ని ఆశలు పెంపుకునేవాడిని కాను. నా వుత్తరాలు చదివేందుకు నీకు వినోదం అయిపోయింది. బ్రతుకంటే ఆటలుకాదు — జయా; బంగారంలాంటి జీవితాన్ని ఆడుకునేందుకు వుపయోగించుకుంటావనుకోలేదు. నీకు నేనేం ద్రోహం చేశాను? నిన్ను ప్రేమించడం తప్పా నాది? పెళ్ళిచేసుకుంటాననడం నేరమా? నేను నీకేం అపకారం చేశాను?' అతను వెర్రివాడిలా జయవైపు చూశాడు.

కళ్ళనిండా నీళ్ళుకమ్ముకున్నాయి. జయ అతనివైపు దీనాతిదీనంగా చూస్తూండి పోయింది. అతను యెదురుగా నిలుచుని దోషిగా నిలబెట్టి వొక విధంగా చూపుల్తో చిత్రవధ చేస్తున్నాడు. జయ అతనికి దగ్గరగా క్రింద కూర్చుని కాళ్ళమీద చేతులువేసి నిబ్బరంగా జవాబు చెప్పింది: 'నీకు నేను ద్రోహంచేయాలని యెన్నడూ అనుకోలేదు—దేవేంద్రా. కోటి కోరికలతో లక్ష ఆశలతో కళ్ళు రెండూ శూన్యాకాశంలోకి పంపి నీ కోసం— నీ ఉత్తరంకోసం కాయలుగా చేటట్లు యెదురు

చూశాను. నువ్వు సహనంతో నాకు యెన్నో జవాబులు యిచ్చేవు. నేనంటే ప్రేమబెట్టావు. మగవాడు - అనే ధ్యాసే లేని నాకు నీ స్నేహంలో మాధుర్యాన్ని రుచిచూపించేవు. నీకున్న ప్రేమని కుమ్మరించి వుత్తరాలు రాసేవు. యెలా చెప్పుకోను కృతజ్ఞతలు? యెలా విప్పి చెప్పను- నా హృదయంలో రగిలే కారు చిచ్చుని.

'నీకేం దేవేంద్రా-నువ్వు మగవాడివి. నువ్వు సమర్థించుకుని బ్రతకగలవు? నేను... నేనెలా బ్రతకగలను? నీకు తెలియకుండా నాకే తెలియకుండా నీమీద కోటిరెట్లు ప్రేమని పెంచుకన్నాను. నువ్వు నీ బాధని కాగితంమీద వ్యక్త్తం చేసి మనసుని కుదుటపరుచుకున్నావు. కానీ... నేను అంతటి అదృష్టానికి కూడా నోచుకోలేదు. ఆ కాగితాలు నీ ప్రేమ వ్యామోహంలో నిర్లక్ష్యం చేసి యెక్కడైనా పడేస్తే యెవరికంటైనా పడితే నా బ్రతుకు బజారుపాలైపోతుందని భయపడ్డాను. నా మనసులో నీమీద నిలుపుతున్న ఆరాధన ప్రకృతిలో వెల్లడి చేసుకుని భోరుమని యేడ్చాను. నేను నేడవడానికికూడా అర్హురాలిని కాను దేవేంద్రా.'

'అయిందా వుపన్యాసం. నువ్వు బ్రాహ్మణ పిల్లవికదూ!' దేవేంద్ర వ్యంగ్యంగా అన్నాడు 'నువ్వు వ్యంగ్యంగా మాట్లాడుతున్నావు. నా బాధ వినీ అర్థం చేసుకుంటావవికూడా నమ్మకం లేదు. దేవేందర్! నువ్వెందుకిన్ని వుత్తరాలు రాశేవు నాకు?' జయ నిస్సహాయంగా అడిగింది.

అతను దీర్ఘంగా నిట్టూర్పువిడిచాడు: 'నిజమే మంచి ప్రశ్నే వేశావు నీకు వుత్తరం రాయడం నాదతప్పే ..' వెంటనే అతను చిన్నగా నవ్వేడు. తనను తాను తమాయించుకున్నాడు. జయకి దగ్గరగా జరిగి భుజంమీద చేయి వేసి ఆ కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ 'నా జయా! నిన్ను అపార్థం చేసుకున్నాను. నన్ను క్షమించు. ప్రపంచాన్ని చూస్తూంటే నీకేం తోస్తుంది జయా,' అన్నాడు.

'ప్రపంచాన్నా. నేను చూడడంలేదే. నాకేం తెలుసు?' జయ అమాయకత్వానికి విస్మయంగా అన్నాడు: 'నువ్వు ప్రపంచాన్ని చూడడం అంటే-నీ చుట్టూ వున్న మనుషులని- జయా. పూర్వం మనుషులకీ యిప్పటికీ భేదం తెలియడం లేదూ.'

'అమ్మా, వదినా, యిల్లూ యిదే నా ప్రపంచం. ఆ ప్రపంచంలోకి నువ్వో నేస్తానివి వచ్చేవు. నువ్వంటే నాకు యెంతో యిష్టం. ఆ యిష్టానికి నువ్వేదో రూపకల్పన చేశావు; మొదటిసారి వుత్తరం రాశేవు ఆవుత్తరం చూస్తూంటే సంబరంతో నామనసు వూగిపోయింది. నాకు ... మరో మనిషి అపురూపంగా

వుత్తరం రాయడంతో పొంగి పోయేను. నీకు జవాబు రాయాలని కాగితంమీద కలాన్ని మోపేను. యేం రాయను? 'ప్రియమైన దేవేంద్ర' అని మొదలు పెట్టాను. ఆమాటలు నేను చదువు కుంటూంటేనే యెంతో ఆనందంగా వుంది. ఒకటికి రెండుసార్లు చదివేసరికి మైకం వదిలిపోయినట్లుగా యథార్థ లోకంలోకి వచ్చేను; అవుత్తరం నువ్వు గాక మరొకరు చూస్తే - అనిపించింది. మరొకటికూడా తోచింది; నువ్వు మగవాడివి; నేను ఆడపిల్లని. నేనున్న పరిసరాలు వేరు. ఈ కట్టుబాట్లని అధిగమించి రాగలనో లేనో ముందు ప్రశ్న వేసుకున్నాను. భగవంతుడు నా నొసటిరాతని చిత్రంగా రాసేడు. బ్రాహ్మణ్యం-అంటూ ఈ క్లిష్టమైన వాతావరణంలో బిగించి నవ్వి వూరుకున్నాడు. నాపరిస్థితి అర్థం అయింది; అన్నయ్యా వదినలు సంబంధాలు వెతుకుతున్నారు.

'నీ రెండో వుత్తరం అప్పుడే అందింది.'

దేవేంద్ర 'వూఁ' కొడుతున్నాడు. అందమైన మేడ, పిలిస్తే పలికే నౌఖర్లూ, గారాబంగా పెరిగిన వాతావరణం-అతని మనసు కెటువంటి శాంతినీ ప్రసాదించలేక పోతున్నాయి. అవన్నీ లేకపోయినా ఈ అందాలభరిణ జయవుంటే చాలని పిస్తోంది. జయని ఆప్యాయంగా కౌగలించుకోవాలనీ, తనూ జయా విను వీధుల్లో విహరించాలనీ మనసు అతనితో సంబంధం లేని దానిలా వూహాగానం చేస్తోంది. గాలికి ముంగురులు అల్ల కల్లోలంగా మొహంమీద పడుతున్నాయి - జయ కళ్ళల్లో తిరిగిన నీటికి క్రొత్త అందాన్ని తెస్తూ.

'జయా! నేను కావాలని నీకు అనిపించటం లేదూ.' మరోసారి అడిగాడు అతను-దేవేంద్ర-ముంగుర్లని చనువుగా వెనక్కి తోస్తూ.

'హుఁ,' నవ్వింది - జయ. అతని అమాయకత్వాన్ని చూస్తూ : 'ఎంత చిత్రంగా మాట్లాడుతున్నావు? నేను ఆడపిల్లననీ నాకో ఆశ్రయం కావాలనీ, మగవాడి అపురూపం ఆయన ఆమాషలో నాజీవితం స్వర్గధామం అవుతుందనీ కన్నెగా నేను కోరుకోవడంలో తప్పేం వుంది? కానీ...కానీ. మాటల్ని మధ్యలో ఆపేసింది - జయ.

అతను గ్రహించేడు. కళ్ళయెదుట తను రాసిన వుత్తరాలు కదలుతూంటే జయ అంతరంగాన్ని అర్థం చేసుకున్నాడు. హస్తిమశకాంతరంగా తనకీ జయకీ మధ్య తారతమ్యం కనిపిస్తూంటే కదిలిపోయింది- అతని మనసు

తను... స్నేహితుడిగా ఆపిల్ల తన మనసులోమాట బయటికి చెప్పేయగానే సర్వాధికారాలు వుపయోగించి ప్రేమని గుప్పెత్తించి వుత్తరాలు రాశేడు. ఆ వుత్తరాలే... అతనిలో మానవత్వం




తలెత్తింది. తనకే ఓ చెల్లెలుంటే ఆ చెల్లెలికే పరోవ్యక్తి వుత్తరం రాస్తే తుపాకీతో పేల్చేవాడు. అటువంటిది తను రాసిన వుత్తరానికి జవాబు రాయలేదని నిందవేశాడు. యెదురుగా కూర్చుని తన అక్కసు తీర్చుకోవాలనుకున్నాడు. ఆపిల్ల పరాయిదనే ఆలోచించలేకపోయాడు. 'పోన్లే జయా: నీపరిస్థితి అర్థం చేసుకోగలను. నువ్వు యేడవకు. నేను వెళ్ళిపోతాను ఇంకెప్పుడూ నీకు కనిపించను నువ్వు నాకు తెలిసిన మనిషివనీ, నీకూ నాకూ మధ్య వుత్తరాల సంబంధం, వెనుక నేను నీకు రాసేవాడినవీ, నేనంటే నీకు చాలా యిష్టం అని అన్నావనీ యెవరితోటీ అనను _జయా. దైవసాక్షిగా ఈ హైదరాబాదుకి ఈ జన్మలో రాను. వస్తే నిన్నుచూడాలనే నామనసులో కోరికని చంపేయలేను, అసలీ వూరిపేరే యెత్తకపోతే నీవూరికిని గురించే ఆలోచించే అవకాశం వుండదు. వెళ్ళిపోతాను. నువ్వుయేడవకు. ఒక్కసారి నవ్వు. ఆరోజు _ అంటే మీ స్కూలుకి వచ్చినప్పుడు నవ్వుతూ అన్నావు చూడు_ అలా మరోసారి 'మీరంటే నాకు యిష్టం.' అని వొక్కసారి అను.'

జయ కళ్ళుపైకెత్తి నిశితంగా చూసింది. అతని మొహంలో ఎటువంటి భావమూలేదు. ఆశా నిరాశలకి స్థానం లేదు. అతను జయవైపే చూస్తున్నాడు.

క్షణసేపు ఆగి 'నువ్వు నిజంగా నన్ను మరిచిపోతావా...' అన్నది_నెమ్మదిగా.

'నా సంగతి దేనికి జయా. నువ్వు

హాయిగా వుంటే చాలదా నాకు. నువ్వు నాకు మాట యివ్వాలి.'

'యేమని.'

'నా వుత్తరాలు నా కిచ్చేయాలి.'

జయ అన్నది: 'నాకు తెలుసును– దేవేంద్రా. నువ్వు మరిచిపోగలవు నన్ను. కానీ–నేను అంత సులభంగా మరిచిపోలేను. నన్ను పెళ్ళి చేసుకుంటా నన్నావు. ఆ వాక్యాన్ని పదేపదే చదువుతూమురిసిపోయేను. నువ్వు పెళ్ళికొడుకువై ఎదురు సన్నాహంలో మా అన్నయ్యని కవ్విస్తున్నట్టు కనిపించేవు. కాశీకి వెళ్ళిపోబోయే పిన్ను గడ్డంక్రింద పటికబెల్లాన్ని పెట్టి మా చెల్లాయిని చేసుకోండి బావగారూ – అని బ్రతిమిలాడేరు. నన్ను బుట్టలో తీసుకువచ్చి నీ ఎదుట కూర్చోబెట్టేరు. గంధపు చెక్క–తో నా స్నేహ సౌరభాన్ని కలిపి అరటిపళ్ళల్లో అమృతాన్ని జోడించి నీ చేతుల్లో వుంచేను నేను. నా నెత్తిన జీలకర్ర బెల్లం వుంచి నీదాన్ని చేసుకున్నావు. నా గుండెలమీద బంగారు సూత్రాల్ని బంధించి జీవితాన్ని పెనవేసుకున్నావు...యిన్ని ఊహించేను– నువ్వు రాసిన ఒక్క–మాటలో. ఆ విధంగా నీతో పెంచుకున్న మమతలకి నీళ్ళు పోసేను. నువ్వు వుత్తరాల్లో కురిపించిన అనురాగాన్ని నేను అణువణువునా జీర్ణం చేసుకున్నాను.

పట్టుపరుపుమీద గ్లాస్కో బట్టల్లో మిసమిసలాడిపోతూ నన్ను కౌగిల్లోకి తీసుకున్నావు; నా మనోమందిరంలో యెన్నో కబుర్లు చెప్పేవు. చివరికి ... 'మరిచిపోగలవ'ని అంటున్నావు.

దేవేంద్ర యేమీ చేతకానివాడిలా చూస్తూండిపోయేడు. మిట్టమధ్యాహ్నాం ఎండ చుర్రుమంటోంది. అతని కడుపులో ఆవేదన మంటలా మింటికి ఎగసిపడుతోంది. జయ ఏడుస్తూనేవుంది. ఆ పిల్ల మనసులో ఏదీ దాచుకోలేదు. అతని ఎదుట సిగ్గుపడలేదు. కొన్ని యుగాల సాన్నిహిత్యం ఉన్నదానిలా తనలోపి ఆరాటం తెలుపుకుంది.

దేవేంద్ర లేచి నిలుచున్నాడు. మరో మాట మాట్లాడకుండా గుండె దిటవు పరుచుకున్నవాడిలా వెళ్ళిపోతున్న అతన్ని చూస్తూ జయ కంఠంలో దుఃఖాన్ని దాచుకుంది. రెండడుగులు ముందుకువేసి వెనక్కి– మళ్ళి ఆగి. 'మరొక్క–సారి ఆలోచించుకో– జయా. ఈ బంధాన్ని అంత తేలికగా తెంపుకోలేని మనిషిని నేను. ప్రగతిపథంలో మనిషి ముందుకు వెడుతున్నాడు. ఆ మనిషితో మనంకూడా సాగి ప్రయాణం చేదాం. పాతవిపట్టుకుని వ్రేలాడి బ్రతుకుని భగ్నం చేసుకుంటామా? మనం తప్పుచేయడంలేదు. పెళ్ళి చేసుకుందాం– అంటున్నాను. ఇందుకు అమ్మా నాన్నా ఇష్టపడ్డారు. నీ ఇంటి వాకిలితలుపులు బిగుసుకుపోతాయనే భయం నీకు అఖర లేదు. నీకు తెలియకుండగా నీ–అమ్మా నాన్నా

నిన్ను అపురూపంగా చూసుకుంటారు. వింటున్నావా?' అన్నాడు.

జయ అతని చేతిని అందుకుంది. జయ మనసులో తల్లి లేదు. తండ్రిలేడు. సంఘంలేదు. ప్రపంచంలేదు. కేవలం దేవేంద్ర ఆ హృదయాన్ని ఆక్రమించుకుని వున్నాడు. అతని వెంట భారంగా అడుగులు వేస్తూ కదిలింది; పబ్లిక్‌గార్డెన్స్ గేటువరకూ వచ్చేరు. కారు హారన్‌లు, లారీరొదలు – జయ యీ లోకంలోకి వూడిపడింది.

'నేను వెడుతున్నాను', అతను పొడిగా అన్నాడు చేయిని తీసుకుంటూ.

'అలాగే'

'ఉత్తరం రాస్తాను'

'సరే'

'జవాబు రాస్తావా'

'.........'

'రాయవని తెలుసు. అయినా ఆశ చావడంలేదు. వెడుతున్నాను.' అతను అడుగులు ముందుకు వేసుకుంటూ వెడుతూంటే అచేతనంగాచూస్తూ నిలబడిపోయింది. ఇంటికి వచ్చేసి తలుపులు బిగించుకుని అతన్ని గురించే ఆలోచిస్తోంది. జయ గదితలుపులు బిడాయించుకుని అన్నా వదినల మాటలు మెదడులో దూరి సంచలనం ప్రారంభించేయి.

'ఏమన్నారు వాళ్ళు,' శ్యామల గొంతు – అది.

'ఏమంటారు! ఉద్యోగంచేసే ఆడపిల్ల మీద వాళ్ళకు మంచి అభిప్రాయంలేదు,' శాస్త్రి అంటున్నాడు.

'అంటే– మన జయమీద అపనమ్మకమా! వాళ్ళకి' శ్యామల ఆశ్చర్యంగా ప్రశ్న వేసింది.

'మన పిల్లేకాదు. కాలం మారిపోయింది. ఆఫీసులూ, ఉద్యోగాలూ వచ్చేసి స్త్రీస్వాతంత్ర్యం అనేసి సంఘం పాడైపోతోంది. ఈడొచ్చిన ఆడపిల్ల నిగ్రహంగా ఉద్యోగం చేస్తోందనే మంచి అభిప్రాయం శ్రోత్రియులైన వాళ్ళకి కలగడంలేదు. అందరి ఆడపిల్లాగే జయ కూడా ఆ యింటివాళ్ళ దృష్టిలో చులకన అయిపోయింది '

'బాగుంది వరుస. అసలు ఆడపిల్ల లంత తెగిస్తారని నిందవేయడం అంత భావ్యంకాదు.'

'మనం ఎవరం – ఖండించేందుకు. ఏదైనా అన్నా – గుమ్మడికాయలదొంగ అన్నవతులో ఉంటుంది. పోనీ–జయకి పెళ్ళి కాకపోతే అలాగే ఉండిపోతుంది'

శ్యామల గొంతులో ఖంగారు కనిపిస్తోంది: 'అంటే జయని గురించి అంత తేలికగా అనేశారా – మీరిలా నిర్లిప్తంగా వూరుకుంటే అసలావిడకి పెళ్ళి అవుతుందంటారా?'

శాస్త్రి మాట్లాడలేదు– కొంచెం సేపు. దూరంగా వెడుతున్న అలికిడి వినిపించింది. జయ చెవులురిక్కించి వింటోంది– అప్రయత్నంగానే.

'దాని ఖర్మ అది. ఎవరో ఎక్కడో ఎవరితోనో చూశారట - పాప జయని. ఆ విషయాన్ని వాళ్ళకి చేరేశారు. ఎవడు మాత్రం ఇస్తాడు పిల్లాడిని?'

జయ దిగులుపడలేదు; లేని అభాండం నెత్తిన వేసిన ప్రపంచాన్ని దూషించ లేదు. హాయిగా నిట్టూర్చింది. దేవేంద్రతో పరిచయం, ప్రేమా లోలోపలే తలెత్తి వటవృక్షంల్లా ఎదిగి శరీరం అంతా ఆక్రమించి ఆ పిల్లకి జీవంపోస్తున్నాయి. ఇంతటి ప్రచారం బయట ఎలా సాగుతున్నదో క్షణం అర్థం కాలేదు. తను భయపడి తనను గూర్చి ప్రపంచం అనుకునే మాటల్ని వినకూడదనే ఉద్దేశ్యంతో దేవేంద్రకి ఏ విషయంలోనూ జవాబు ఇవ్వలేదు. కానీ... అప్రయత్నంగానే - తను ఏ విషయాన్ని వినకూడదనుకున్నదో ఆ మాటలే చెవిలో పడేసరికి - క్షణం ఆశ్చర్యం, తెగింపూ బయలుదేరేయి. 'సోమయాజులుగారమ్మాయి జయ...' ఇంత జరిగేక జయకి భయం వేయలేదు. కాగితాన్ని కలాన్నీ అందుకుని దైవాన్ని ప్రార్థిస్తూ దేవేంద్రకి ఉత్తరం రాసింది.

పూజ్యుడివి దేవేంద్రా!

నీకు నమస్కరించి జయ వ్రాయడం - నీ ఉత్తరానికి సమాధానం వ్రాయమన్నావు; ఏం రాయాలో తెలియని స్థితి దాటిపోయింది నీకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూ సిద్ధంగా వున్నాను; నీ కోరిక తీరిందనే అనుకుంటాను.

ప్రేమతో నీ

'జయలక్ష్మి'

*






'పర్వతాలవెనక ఎక్కడో దూరాన సూర్యు డస్తమిస్తున్నాడు. అస్తమయ సూర్యుని
ఎర్రటి కాంతికిరణాలు చందన్‌లోయ నంతటినీ అలముకుని అందంగా మెరి

పిస్తున్నై. లోయలో కొండపాదం పక్కనే కట్టిన ఒక నల్లరాళ్ళ ఇంటిగదిలో బన్సీ కూచుని, ఆనాటి జమాఖర్చులన్నీ లెక్క కడుతున్నాడు. అతడి కప్పుడప్పుడూ దూరాన బండరాళ్ళు పగిలిన ధ్వనులు వినిపిస్తున్నాయి. తుపాకిమందు పేలుడికి రాతిబండలు ముక్కలు చెక్కలై కొండ అంచులదాకా ఎగిరిపడుతున్నవి. ఆధ్వనులు వింటూంటే, బన్సీకి తాను జీవితంలో సాధించదలుచుకున్న కోర్కెలూ, పెట్టుకున్న ఆశలూ, ఆ రాతిముక్కల్లాగే చెల్లాచెదరై పోతున్నట్లు తోచింది.

ఈ బండరాళ్ళ పేలుడు శబ్దాలకు బన్సీబాగా అలవాటు పడిపోయాడు. వృద్ధాప్యం, దారిద్ర్య బాధలూ ఏకమై అతడి శరీరాన్నీ, మనస్సునీ చెదపురుగుల్లా తొలిచేస్తున్నాయి, గత ఐదు సంవత్సరాలనుంచీ అతడు రాత్రనకా పగలనకా చెమటోడ్చి పనిచేస్తున్నాడు. అకారణంగా బన్సీ, యజమానిఆదరానికి పాత్రుడై, మామూలు కూలీస్థాయినుంచి, అమధ్యనే గుమస్తా స్థానానికి అర్హత సంపాయించాడు.

జమాఖర్చులు సరిచూస్తున్న బన్సీకి ఎన్నిసార్లు కూడికలూ, తీసివేతలూ వేసి చూసినా ఎనిమిది రూపాయిల నలభై పైసలు లెక్కలో తేడా వస్తున్నది; ఆ పొరపాటు ఎలాజరిగిందో తెలీక అతడు బాగా ఆందోళన పడిపోతున్నాడు. ఆసమయంలో ఆఫీసుముందు జీపుకారువచ్చి ఆగినశబ్దంవిని బన్సీ ఉలిక్కిపడి, ద్వారంకేసి చూశాడు. యజమాని జీపుదిగి గబగబా రావటం అకడి కంటబడింది.

బన్సీ కంగారుపడుతూ లేచి నించున్నాడు. యజమాని ప్రతాపసింహబాబు చేతికర్ర వూపుకుంటూ గదిలోకివచ్చి, అతణ్ణి కూచోమన్నట్లుగా కర్రవూపుతూ, "లెక్క పూర్తిచేశావా, బన్సీ?" అని ప్రశ్నించాడు.

"చేశాను, బాబూ!" అన్నాడు బన్సీ, ఆతడికంఠం కాస్త వణికింది.

ప్రతాపసింహబాబు గది కిటికీదగ్గరకువెళ్ళి, బయటికి చూడసాగాడు. ఆతడి ముఖంలో గర్వం, తృప్తి, మందహాసం తొణికిసలాడాయి అల్లంత దూరంలో కొండ బద్దలై పోతున్నది. ఒక్క సంవత్సరకాలంలో అంత పెద్ద పర్వతాన్ని అతడు పిండిపిండి చేశాడు. ఆపర్వతలోయలో అతడొక వంతెన కట్టబోతున్నాడు. దానివల్ల ఆచుట్టుపక్కలవుండే ప్రజలకు కలగబోయే సౌకర్యంగురిచి అతడేనాడూ ఆలోచించలేదు. అతడి ఆలోచనలన్నీ వర్షాకాలానికి ముందుగా తానా వంతెనపని పూర్తిచేస్తే, తనకురాబోయే అయిదులక్షల రూపాయిలలాభం గురించే. ఈక్షణం లోనూ అతడు ఆ లాభంగురించే ఆలోచిస్తున్నాడు. తుపాకిమందు పేలుడుకు ఎగిరెగిరి పడుతున్న రాళ్ళముక్కలు అతడికళ్ళకు వెండీ బంగారపు ముక్కల్లా కనబడుతున్నాయి.

కొండదారివెంట గ్రామంకేసి సాగే కాలిబాటమీద గబగబా పరిగెత్తి పోయే గంగను కిటికీ దగ్గర నిలబడి మంగులు ఆకలికళ్ళతో చూడసాగాడు. ఒకటి రెండు క్షణాల్లో గంగ కొండమలుపుతిరిగి కనుమరుగై పోయింది. మంగులు ఒక్కసారి నిట్టూర్చి, వెనుదిరిగి, "బస్సీ బాబాయ్!" అన్నాడు బిగ్గరగా.

"ఏమిట్రా?" అన్నాడు బస్సీ విసుగ్గా.

"నీ కూతురు చూస్తూండగానే తొలకరి మేఘంలా యింతదింతై పోయింది. తొందరగా ఆ మూడుముళ్ళు వేయించు. వయసు ముదిరితే మనసునిలవదంటారు," అన్నాడు మంగులు

"మంగులూ!" అంటూ బస్సీ గర్జించాడు. వృద్ధాప్యంతో ముడతలుపడిన అతడి దేహం పండుటాకులా అల్లల్లాడి పోయింది. అతడి కళ్ళు నిప్పులు చెరగ సాగాయి. అతడు మంగులుకేసి తీక్షణంగా చూస్తూ, "జాగర్త. మళ్ళీ ఎప్పుడైనా నా కూతురు వూసెత్తావో, వూరుకునేది లేదు," అన్నాడు.

ఈ మాటల్తో మంగులునోరు మూతపడి పోయింది. కాని, బస్సీ యిచ్చిన డబ్బు తీసుకుని కాయితంమీద వేలిముద్ర వేస్తున్న ముసలికూలీ ఒకడు, "మంగులు మాటల్లో అంత కోపం తెచ్చుకోవల్సిం దేముంది—బస్సీ. అతడన్నదాంట్లో తప్పేమీ లేదు. వయసు పొంగునీ, వరదపొంగునీ ఆపడం మనతరం అవుతుందా?" అన్నాడు.

బస్సీ జవాబేమీ చెప్పలేక పోయాడు. తల వంచుకుని మౌనంగా నోట్లు లెక్క పెట్టటం ప్రారంభించాడు. అతడికి మంగులన్న మాటల్లో కొంత నిజం వున్నట్టు తోచసాగింది — నిజమే మరి — గంగ యుక్తవయస్కురాలైంది. కాని, మంగులు యింత మందిలో అలా వాగవలసిందికాదు. తండ్రిగా తనబిడ్డ బాగోగుల్ని గురించి తనుమాత్రం ఆలోచించటంలేదా? ఎటొచ్చీ, పెళ్ళి చెయ్యాలంటే డబ్బు కావాలి. తనదగ్గిర గుడ్డిగవ్వయినా లేదు. తనకొచ్చే నెలజీతం ఎనభై రూపాయలూ కడుపు నింపుకోవటానికే సరిగా చాలవు...

తండ్రి తనను గురించి పడేబాధ గంగకేమీ తెలియదు. యవ్వనం ఆమె శరీరానికి ఒంపులూ సొంపులూఅయితే తెచ్చింది గాని, మనసులో దాగివున్న పసితనాన్ని మాత్రం పారదోలలేక పోయింది. ఆమెలో చిన్ననాటి చిలిపితనం యింకాపోలేదు. దారివెంటపోతూ—ఏ పిల్ల నెత్తినో మొట్టికాయ వెయ్యటం, ఏ అవ్వనో ఆట పట్టించటం — గంగ యిప్పటికీ చేస్తూనే వుంటుంది. ఆమె పెదాలమీద కదిలే మందహాసం, కళ్ళల్లోని మెరుపూ ఊళ్ళోని యువకుల హృదయాలను గిలిగింతలు పెడు

తూఁటుంది. కాని, గంగ ప్రేమకు పాత్రురాలైనది 'రూప' అనే అమ్మాయి మాత్రమే. ఇద్దరూ గంటలతరబడి వూసులాడుతూ కూచోగలరు.

తండ్రికి కళ్ళజోడు డిచ్చింతరవాత గంగ ఉల్లాసంగా పరుగులుతీస్తూపోయి సెల యేటి దగ్గర నిలబడింది. ఎత్తయిన కొండపైనుంచి కిందికి జారి కొంతదూరం ప్రవహిస్తూపోయిన సెలయేరు నదిలో కలిసిపోతుంది. ఆ సెలయేరు చేసే గలగల ధ్వనులు వింటూ మైమరపుతో గంటలకొద్దీ కాలాన్ని అక్కడ గడిపివేయటం గంగ కలవాటు.

గంగ సెలయేటి దగ్గిర నిలబడి, అది కొండ లోయకేసి మెలికలు తిరుగుతూ ప్రవహించే దృశ్యాన్ని కొంచెంసేపు పారవశ్యంతో చూసి, వెళ్ళి దాని ధారకింద నిలబడింది. చల్లని ఆ నీటిధార గంగ శరీరాన్ని పులకరింపచేసింది. ఏదో నూతనో త్సాహం ఆమెలో పరవళ్ళు తీసింది.

స్నానం అయిపోగానే గంగ ఆ పక్కనేవున్న పంట పొలాల్లోకి పరుగుతీసింది. అక్కడ ఒక జొన్నచేలో ఇద్దరు ముగ్గు రాడపిల్లలు చేరి, చేలో వాలిన పక్షుల్ని పంగలకర్రతో రాళ్ళు విసిరి లేవకొడుతున్నారు. గంగకు అలా పిట్టల్ని తోలటం ఒకసరదా. గంగ అక్కడున్న ఒక పిల్లచేతిలోనుంచి పంగలకర్ర తీసుకుని పిట్టల మీదికి రాళ్ళు విసరటం ప్రారంభించింది. ఉన్నట్టుండి పొలం అవతలివైపునుంచి చిన్న కేక వినిపించింది. ఆ కేక వింటూనే గంగ అదిరిపడింది. ఆమె చేతిలోని పంగలకర్ర జారి కింద పడిపోయింది.

యువకుడొకడు చేతితో ఫాలభాగాన్ని అదిమి పట్టుకుని, చేనుకు అడ్డంపడి నడుచుకుంటూ గంగవున్న చోటుకు వచ్చాడు. గాయంనుంచి కారుతున్న రక్తం అతడి చేతివేళ్ళను తడిపివేసింది. గంగ విశ్చేష్టురాలై అతడికేసి ఓ క్షణకాలం చూసి వణుకుతున్న గొంతుతో, "మీ రెవరు?" అని ప్రశ్నించింది.

యువకుడు జవాబు చెప్పకుండా, గంగకేసి చూస్తూ వుండిపోయాడు. గంగ భయంతో వణికిపోతూ అతణ్ణిమరోసారి ప్రశ్నించబోయి, ఏమనుకున్నదో ఏమో - గిరుక్కున వెనుదిరిగి గ్రామంకేసి పరుగెత్తసాగింది. యువకుడు, "ఆగు, ఆగు," అంటూ కేక వేశాడు; కాని, గంగ లేడిలా పరుగెత్తి ఇల్లుచేరి, మూలనున్న కుండ లోంచి గ్లాసుతో నీళ్ళు తీసుకుని ఒక్క గుక్కలో తాగేసింది. పరుగెత్తిరావటం వల్లా, భయంవల్లా ఆమెగొంతు అర్చుకుపోయింది. గుండెలు దడదడ కొట్టుకో సాగాయి. గుండెలమీద చేయి వేసుకుని గంగ వాకిట్లోకివచ్చి, అక్కడ ఆడు కుంటూవున్న శరత్, మంజులాలకేసి కన్నార్పకుండా చూడసాగింది. ఆడుకుంటున్న



శరత్, మంజూలు ఆటచాలించి గంగకేసి ఆశ్చర్యంగా చూడసాగారు. అది గమనించిన గంగ తమ్ముళ్ళను, "ఏవిట్రా, అలా గుడ్లుమిటకరించి నాకేసి చూస్తారు?" అని అడిగింది.

"అక్కయ్యని చూస్తూన్నాను. అంతదప్పికయిందా? గ్లాసుడు నీళ్ళు గుటుక్కున మింగేశావ్?" అన్నాడు మంజూ.

మంజూ యిలా అనగానే గంగకు మరింత భయంవేసింది. ఆమె తమ్ముడితో ఏమీ అనక పక్కనేవున్న రూప యింటికేసి గబగబా నడిచింది. రూప, గంగ వయస్కురాలే. ఆ ఇద్దరిదీ బాల్యస్నేహం. రూపతండ్రి గంగతండ్రి బసీకన్నా బాగా వున్నవాడు. అయినా అది వాళ్ళిద్దరి స్నేహానికి ఏనాడూ అడ్డుగోడగా నిలవలేదు.

గంగ ఇంట్లోకి రావటం చూస్తూనే రూప ఎదురువచ్చి ఆమె చేయి పట్టుకుని, "ఏవిటి సంగతి? అలా వున్నావేం?" అని అడిగింది.

"కొంప మునిగిందే— రూపా," అన్నది గంగ ఆయాసపడుతూ.

"ఏం జరిగింది?"

"భలేదెబ్బ తగిలింది."

"ఎవరికీ, నీకా? ఎక్కడ?" అంటూ రూప స్నేహితురాల్ని నఖశిఖపర్యంతం పరీక్షించి చూడసాగింది.

"దెబ్బ నాక్కాదు... అతనికి," అన్నది గంగ

"అతనెవరు?"

గంగ బెదురుగా చుట్టూ ఓమారుచూసి జరిగిందంతా రూపకు చెప్పింది.

"ఇంతకీ అతనెవరు?" అన్నది రూప

"అతను మన ఊరువాడు కాదు. నే నిదే అతన్ని మొదటిసారిగా చూ[illegible]ం నాన్నకి తెలిస్తే తప్పకుండా కొడ్తాడు," అన్నది గంగ.

"నువ్వు కంగారుపడకు. అతణ్ణి నువ్వూ ఎరగవు. నిన్నతడూ ఎరగడు ఇంక యీ సంగతి మీనాన్న కెలా తెలుస్తుంది?" అన్నది రూప.

"అదీ నిజమేనేవ్? నా గాభరాలో నేనా సంగతే ఆలోచించలేదు. ఆరిభగవంతుడా!" అంటూ గంగ బరువంతా దిగిపోయినట్టు నిట్టూర్చింది.

ఇంతలో వాకిటివైపునుంచి ఎవరో వస్తున్న చప్పుడైంది. స్నేహితురాళ్ళిద్దరూ నిశ్శబ్దంగా మంచంమీద కూచుని వాకిటికేసి చూడసాగారు. అంతలో "రూపా!" అన్న పిలుపు వినిపించింది. రూప జవాబివ్వబోయేంతలో ఆ పిలిచినవ్యక్తి లోపలికి వచ్చేశాడు.

రూప అతణ్ణిచూస్తూనే గతుక్కుమని "అదేవిఁటి, మోహనన్నయ్యా?" అన్నది.

ఆవచ్చిన వ్యక్తిని చూడగానే గంగ భయకంపితురాలైంది. అతడి నుదుటిమీద గడ్డకట్టిన నెత్తురు ఎర్రగా మెరుస్తున్నది. రూప తన స్నేహితురాలికేసీ, అన్నకేసీ ఓమారుచూసి, ఏదో అర్థమయిందన్నట్టు తలాడించి, "ఆగాయం ఏవిఁటి? ఎందుకయింది?" అని ప్రశ్నించింది.

"మీవూరి కొంటెపిల్లెవరో తల పగలగొట్టింది," అంటూ మోహన్ రూప పక్కనే నిలబడివున్న గంగముఖంలోకి చూశాడు.

"అయితే, నువ్వూ ఆపిల్లకు తగినశాస్తి చేసివుంటావ్ - అవునా?" అన్నది రూప చిరునవ్వు నవ్వుతూ.

మోహన్ జవాబు చెప్పబోయేంతలో, పెరటివైపు గదిలోనుంచి రూపతల్లి అక్కడికివస్తూ, "అయ్యో, అయ్యో! అదేవిఁటి? ఎవరా దుర్మార్గులు, అంతగాయం అయేలా కొట్టారు?" అన్నది.

గంగ ఆమాటలువింటూ గజ గజ వణికిపోయింది; కళ్ళు తిరగసాగాయి. అది

గమనించిన మోహన్ చిరునవ్వు నవ్వుతూ, "తప్పంతా నాదేపిన్నీ. పిట్టల్ని తోలేందుకు విసిరినరాయి నాకుతగిలింది. ఆపిల్ల తప్పేంలేదు," అన్నాడు.

"ఈవూరి పిల్లముండలసంగతి నీకు తెలియదురా, బాబూ! కాస్త అందమైన ముఖం కనబడిందేమో... దిష్టితగిలింది," అంటూ రూపతల్లి కూతురుకేసి తలతిప్పి, "అట్లా గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డావేం? వెళ్ళి పొయ్యిమీద నీళ్ళు పెట్టు, కాపువేద్దాం. నెత్తురు బాగా కారిపోలేదుగదా, బాబూ?" అన్నది.

"లేదు, పిన్నీ" అన్నాడు మోహన్.

కూతురు అక్కణ్ణించి కదలటం ఆలశ్యం అయేసరికి రూపతల్లి గంగతో, "నువ్వయినా త్వరగావెళ్ళి కాసినీళ్ళుపెట్టు," అన్నది.

గంగ వెళ్ళిపోగానే, మోహన్, "పిన్నీ, యీగంగ ఎవరు?" అని అడిగాడు,

"మన పొరుగింటిపిల్ల... చాలా నిదానస్తురాలు, రూపదీ దానిదీ ఒకచేప్రాణం అనుకో," అన్నది రూపతల్లి.

పావుగంట తరవాత గంగ వేడినీళ్ళ గిన్నెతో రూపతల్లీ, మోహన్‌వున్న చోటుకువచ్చింది. రూపతల్లి గంగతో, "ఈ అబ్బాయి ఎవరోకాదు, మాఅప్ప కొడుకేనే, గంగా!" అనిచెప్పింది. గంగ తలవంచుకుని గిన్నెను రూపతల్లికిచ్చి వెనుదిరగబోయేంతలో ఆమె గంగను ఆగమనిచెప్పి, "నువ్వేకాస్త యీనీళ్ళతో అబ్బాయి గాయానికి కాపుపెట్టు. నేను యిప్పుడే పాలుకాచి తీసుకొస్తాను," అని గంగకు తిరిగి గిన్నెయిచ్చి గదిలోకి వెళ్ళిపోయింది.

గంగ ఏమిచేయటానికీ తోచక గిన్నె అలాపట్టుకుని నిలబడిపోయింది. మోహన్ మంచంమీద కూచుని ఆమెకేసే రెప్పవేయకుండా చూస్తున్నాడు. గంగ కొంచెంసేపు తటపటాయించి చివరకు గుండెదిటవుతెచ్చుకుని, మోహన్‌ను సమీపించి వణికేచేతుల్తో వేడినీటముంచిన బట్టను మెల్లిగా ఆతడి నుదుటిపై వుంచింది.

"అబ్బా, మెల్లిగా!" అంటూ వేడికి తట్టుకోలేక మోహన్ మూలిగాడు.

గంగ చప్పున ఆతడి నుదటిమీదనుంచి బట్టతీసివేసి కొంచెంఆగి మళ్ళీ అద్దసాగింది. మోహన్ ఆమె ముఖంలోకి ఓమారు చిత్రంగాచూసి "ఇది తమాషాగా లేదా? నువ్వేకొట్టావు, నువ్వే చికిత్సచేస్తున్నావు," అన్నాడు.

గంగ సిగ్గుతో కుంగిపోయింది; కాని, అక్కణ్ణించి పారిపోయేందుకు అవకాశం లేదు. ఆమె నేలచూపులుచూస్తూ బట్టను మరోసారి వేడినీళ్ళలోముంచి, మోహన్ నుదుటి గాయంమీద గట్టిగా అద్దింది. మోహన్ ఆవేడికి తట్టుకోలేక గట్టిగా పళ్ళుబిగించి కళ్ళు మూసుకున్నాడు.

"ఊహుఁ," అంటూ గంగ అడ్డంగా తలాడించింది.

"అలా అయితే పాట వినబడగానే చెట్లదగ్గిర కెందుకొచ్చావ్ ?"

"నేను... నేను తొందరగా యింటికిపోవాలి. దారినపోయే ఆడపిల్లల్ని అటకా యించటం మా ఊరి మర్యాదకాదు," అన్నది గంగ.

"అవున్లే, వూరుగూరి మగపిల్లల తలలు బద్దలుకొట్టటం మీ ఊరి మర్యాద," అన్నాడు మోహన్.

"జరిగిపోయిన పొరపాటుకు చాలా బాధపడుతున్నాను. ఆ రాయి విసిరింది నేనే–అని మీ పిన్నితో ఎందుకు చెప్పలేదు ?" అన్నది గంగ.

మోహన్ ఆమె కళ్ళలోకి కొంటెగా చూస్తూ, "ఇది తియ్యటి బాధకు కారణం అయిందిగనక చెప్పలేదు. అది సరే, గంగా ! ఈ నుదుటిగాయం నాలుగు రోజుల్లో మానిపోతుంది. హృదయంలో నువ్వుచేసిన గాయం జీవితాంతంవరకూ మానేది కాదుగదా !" అన్నాడు.

గంగ గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ఆమెకు ఏమనాలో పాలుపోలేదు. ఒకటిరెండు క్షణాలు మౌనంగా వూరుకుని హఠాత్తుగా చేయెత్తి, దాపులనున్న ఒక పొదకేసి చూపుతూ, "పాము ! పాము !" అన్నదామె.

మోహన్ గిరుక్కున వెనుదిరిగి పొదకేసి నడిచాడు. ఇంతలో గంగ భుజాన కడవతో ఊరికేసి పరిగెత్తసాగింది. ఆ పరిగెత్తటంలో కాలికి ఎదురుదెబ్బ తగిలి ఆమె కింద పడటం మట్టికడవ ముక్కలు చెక్కలై పోవటం, బట్టలన్నీ తడిసిపో వటం — అంతా క్షణాలమీద జరిగిపోయింది

మోహన్ అదిచూసి తనకేసి వచ్చేంతలో గంగ లేచి గబగబా ఊరుచేరింది. ఆ తరవాత మధ్యాహ్నంవేళ గంగ మరో కడవతో నదికిపోయి మంచినీళ్ళు తెచ్చు కున్నది. ఈ జరిగిన సంగతి రూపతో చెప్పేందుకు గంగకు ఆ పగలల్లా వీలు దొరకలేదు. రాత్రికి ఆమె ఇంటికి వచ్చినప్పుడు, గంగ ఆ ఉదయం జరిగిన సంగ తంతా చెప్పింది

అంతా విన్న రూప ముఖం అదోలాపెట్టి, "ఇంతకీ, మా మోహన్ అన్నయ్య నీ కంటికి ఎలా కనబడతాడే, గంగా ?" అని అడిగింది.

"మనిషి బాగానే వుంటాడు, మనసే చెడ్డది," అన్నది గంగ.

"ఓహో, నీకు మనుషుల మనసుల్లోని మంచిచెడ్డలు తెలుసుకునేంత తెలి వొచ్చిందన్నమాట! ఇప్పుడేపోయి అన్నయ్యతో నీ వన్నమాటలు చెపుతానుండు,"



అంటూ రూప తన ఇంటికి పరిగెత్తింది. ఆమె నడవదాటి మోహన్‌కోసం చూసేంతలో వంటగదిలో నుంచి తల్లీ మోహన్‌ల సంభాషణ వినబడసాగింది.

"నువ్వు, జీవన్‌ని ఎరుగుదువుగదా, పిన్నీ!" అంటున్నాడు మోహన్

"వాడేగా .... నీ చిన్ననాటి స్నేహితుడు." అన్నది రూప తల్లి.

"అవును! వాడే. వాడిప్పుడు డాక్టరయ్యాడు. నువ్వు సరేనంటేమన రూపకి సంబంధం కుదుర్చుతాను. వాడికి వేరే ఆస్తిపాస్తులుకూడ వున్నవి," అన్నాడు మోహన్.

"దానికి నేను సరేఅనటం ఏమిటి? అది నీ చెల్లెలు-నీయిష్టంఅయినవాడి చేతిలో పెట్టు," అన్నది రూపతల్లి

ఈ సంభాషణవిన్న రూపకు ఆశ్చర్యం, ఆనందంకూడా కలిగింది. ఆమె వెంటనే తిరిగి గంగ దగ్గిరకు పరిగెత్తి తాను విన్నదంతా ఆమెకు చెప్పింది.

ఆ మర్నాడు పండగరోజు. అందరూ నదికి స్నానానికి పోతున్నారు. గంగకూడ నదికి పోవాలనుకుని రూపకోసం వెళ్ళింది రూప వరండాలో గాజులశెట్టిముందు కూచుని గాజులు తొడిగించుకోబోతున్నది. ఆమె గంగ రావటం చూసి సంతోషంగా, "సమయానికొచ్చావ్, ఏ రంగుగాజులు వేయించుకోమంటావో, చెప్పు!" అన్నది.

గంగ గాజుల మలారాలు పరీక్షిస్తున్నంతలో, రూప శెట్టిని, "ఈ రంగు గాజులు బావుంటాయా?" అంటూ ఒక మలారంలోవి గాజులు చూపించింది.

''భేషుగ్గా వుంటాయి. ఈ గాజులు వేయించుకోవటమే ఆలస్యంగా అటు పందిట్లో బాజాలు మోగుతాయి,'' అన్నాడు శెట్టి నవ్వుతూ.

గదిలోనుంచి బయటికొస్తున్న మోహన్ యీ మాటలువిని ఫక్కున నవ్వాడు. గంగ అదిరిపడి, తడబడే మాటల్తో, ''రూపా! నువ్వు నదికి స్నానానికొస్తావా?'' అని అడిగింది.

''వస్తాను. ముందు గాజులు వేయించుకోనియ్. అమ్మ యింట్లోలేదు. రాగానే బయలుదేరుదాం,'' అన్నది రూప.

"ఎప్పటికొస్తుందో! మరీ పొద్దెక్కితే నేను రాను." అన్నది-గంగ.

"అంత తొందరగా వుంటే, పో," అన్నది రూప. గంగ లేవబోయింది. కాని రూప ఆమెను చేయిపట్టుకుని ఆపి, "నువ్వు గాజులువేయించుకోవా?" అని అడిగింది.

"ఊహుం."

"ఏం, ఎందుకని?"

"ఇలాంటి కనబడినవన్నీ వేయించుకునేందుకు నా దగ్గిర ఖజానా ఏంలేదు." అన్నది. గంగ విసుగ్గా.

"నాదగ్గిరా లేదు. అన్నయ్య చెప్పాడని వేయించుకుంటున్నాను. కావలిస్తే నువ్వు కూడా వేయించుకో," అన్నది రూప.

"ఊహుం; వద్దు. పరాయివాళ్ళ డబ్బుల్తో గాజులు వేయించుకోవటం నాకిష్ట ముండదు," అంటూ గంగ లేచి తన ఇంటికేసి పోయింది. గంగ అన్న యీ చివరి మాటలు మోహన్ మనస్సును బలంగా తాకాయి-పరాయివాళ్ళడబ్బుతో....

గంగ నదికి స్నానాకి వెళ్ళేవేళకు అక్కడ జనం పలచబడిపోయారు. గంగ అందరూ మామూలుగా స్నానాలుచేసే ప్రదేశానికి కొంత దిగువగా పోయి నదిలో దిగింది; నదీ తరంగాలు ఆమె శరీరాన్ని గిలిగింతలు పెట్టసాగాయి. చల్లటినీరు శరీరాన్ని తాకగానే ఆమెకు ఏదో మధుర సంగీతలహరిలో తేలిపోతున్నట్టు అనుభూతి కలిగింది.

అరగంట తరవాత స్నానం ముగించి గంగ నదిలోనుంచి ఒడ్డుకు వచ్చింది. ఆమె కట్టిన పల్చటిచీరె శరీరానికి అంటుకుపోయి ఆమె యవ్వనశోభను ప్రస్ఫుట పరుస్తున్నది; నీటి బిందువులు శరీరంమీద ముత్యాల్లా మెరుస్తున్నాయి. నదీ జలంలో తన ప్రతిబింబం కనబడి సిగ్గుచెందిన గంగ బట్టలు మార్చుకునేందుకు పొదల చాటుకు వెళ్ళింది.

పొడిబట్టలు కట్టుకునివచ్చి, గట్టుమీద తాను లోగడ పెట్టిన హారతిపళ్ళెం



అందుకోబోయినగంగ ఓ క్షణకాలం స్తబ్ధురాలై పోయింది. పళ్ళెం పక్కనే పచ్చ గడ్డిమీద కొన్ని రంగురంగుల గాజులు పడివున్నాయి. వాటికేసి ఓ క్షణకాలం చూసి

గంగ హారతిపళ్ళెం తీసుకుని బయలుదేరబోయేంతలో, వెనకనుంచి, "ఆగాజులు తీసుకోవా, గంగా?" అన్నమాటలు వినిపించినై.

గంగఆగి తలతిప్పిచూసింది. మోహన్ చెట్లచాటునుంచి బయటికివచ్చి, ఆమెను సమీపించాడు. గంగ జవాబుచెప్పేందుకు భయపడిపోయింది. మోహన్ గాజుల్ని అందుకుని, ''చెయ్యిచాపు గంగా! ఎందుకంతసిగ్గు? నేను పరాయివాణ్ణా? ఈగాజుల్లో నాప్రేమను దాచాను,' అన్నాడు

గంగ జవాబేమీ చెప్పకుండా ముఖం పక్కకు తిప్పుకుని, హారతిపళ్ళెం తీసుకోబోయింది. మోహన్ మరోఅడుగు ముందుకువేసి, "గంగా! ఈగాజుల్ని నువ్వు తీసుకోకపోతే - యీగాజుల్నికాదు - నాప్రేమనే తిరస్కరించినట్టుగా నేను భావిస్తాను,'' అన్నాడు.

ఆమాటలువిని గంగ గతుక్కుమన్నది. అర్ధనిమీలితనేత్రాలతో ఓసారి మోహన్ కేసి చూసి, వణుకుతున్న పెదవిని పంటితోనొక్కి, ముఖాన్ని పమిట కొంగులో దాచుకుంటూ చేతిని మోహన్ వైపు చాచింది. మోహన్ ఒక్కొక్కటిగా గాజులన్నిటినీ గంగచేతులకు తొడిగాడు. మోహన్ తిరిగి ఏప్రేమవాక్యాలు చెప్పక ముందే గంగ హారతిపళ్ళెం తీసుకుని ఊరివేపుకు పరుగుతీసింది.

ఆరాత్రి బసీ్వ ఆఫీసునుంచి వానలోతడిసి ఇల్లుచేరాడు. ఇంట్లో గంగలేదు. శరత్ నీ, మంజూనీ అడిగితే ఎక్కడికెళ్ళిందో తమకు తెలియదన్నారు. ఎంత సేపు ఎదురుచూసినా గంగ రాకపోయేసరికి, బస్విక్ తనకూతురు ఏమయిందో అన్న బెంగ పట్టుకున్నది కొడుకులిద్దర్నీ పంపి వాడంతా వెతికించాడుగాని, గంగకనిపించలేదు.

బస్వికి భయంతోపాటు కూతురుమీద ఎక్కడలేని కోపమూ కలిగింది. అతడు ఇస్సురుస్సురంటూ మంచంమీద ముడుచుకు పడుకున్నాడు. పక్కింటినుంచి రూప వచ్చింది, తన స్నేహితురాలికోసం. బస్వి కూతురింకా ఇంటికిరాలేదనిచెప్పి పెద్దగా విట్టూర్చాడు.

"కంగారెందుకు బాబాయ్? వర్షంమూలాన ఎక్కడో ఆగివుంటుంది. వస్తుందిలే," అన్నదిరూప.

"వయసొచ్చినపిల్ల యీచీకట్లో ఎక్కడెక్కడో తిరగటం మంచిదికాదమ్మా. రోజులు బాగాలేవు,'' అన్నాడు బస్వి. బస్విమాట పూర్తయేలోపలే గంగ తలుపు తోసుకుని లోపలికివచ్చింది. ఆమె వర్షంలో బాగాతడిసి ముద్దయిపోయింది.

కూతుర్ని చూస్తూనే బస్వి కఠినంగా, "గంగా ఎక్కడికెళ్ళావ్?'' అని ప్రశ్నించాడు.



"నేనా... గుడికి..." అంటూ గంగ ఓక్షణం ఆగి, "ఈ రోజు ఉపవాసం గదా ప్రసాదం తెచ్చుకుందామని వెళ్ళా," అన్నది.

"ఏదీ ప్రసాదం?" అన్నాడు బన్నీ.

"వానకు తడిసి జావలా కరిగిపోయింది," అన్నది గంగ.

"సరే, వెళ్ళి బట్టలు మార్చుకుని, తల బాగా తుడుచుకో. ఏ జలుబో చేస్తే నానా అవస్థ," అన్నాడు బన్నీ.

గంగతోపాటు రూపకూడా గదిలోకి వెళ్ళింది. వాళ్ళిద్దరూ చిన్నగా మాట్లాడుకో సాగారు. అదే సమయంలో పక్కయింట్లో రూపతల్లి వర్షంలో తడిసివచ్చిన మోహన్‌ని, "ఇంతవానలో ఎక్కడికిపోయావు, బాబూ?" అని ప్రశ్నిస్తున్నది.

"ఎక్కడికా.... గుడికి," అన్నాడు — మోహన్ తడబడుతూ.

"గుడికా?" అంటూ రూపతల్లి ఆశ్చర్యపోయింది.

"అవునుపిన్నీ. ఉపవాసంగదా, ప్రసాదంకోసం పోయాను."

"మరి ఆప్రసాదం తెచ్చినట్టులేదే?" అన్నది రూపతల్లి.

మోహన్ జవాబు చెప్పేందుకు తటపటాయిస్తున్నంతలో రూప లోపలికివచ్చి, "ప్రసాదమా — అది వర్షంలో కొట్టుకుపోయుంటుంది. అంతేనా, అన్నయ్యా?" అంటూ మోహన్‌కేసి చూసి చిరునవ్వు నవ్వింది.

"ఆఁ అవును!... రూప బాగా గ్రహించింది," అన్నాడు మోహన్.

రూపతల్లి పాలుకాచేందుకు వంటగదిలోకి వెళ్ళింది. సమయంకనిపెట్టి రూప మోహన్‌తో, "ప్రసాదం అంతా వానజోరుకు కొట్టుకుపోయిందా? నిజమా?" అన్నది - పెద్దగా నవ్వుతూ.

"చాల్లే... అట్టేవాగకు" అంటూ మోహన్, చెల్లెలి చెవిపట్టుకున్నాడు. అన్నాచెల్లెళ్ళ నవ్వులతో గదంతా మార్మోగిపోయింది.

మర్నాటి ఉదయానికల్లా బస్వీ తీవ్రమైన జ్వరంతో మూలగసాగాడు. రాత్రి వానలో బాగా తడిసిపోవటమే ఆజ్వరానికాకారణం. తనులేచి ఆఫీసుకు వెళ్ళటం సాధ్యంకాదని తెలుసుకున్న బస్వీ, కూతురును సెలవుచెప్పి వచ్చేందుకు యజమాని యింటికి పంపాడు. గంగకు, ప్రతాపసింహబాబు ఇంటికివెళ్ళటం అదే ప్రధమం. ఆమె ఆఇంటిగేటును సమీంచేసరికి సింహంలావున్న కుక్క ఒకటి మొరగసాగింది. దానిఅరుపు వింటూనే వరండాలో చక్రాలకుర్చీలో కూర్చున్న ప్రతాపసింహుడిభార్య తారామతి తలెత్తిచూసి. "ఎవరునువ్వు?" అని ప్రశ్నించింది, గంగను.

యజమానురాలిగొంతు వింటూనే కుక్క మొరగటం మానింది. గంగ గేటుదాటి లోపలికిపోయి తారామతికి నమస్కరించి, "నేను బస్వీ కూతురినమ్మా," అన్నది.

"అలాగా! బస్వీ కూతురివా?" అని అడిగింది.

"నాన్నకి జ్వరంవచ్చింది. అమాట తమతో చెప్పిరమ్మని నన్ను పంపాడు. సెలవుకావాలి," అన్నది గంగ.

తారామతి, గంగను దగ్గిరకుపిలిచి వాత్సల్యంగా తలనిమురుతూ, "నేను వారితో చెపుతాలే. జ్వరం నయమయేవరకూ బస్వీ పనిలోకి రానక్కర్లేదు," అన్నది.

గంగ, తారామతికి మరోసారి నమస్కారంచేసి, వెనుదిరిగి బయలుదేరింది; ఆమె గేటుదాటుతూండగా ప్రతాపసింహబాబు ఎదురయ్యాడు. గంగ దడదడలాడే గుండెతో అతడికి నమస్కారంచేసి, బాగా పక్కకు తప్పుకుని ముందుకు సాగింది. ప్రతాపుడు గేటుదగ్గిరే నిలబడి గంగ యవ్వనపొంకాన్ని తనివిదీరా చూడసాగాడు. అంతలో అక్కడికి మంగులువచ్చాడు.

"ఎవర్రా ఆపిల్ల?" అని అడిగాడు ప్రతాపుడు, మంగుల్ని.

"బస్వీకూతురు గంగ, బాబుగారూ," అన్నాడు మంగులు.

"ఓహో, బస్వీకూతురా!" అంటూ ప్రతాపుడు మీసాలు సవరించుకుని, ఏదో ఆలోచనలో పడిపోయాడు. అతడిలో ఆశా, ఆకలీ భగ్గుమంటూ లేచినై. మంగులు యజమానివాలకం గమనిస్తూనే వున్నాడు.

ఆపగలూ రాత్రీకూడా ప్రతాప్ ఏదో తెలిసీతెలియని తాపంతో సతమతమై పోయాడు. ఉదయాన్నే అతడు బయలుదేరి బస్వీ ఇంటికివెళ్ళాడు. అతణ్ణిచూసి వీధిలో ఆడుకుంటున్న బస్వీకొడుకు శరత్ గబగబా లోపలికి పరిగెత్తి, ఎవరో కొత్తతను తమయింటికేసి వస్తున్నాడని చెప్పాడు. ఆసమయంలో గంగ తండ్రిచేత మందుతాగిస్తోంది. ఎవరాకొత్తవాడు - అనుకుంటూ గంగ కదలబోయేంతలో; ప్రతాపసింహుడూ, వెనగ్గా మంగులూ ఇంట్లో ప్రవేశించారు.

గంగ తెల్లబోయింది. ఇక బస్వీకి పైప్రాణాలు పైనే ఎగిరేనంతపని జరిగింది. ఆనాటివరకూ ప్రతాపసింహుడు తమ ఇంటికేసిరాలేదు. బస్వీకాస్త స్తిమితపడుతూ, "బాబూ... తమరా?" అన్నాడు నమస్కరించి.

"అవునోయ్. నీకు బాగా జ్వరంవచ్చిందనివిని, ఓసారి చూసిపోదామని వచ్చాను' అన్నాడు ప్రతాపసింహుడు. అంతలో గంగ ఓ పాతకుర్చీతెచ్చి ప్రతాప్ ముందుంచి పక్కకువెళ్ళింది. ప్రతాపసింహుడు ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"నాకూతురు - గంగ, బాబూ! సెలవుమాట చెప్పిరమ్మని తమఇంటికి పంపాను," అన్నాడు బస్వీ.

ప్రతాపసింహుడు, గంగ ముఖంకేసి ఆశగా ఓసారిచూసి, బస్వీతో, "చూడు, బస్వీ. జ్వరం పూర్తిగా తగ్గేవరకూ పనిలోకిరాకు. విశ్రాంతితీసుకో," అన్నాడు

"కాని.. పని..." అంటూ బస్వీ తడబడ్డాడు.

"అదంతా మంగులు చూస్తాళ్ళే!" అన్నాడు ప్రతాపసింహుడు. గంగ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

"అవును, బస్వీ. పన్నిగురించి దిగులు పెట్టుకోకు. నీసంగతి విని బాబుగారు రాత్రంతా నిద్రపోలేదు. పొద్దున్నలేస్తూనే నిన్నుచూడ్డాని కొచ్చారు." అన్నాడు మంగులు.

బస్వీ ఏదో అనబోయేంతలో ప్రతాపసింహుడు జేబులోంచి ఒకవందరూపాయిల కాయితంతీసి అతడిచేతిలో పెట్టాడు. బస్వీ తెల్లబోయాడు. అతడిచేతులు వణికాయి అది గమనించిన ప్రతాపుడు, "ఉంచవోయ్! మందూమాకులు కొనేందుకు పనికొస్తుంది," అన్నాడు.

బస్వీ తన యజమానిలో దయ అనేదాన్ని చూడటం యిదే మొదటిసారి. కాని, అతడికి అంతమొత్తాన్ని దానంగా పుచ్చుకోవటం యిష్టంలేదు. ప్రతాపసింహుడు అతడి మనోభావాన్ని గుర్తించినవాడిలా, "సందేహించకు. ఆవందరూపాయిలూ నీ జీతంనుంచి కొంచెం కొంచెంగా మినహాయించుకుంటాలే," అన్నాడు.

ఇంతలో గంగ గదిలోనుంచి షర్బత్‌గ్లాసుతో వచ్చింది. యజమాని తనపై చూపుతున్న ఆదరానికి ఆమెమనసు కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. ప్రతాప సింహుడు ఆమె అందించిన షర్బత్‌తాగుతూ, ఆమె యవ్వన సౌందర్యాన్ని చూస్తూ తన్మయుడై పోయాడు.

# 3

కృష్ణాష్టమీ పండగదినాన బస్వీ పెందరాళే ఆఫీసునుంచి యింటికొచ్చాడు. అతడు ఇంట్లో అడుగుపెడుతూనే గోడవారగా అమించివున్న పళ్ళబుట్టలూ, మిఠాయి గంపలూ చూసి అమితాశ్చర్య పడ్డాడు. ఇంతలో గంగ అక్కడికొచ్చి, ''ప్రతాప్ బాబుగారు పంపారు, నాన్నా.'' అని చెప్పింది.

''పంపారా? లోగడ ఏనాడూ ఆయన యిలా పంపిందిలేదే!'' అన్నాడు బస్వీ.

"ఏమో, యీ సంవత్సరం కంట్రాక్టుల్లో బాగాలాభం వచ్చిందేమో!" అన్నది గంగ అమాయకంగా.

బస్వీకి అంతా అయోమయంగా వున్నది. కోటువిప్పి గంగకిచ్చి అతడు ఆలోచనల్లో మునిగిపోయాడు. రాయిలాంటి యజమాని మనసు వెన్నలా ఎందుకు కరిగిపోతున్నదో అతడికి అర్థం కాలేదు. స్వయంగా ఇంటికి రావటం, వంద రూపాయిలు యివ్వటం, జీతం పెంచుతానని మాటయివ్వటం, పండగనాడు సెలవు-పళ్ళూ మిఠాయిలూ! బహుశా, దీనికంతకూ కారణం యజమానురాలేమో అనిపించింది, బస్వీకి. ఆమె గంగని చూచినప్పటినుంచీ పిల్లలక్షేమం సంగతి అడుగుతూనే వున్నది.

"అమ్మగారు నన్ను యింటికి రమ్మని కబురుచేశారు. వెళ్ళనా నాన్నా!" అన్నది గంగ

బస్వీ ఆలోచనల్లోంచి బయటపడి, "వెళ్ళక తప్పుతుందా, అమ్మా!" అన్నాడు సంశయిస్తూ.

తండ్రి అనుమతి సంపాయించిన గంగ, ప్రతాపసింహుడి యింటికి వెళ్ళింది. ప్రతాపుడి కుంటిభార్య తారామతి గంగను యోగక్షేమాలడిగి, కబుర్లలో పెట్టింది. గంగ ఆమెకు బత్తాయిపండు ఒలిచియిస్తూండగా ప్రతాపుడు వాళ్ళున్న గదిలోకి వచ్చి, గంగను చూస్తూనే నల్లటి పెదాలు నాలుకతో తడుపుకుంటూ, "తారా! ఆ మధ్య నీకు పనులుచేసి పెట్టటానికి ఒకమనిషి కావాలన్నావుగదా?" అన్నాడు.

"అవును, కావాలి," అన్నది తారామతి.

"అందుకు, యీ బస్వీకూతురు ఎలా వుంటుందంటావ్ ?" అన్నాడు ప్రతాపుడు

"పిల్ల మంచిదే... కాని, బస్వీ ఒప్పుకోవద్దూ," అన్నది తారామతి.

"బస్వీ ఎప్పుడైనా నా మాట కాదన్నాడా ? అతడికి డబ్బు చేదా ఏం. ఇటు నీ కోరికా తీరుతుంది, అటు బస్వీకి నాలుగు డబ్బులు చేతికొస్తాయి," అంటూ ప్రతాపసింహుడు మరోసారి గింగను నఖశిఖ పర్యంతం పరీక్షగాచూసి, బయటికి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన మర్నాడు మంగులు, బస్వీ ఆఫీసులో ఒంటరిగా వుండటం చూసి, అతడి పక్కనచేరి ఒక బీడీ ముట్టించి, బస్వీకొకటి యిచ్చాడు. బస్వీ బీడీ ముట్టించి ''మంగులూ ! ఒక మాటడుగుతాను, నిజంచెపుతావా ?'' అన్నాడు.

''ఏమిటది ?'' అన్నాడు మంగులు.

''యజమానికి ఉన్నట్టుండి, నామీద యింతదయ కలిగిందేమిటి ?'' అని అడిగాడు బస్వీ.

''ఆయనెప్పుడూ దయాగుణం కలవాడే, బాబాయ్,'' అన్నాడు మంగులు.

''ఉహుఁ, నేను నమ్మను,'' అంటూ బస్వీ తల అడ్డంగాతిప్పాడు.

''అది సరేకాని, యీసంగతి విన్నావా, బాబాయ్,'' అన్నాడు మంగులు,

''ఏసంగతి ?"

"ప్రతాపబాబుగారి పెళ్ళిసంగతి, విన్న నేనక్కడ వుండగానే తారామతి అమ్మగారు బాబుగార్ని మరోపెళ్ళి చేసుకుని, ఆస్తికి వారసుల్ని కనమంటున్నది," అని చెప్పాడు మంగులు.

"నిజమే. డబ్బుంది, వయసుంది... పిల్లలులేరాయె. అమ్మగారు కూడా బలవంతం చేస్తూంటే, యిక ఎలా తప్పుతుందిలే,'' అన్నాడు పరధ్యానంగా.

మంగులు కొంచెం ఆగి, "గంగకి ఎక్కడన్నా సంబంధం చూశావా ?'' అని ప్రశ్నించాడు. లేదన్నట్టు బస్వీ తలాడించాడు.

"నా ఎరుకలో ఒక సంబంధం వుంది, బాబాయ్. సరేనన్నావంటే గంగ బతికి నన్నాళ్ళూ మహారాణిలా బతుకుతుంది." అన్నాడు మంగులు.

"దానికంత అదృష్టం ఎక్కడుందిలే," అన్నాడు బస్వీ నిస్పృహగా.

మంగులు గట్టిగా బీడీదమ్ములాగి, బస్వీకి మరింత దగ్గిరగాజరిగి, "గంగ అదృష్టవంతురాలు కాకేం. పెళ్ళికొడుకు మరెవరోకాదు... మన ప్రతాపబాబు గారే. నువ్వు ఊఁ అంటేచాలు, ఆయన ఒప్పుకుంటారు," అన్నాడు.

"మంగులూ !'' అంటూ గర్జించాడు బస్వీ. అతడు నిలువెల్లా వణకసాగాడు.

కళ్ళు చింతనిప్పుల్లా అయాయి. నోటమాట పెగలక, మంగులుకేసి రౌద్ర మూర్తిలా చూస్తూ, గదినుంచి బయిటికి పొమ్మన్నట్టు సైగచేశాడు. తను బీదవాడేకావచ్చు, కటికదరిద్రుడే అయుండొచ్చు. కాని, ధనంకోసం కూతుర్ని అమ్ముకునేంత నీచుడూ, సిగ్గుమాలినవాడూ మాత్రంకాదు —

రాత్రి బస్వి యింటికి వచ్చేసరికి గంగ వరండాలో కూచుని కూనిరాగం తీస్తూ, బియ్యం చెరగుతోంది. తండ్రి రావటంచూస్తూనే ఆమె బియ్యంచేట కిందపెట్టి తండ్రి అందిచ్చినకోటు తీసుకుంటూ. "నాన్నా నేనివ్వాళ ఎక్కడికెళ్ళొచ్చానో, తెలుసా?" అనడిగింది ఉత్సాహంగా.

"ఊఁ హుఁ," అన్నాడు బస్వి ఏదో ఆలోచిస్తూ.

"తారామతమ్మ గారి దగ్గరికి ..."

అమ్మగారు అన్నమాట వింటూనే బస్వి అదిరిపడి కోపంగా కూతురుకేసి చూశాడు. గంగ అది గమనించక, "ఆమెగారు నన్ను తనదగ్గిర పనిచేయటానికి ఉండమన్నది," అన్నది.

"నువ్వేమన్నావ్?" అన్నాడు బస్వి కఠినంగా.

"నాన్ననడిగి చెపుతానన్నాను"

"మంచిపని చేశావు. నీవెవరిదగ్గిరా నౌకరీచేయ నవసరంలేదు — నీతండ్రి యింకా బతికేవున్నాడు —"

తండ్రి ఎందుకనో కోపంలో వున్నాడని గంగ గ్రహించింది. బహుశా యివ్వాళ పని ఎక్కువగా వుందేమో అనుకున్నదామె. అందుకని అతణ్ణి సంతోషపరచాలనుకుని గంగ గదిలోకివెళ్ళి ఒక పట్టుచీరతెచ్చి తండ్రికిచూపుతూ, "అమ్మగారిచ్చారు, నాన్నా." అన్నది అమాయకంగా.

చీరచూస్తూనే బస్వి ఆవేశంతో ఊగిపోతూ, "ఈరకం దానధర్మాలు మన కక్కర్లేదు," అంటూ గంగ చేతిలోంచి చీరలాక్కుని బయటికి విసిరివేశాడు. గంగ భయంతో వణికిపోయింది.

"నేను తీసుకోనన్నాను, నాన్నా! అమ్మగారు బలవంతంచేసి — నీతండ్రి వద్దనడులే... నేచెప్తాగా తీసుకో — అంటూ యిచ్చారు," అన్నది గంగ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

కూతురి కళ్ళనీళ్ళు చూస్తూనే బస్వి చలించిపోయి, ఆమెను ఆప్యాయంగా కౌగలించుకుని గద్గదస్వరంతో, "వద్దమ్మా, నాకంఠంలో ఊపిరుండగా నువ్వు



దాస్యం చెయ్యటం, దానాలు పుచ్చుకోవటం జరగదు. నేను రాత్రింబవళ్లు విద్రాహారాలు లేకుండా పనై నాచేస్తానుగాని, నా తల్లినిమాత్రం శ్రమపెట్టను," అన్నాడు.

రెండు రోజుల తరవాత మోహన్ పట్నం ప్రయాణం పెట్టుకున్నాడు. అక్కడతనికి ఒక పంచదార ఫ్యాక్టరీలో ఉద్యోగం అయింది. అతడు ఆ సాయంత్రం బయలుదేరి పోతున్నాడనగా, ఆ ఉదయంనుంచే గంగకు పుట్టెడుదిగులు పట్టుకున్నది. ఉదయంనుంచీ ఆమె ఇంటిపనేమీ ముట్టుకోలేదు. మోహన్ లేకుండా నేనెలా బతగ్గలను అన్నభావం గంగను విచారంలో ముంచెత్తసాగింది. మోహన్ వెళ్ళేముందు అతణ్ణి ఏకాంతంగా కలుసుకునే అవకాశం ఆమెకు చిక్కేలా కనబడలేదు.

మోహన్‌కూడా అదేస్థితిలో వున్నాడు. ఇద్దరి అవస్థా గుర్తించిన రూప, ఆమధ్యాహ్నం ఒకరినొకరు నదిదగ్గిరకువచ్చి కలుసుకోమని తనకు చెప్పినట్టుగా, మోహన్, గంగలతో నమ్మబలికింది. స్నేహితురాలిలా చెప్పగానే, గంగ బిందె తీసుకుని నదిదగ్గిరకుపోయింది. కొంచెంవెనగ్గా మోహన్ బయలుదేరాడు.

నదీతీరంలోని చెట్లలో యిద్దరూ కలుసుకున్నాక, రూప ఆడిననాటకం యిద్దరికీ అర్థమై, ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. మోహన్, గంగచేతిని తన చేతిలోకితీసుకుని ఆప్యాయంగా నిమురుతూ, "గంగా, రేపు నేను వెళ్ళిపోతున్నాను." అన్నాడు.

"నాకుతెలుసు!" అంటూ గంగ కళ్ళనీళ్ళ పర్యంతమై అతడి వక్షంపై వాలిపోయింది. ఇద్దరూ కొద్దిసేపు నిశ్శబ్దంగా వూరుకున్నారు. అంతలో గంగ కళ్ళనుంచి రెండు నీటిబొట్లు మోహన్ చొక్కామీద పడ్డాయి. మోహన్‌శరీరం గజగజ వణికింది. అతడామెను హృదయానికి హత్తుకుంటూ, "గంగా, నిన్ను నాభార్యగా చేసుకుంటాను," అన్నాడు.

"ఎవరూ అభ్యంతరాలు చెప్పరుగదా?" అన్నది గంగ భయంగా.

"అలాంటివాళ్ళు నాకెవరూలేరు. నాకీలోకంలో వున్నదల్లా ఒక్కపిన్నే. ఆమెతో వెళ్ళేముందు అంతా చెప్పేస్తాను," అన్నాడు మోహన్.

"ఏమని చెపుతారేంటి?" అన్నది గంగ కొంటెగా మోహన్ ముఖంలోకి చూస్తూ.

"మీనాన్నతోచెప్పి, సంబంధం ఖాయంచెయ్యమని. అర్థమైందా?" అంటూ మోహన్, గంగను గట్టిగా కావిలించుకున్నాడు. ఆతరవాత కొంత సేపటికి యిద్దరూ విడివిడిగా — కాస్త వెనకాముందులుగా గ్రామం చేరారు.

ఆ రాత్రి బస్వీ యింటికొచ్చేసరికి రూపతల్లి గుడినుంచి ప్రసాదంతెచ్చి, అతడికిస్తూ, "మోహన్ పట్నం వెళ్ళాడు. వాడికి పంచదార ఫ్యాక్టరీలో ఉద్యోగం దొరికింది," అని చెప్పింది.

బస్వీ చాలా సంతోషం కనబరుస్తూ, "అతడున్నన్నాళ్ళూ పట్టుమని ఓ పావుగంట సేపయినా కూచుని మాట్లాడే అవకాశం దొరకలేదు," అన్నాడు.

"అసలు నీకు తీరికెప్పుడుందన్నయ్యా, ఎప్పుడూపనే. అసలే సగమైపోయావు. సెలవుపెట్టి కాస్త విశ్రాంతి తీసుకో," అన్నది రూపతల్లి.

"శెలవా? నాలుగురోజులు సెలవు తీసుకున్నానంటే, శాశ్వతంగా సెలవుపుచ్చుకోవలసి వస్తుంది. ఎప్పట్నుంచో దీనాపూర్ వెళదామనుకుంటున్నాను. సెలవు దొరకటంలేదు," అన్నాడు బస్వీ నిట్టూర్చుతూ.

"దీనాపూరా?" అని ఆశ్చర్యపోయింది రూపతల్లి.

"అవునమ్మా. అక్కడో కుర్రాణ్ణి చూసిరావాలి. గంగకి ఆ మూడుముళ్ళూ వేయించేస్తే, నా బరువు తీరిపోయినట్టే," అన్నాడు బస్వీ.

"ఆ బరువు తీరే మార్గం నేనాలోచించాలే, అన్నయ్యా. వరుడివంశమూ మంచిదే. చదువూ సంధ్యలూ, సంపాదనా—అన్నీ వున్నాయి," అన్నది రూపతల్లి.

"ఎవరా వరుడు?" అన్నాడు బస్వీ ఆత్రంగా.

"మా మోహనే!"

"మోహనా?" అంటూ బన్సీ ఆనందంతో తబ్బిబ్బయి, "అతనొప్పుకుంటాడా?" అని అడిగాడు.

"వాడు నా మాట ఎలా కాదంటాడు?" అన్నది రూపతల్లి.

బన్సీ కళ్ళు ఆనందాశ్రువుల్తో నిండిపోయాయి. అతడు రూపతల్లి ఇచ్చిన ప్రసాదాన్ని ఒక్కసారిగా నోట్లో వేసుకుని మింగేశాడు. వంటింట్లో కూర్చుని వాళ్ళిద్దరి సంభాషణా వింటున్న గంగకు, రూపతల్లి అన్న ఆఖరుమాటలు వినగానే మనస్సు ఆనంద సాగరంలో తేలిపోసాగింది.

మర్నాటి ఉదయం బన్సీ ఆఫీసుకు కొంచెం ఆలశ్యంగా వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికే ప్రతాపసింహబాబు ఆఫీసులో కూర్చుని వున్నాడు. బన్సీ రావటం చూస్తూనే అతడు చేతి గడియారంకేసి చూసుకున్నాడు.

"కొంచెం ఆలశ్యం అయింది, బాబుగారూ. నా కూతురు పెళ్ళి సంబంధం గురించి మా పక్కింటి జానకీబాయితో మాట్లాడుతూ టైం చూసుకోలేదు. ఆమె అప్ప కొడుకు మోహన్‌కు నా కూతుర్ని యివ్వబోతున్నాను." అన్నాడు బన్సీ సిగ్గుపడుతున్నట్టు.

గంగ పెళ్ళికబురు ప్రతాపసింహుడికి పిడుగుపాటులా తోచింది. బన్సీ, తనకు ఏదో పెద్ద దుఃఖవార్త చెప్పినట్టుగా, అతడు బన్సీకేసి కొరకొరలాడుతూ చూసి, బయిటికి వెళ్ళిపోయాడు. సంబంధం కుదిరిందనివిన్నాక, యజమాని తన కూతురి జోలికిక రాడని బన్సీ మనసును దిటవుచేసుకున్నాడు.

ఆరాత్రి ఆఫీసుమూసి, తాళంచెవులిచ్చేందుకు బన్సీ, ప్రతాపసింహుడి బంగళాకెళ్ళాడు. తారామతి పుస్తకం చదువుకుంటున్నదల్లా దాన్నిమూసి, "ఏం బన్సీ, యిలావచ్చావు?" అని అడిగింది.

బన్సీ తాళపుచేతుల్ని ఆమెకిస్తూ, "బాబుగారు ఎవరో ఆఫీసర్ను కలుసుకునేందుకు పట్నం వెళ్తున్నట్టు చెప్పారు. అందుకని తాళపుచేతులు తమరికిచ్చేందుకు వచ్చాను." అన్నాడు.

తారామతి తాళపుచేతులు అందుకుని, "బన్సీ, గంగని నా పనిపాటులు చేసి పెట్టేందుకు వుంచుకోమంటున్నారాయన," అన్నది.

"అమ్మగారూ, మీదయకి చాలా సంతోషం. క్షమించండి. గంగకు సంబంధం కుదిరింది. కుర్రవాడు పరువు ప్రతిష్ఠలున్న కుటుంబంవాడు. గంగ నౌకరీచేస్తుందని తెలిస్తే..." అంటూ ఆగాడు బన్సీ.

"అలాగా. ఆసంగతి నాకుతెలీదు. వివాహం నిశ్చయం అనుకున్నాక, పిల్లను ఎక్కడా నౌకరీ చేయించటం మంచిదికాదు," అన్నది తారామతి.

బస్వీ ఆమెకు నమస్కరించి, ఇంటిదారిపట్టాడు. లోయంతా చీకటిమయంగా వున్నది. కాలిబాట పక్కనున్న రాళ్ళమీదా, చెట్లమీదా మిణుగురు పురుగులు మెరుస్తున్నవి. బాగా తెలిసినదారి కావటంతో బస్వీ చకచకా నడవసాగాడు. అతడలా కొంతదూరం నడిచి, ఆఫీసుండే ఇంటిపక్కగా కొంతదూరం పోగానే, ఆపక్కనే వున్న గోడౌన్ షెడ్డులోంచి సన్ననివెలుగు బయటికి పడుతూ అతడికంటిని ఆకర్షించింది. గోడౌన్ తలుపులు మూసి, లైట్ ఆర్పేయటం మరిచానా, అనుకుంటూ బస్వీ గోడౌన్ కేసి నడిచాడు.

గోడౌన్ కు అల్లంత దూరంలో వున్న రాళ్ళగుట్టదగ్గరకు చేరేసరికి, హఠాత్తుగా గోడౌన్ తలుపులు తెరుచుకుని ఒకస్త్రీ బయిటికివచ్చి, జారినపైటను వక్షంమీద కప్పుకుని, వూడినరవిక ముడివేసుకోసాగింది. లైటువెలుగులో బస్వీ ఆమెను గుర్తించాడు. ఆమె మంచివయసూ, మంచి శరీర సౌష్ఠవంగల ఆకకూలీ లచ్చి!

బస్వీ రాళ్ళగుట్ట వెనకనే ఆగిపోయాడు. ఇప్పుడేం చేయటమాఅని అతడాలోచించేంతలో, లోపలనుంచి ప్రతాపసింహబాబు సిగరెట్ కాల్చుకుంటూ బయిటికి వచ్చాడు. పట్నం వెళ్తున్నట్టుచెప్పి, అతడిక్కడ చేస్తున్న అవినీతి కార్యాలివి అన్నమాట! బస్వీ యిలా అనుకుంటున్నంతలో ప్రతాపుడు, లచ్చిని సమీపించి రెండు కాగితపునోట్లు ఆమెకిచ్చాడు. లచ్చి అవితీసుకుని, "ఇంతేనా ? రెండేనా ?" అన్నది నవ్వుతూ.

"రెండుకాదే, రెండుపదులు ఇరవై రూపాయలు," అన్నాడు ప్రతాపుడు, ఆమె బుగ్గమీద చిటిక వేస్తూ.

"ఇందులోనూ, బేరమేనాదొరా ? ఎలానూ సిమెంటులో యిసక కలుపుతూనే వుంటివి," అన్నది లచ్చి తడబడుతూ. అది కొంచెం తాగినట్టున్నది.

'అట్టేవాగకు. మరోటితీసుకో," అంటూ ప్రతాప్ ఆమెచేతిలో మరోనోటు పెట్టాడు. ఆసమయంలో లచ్చి అకడి చేయికొరికి కిలకిల మన్నది. ప్రతాప్ కూడా నవ్వి, లచ్చిని వెళ్ళిపొమ్మని చెప్పాడు. లచ్చి బయలుదేర బోతూవుండగా, బస్వీ అది తనున్నమార్గానే వస్తుందేమో అని భయపడి గుట్ట అవతలికి తప్పుకునేందుకు కదిలి నాలుగడుగులు వేసేంతలో, కాలికి ఖాళీ కిరసనాయిలుడబ్బా తగిలి ధనధన మంటూ పల్లానికి దొర్లుకుపోయింది.

ఆశబ్దం వింటూనే లచ్చి కెవ్వుమనిఅరిచి ప్రతాపుణ్ణి కావిలించుకున్నది.

"ఎవరది?" అంటూ ప్రతాప్ గట్టిగా కేకపెట్టాడు. ఇక తప్పుకునేందుకు మార్గం లేదని గ్రహించి, బస్వీ, ప్రతాపుడిదగ్గరకు వచ్చాడు. అతణ్ణిచూస్తూనే లచ్చి చీకట్లో పరుగు లంకించుకున్నది.




"నువ్విక్కడేం చేస్తున్నావ్?" అని గద్దించాడు ప్రతాప్.

"సామాన్ల గదిలో లైటుచూసి..."

"అబద్ధం. నన్నువెంటాడి తిరుగుతున్నావ్," అన్నాడు ప్రతాప్ పళ్ళు కొరుకుతూ.

"లేదు, బాబూ!" అంటూ బస్సీ చేతులు నలుపుకోసాగాడు.

"అయితే వెళ్ళు... మాట... యీసంగతి ఎక్కడాఅనకు..."

"మీకా అనుమానం అక్కర్లేదు, బాబుగారూ. మీపరువుపోతే నాపరువు పోయినట్టుకాదా ..." అని బస్సీ వెనుదిరిగి కాళ్ళీడ్చుకుంటూ యింటిదారి పట్టాడు.

బస్సీ ఇల్లు చేరేసరికి చాలాపొద్దుపోయింది. ఈ జరిగినదంతా ఓ పీడకలలా తోస్తున్నదతడికి. కూతురు ఎంతవద్దన్నా వినకుండా పళ్ళెంలో అన్నంపెట్టి తినమని బలవంతంచేసింది. బస్సీ నాలుగుమెతుకులు తిని చేయికడుక్కుని, "నాకోసం ఎవరైనా వచ్చారా, అమ్మా?" అని కూతుర్ని ప్రశ్నించాడు. ఆవచ్చేవా డెవడో యిద్దరికీ బాగాతెలుసు.

"సేట్‌జీ వచ్చాడు, నాన్నా!" అన్నది గంగ.

"ఏమంటాడు?"

"డబ్బు... అతనికి మరేంపనుంది?"

"సరే, రేపుకలుసుకుని మాట్లాడతాలే," అన్నాడు బన్సీ దిగులుగా.

"తప్పకుండాపోయి మాట్లాడిరా, నాన్నా. అతనింటికొచ్చి గొడవపెట్టటం ఏమీ బాగాలేదు," అన్నది గంగ.

"సరే, సరే," అన్నాడు బన్సీ. అతడి మనసులో సేఠ్‌తో ఎలామాటాడాలో, ఏం మాట్లాడాలో అన్న ఆందోళన ప్రారంభమయింది.

# 4

పని ప్రారంభించేందుకు గంటకొట్టి అరగంటయినా కూలీలెవరూ పనిలోకి దిగలేదు. శ్యామూనీ, సుఖియానీ మళ్ళీ పనిలోకి తీసుకుంటేతప్ప, పని ప్రారంభించమని కూలీలంతా పట్టుపట్టి కూర్చున్నారు. బన్సీ వాళ్ళకు నచ్చచెప్పి పని ప్రారంభమయేలా చూడాలని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది.

ఈస్థితిలో ప్రతాపసింహబాబు హడావిడిగా అక్కడికివచ్చి, మండిపడుతూ కూలీల్ని పని మొదలుపెట్టమన్నాడు. మంగులు యజమాని మాటల్ని కూలీ కూలీకి చెప్పిచూశాడు. కాని వాళ్ళేమాత్రం చలించలేదు.

"కూటికిలేని యీవెధవల కందరికీ సమ్మెలూ, చట్టాలసంగతి మాట్లాడటం నేర్పినవాళ్ళెవరు?" అంటూ బన్సీమీద ఎగిరిపడ్డాడు ప్రతాపుడు.

"నాకేంతెలీదు, బాబూ!" అన్నాడు బన్సీ వినయంగా.

"ఎవడోఒకడు వీళ్ళకి బాగా పురెక్కించివుండాలి"

"కావచ్చు, బాబూ!"

"సరే, అందర్నీ తీసేస్తున్నట్లు నోటీసులిచ్చెయ్" అన్నాడు ప్రతాపుడు.

"ఒక్కమనవి, బాబూ!" అన్నాడు బన్సీ జంకుతూ.

"ఊఁ, చెప్పు."

"మనం అలాచేయటం చట్టవిరుద్ధం. పైగా, మనం వీళ్ళతో పేచీపడి కూచుంటే వంతెనపని సకాలంలోకాదు," అన్నాడు బన్సీ.

"చట్టం, చట్టం. అదేం వీళ్ళ బాబుసొమ్మా?" అంటూ ప్రతాపుడు పిడికిళ్ళు బిగించాడు.

"దానిమాటకేం గాని బాబూ, నా మాట విని సుఖియానీ, శ్యామూనీ మళ్ళీ పనిలోకి చేర్చుకోండి," అన్నాడు బన్సీ.

"వీల్లేదు, వీల్లేదు, అది కుదరదు," అంటూ ప్రతాపుడు అరిచాడు.

"తొందరపడకండి, బాబూ. కూలీలంతా ఓ సంగతి చెప్పుకోవటం విన్నాను," అన్నాడు బన్సీ చిన్నగొంతుతో.

"ఏమనీ ?"

"కలువాని మీరు పనిలోకి తీసుకోవటానికి కారణం-వాడు లచ్చి తమ్ముడవటమే అని వాళ్ళు అనుకుంటున్నారు."

"బన్సీ !" అంటూ ప్రతాపుడు బిగ్గరగా అరిచాడు. లచ్చిపేరు వినేసరికి ప్రతాపుడికి వణుకు పుట్టుకొచ్చింది. అతడు అనుమానంగా, భయంగా బన్సీకేసి చూశాడు. బన్సీయే యీ గొడవకంతకూ కారణం అన్న అపోహ అతడి మనసులో మెదిలింది. ఇప్పుడేంచేయాలి ? కొంచెంసేపు ప్రతాప్ అటూఇటూ పచార్లుచేసి, "సరే, వాళ్ళిద్దర్నీ పనిలోకి రానియ్యి," అని చకచకా అక్కణ్ణించి జీపుకేసి నడిచాడు.

జీపు పక్కనే మంగులు చేతులుకట్టుకుని నిలబడి వున్నాడు. ప్రతాపుడు అతడితో "మంగులూ! నువ్విక్కడే వుండు. వాళ్ళందర్నీ ఎవరో రెచ్చగొట్టారు," అన్నాడు.

"ఇందులో మన బన్సీకి భాగం లేదంటారా, బాబూ ?" అన్నాడు మంగులు.

"నా కనుమానంగానే వుంది, వుందంటావా ?"

"కూళ్ళేక మాడిచస్తున్నాడని దయతలిచి మీ రతని కూతుర్ని అడిగినప్పటి నుంచీ, అదోలా ఉంటున్నాడు, బన్సీ. అదీగాక ఆ మధ్య ఓ రాత్రి తమరు... లచ్చితో..."

మంగులు మాట పూర్తిచేసేలోపలే ప్రతాపుడు జీప్ స్టార్ట్‌చేసి వేగంగా వెళ్ళిపోయాడు. ఆ రాత్రి బన్సీ తాళంచేతులు ఇచ్చేందుకు బంగళాకురాగానే, అతడు కోపంగా, "బన్సీ! నువ్వు సేఠ్‌దగ్గిరకూడా పనిచేస్తున్నమాట నిజమేనా ?" అని అడిగాడు.

"నిజమే, బాబూ, ఆతడికి కొంత బాకీపడ్డాను.' అన్నాడు బన్సీ.

"ఇది మోసం. జీతం పుచ్చుకునేది నా దగ్గిరా, పనిచేసేది మరొకళ్ళదగ్గిరా. అందువల్లే కామాలు చిఠా ఖాతాపుస్తకాల్లో అన్నీ తప్పులే దొర్లుతున్నై," అన్నాడు ప్రతాపుడు విసురుగా.

"అలాంటి తప్పులేం లేవు, బాబూ. ఆఫీసు పనయింతరవాత సేఠ్‌జీదగ్గిర రాత్రిళ్లు పనిచేస్తున్నాను," అన్నాడు బన్సీ.

"అదేం లాభంలేదు. ఇకమీద నువ్వు నా దగ్గిర పనిచెయ్యక్కర్లేదు," అన్నాడు ప్రతాపుడు.

బన్సీ గడగడ వణికిపోతూ, "దయతల్చండి, బాబూ! నా బిడ్డలు కూటికి మలమల మాడిపోతారు," అంటూ యజమాని కాళ్ళమీద పడ్డాడు.

"ఉహుం, లాభంలేదు. నీ మీద నాకు నమ్మకంపోయింది," అన్నాడు ప్రతాపుడు.

"ఎన్నో సంవత్సరాలుగా మీ ఉప్పుతింటున్నవాణ్ని...పొట్టకోసం ఏదో అఘాయిత్యానికి నన్ను పాల్పడేలా చేయకండి," అన్నాడు బస్వీ దృఢస్వరంతో.

"ఏం, నన్ను హత్యచేస్తావా?"

"అంతఘోరం నేను చెయ్యలేను, బాబూ! మీ నౌకర్లందర్లోకీ నేను పాతవాణ్ని. నాకూ హక్కులున్నాయి," అన్నాడు బస్వీ.

ఆ మాటల్తో ప్రతాపుడు కాస్త జంకి, "సరే, వెళ్లు. నీ బెదిరింపులకి నేను తల వంచక తప్పదు," అన్నాడు పళ్లుకొరుకుతూ.

"అంతమాట ఎందుకు, బాబూ!''

"కాకపోతే ఏమిటి? నేను లొంగకపోతే, తెల్లవారేసరికి నా రహస్యం ఊరంతా చాటేస్తావు," అన్నాడు ప్రతాపుడు పెదాలు కొరుక్కుంటూ.

"నేనంత నీచుణ్ని కాదు, బాబూ!" అన్నాడు బస్వీ.

"నువ్వు కాకపోవచ్చు, నీ పొట్ట సంగతేమిటి...సరే, వెళ్లు. రేపట్నుంచీ కాస్త ఒళ్ళు దగ్గిర పెట్టుకునిమరీ లెక్కలురాయి." అన్నాడు ప్రతాపుడు శాంతపడినవాడిలా.

బస్వీ యజమానికి నమస్కరించి బయిటికొచ్చేశాడు. బస్వీ గేటు దాటగానే, ప్రతాపుడు ప్రక్కగదిలోవున్న మంగుల్ని పిలిచి, "ఈ బస్వీ నా గుండెలమీద కుంపటిలా తయారయ్యాడురా, మంగులూ!'' అన్నాడు.

"తమరేమీ కంగారుపడకండి. ఎగిరిపడే రెక్కల్ని నరకటం ఎలాగో నాకు బాగా తెలుసు." అన్నాడు మంగులు.

ప్రతాపుడు కనుబొమ పైకెత్తి, చేతిని కిందికీ పైకీ వూపాడు. ఆ సంకేతం గ్రహించినమంగులు చప్పున గదినుంచి బయిటికెళ్ళాడు.

బస్వీ కొండలోయలోని కాలిబాటవెంట గ్రామంకేసి నడుస్తున్నాడు. చుట్టూరా చీకటి, లోయంతా నిర్మానుష్యంగా ఉన్నది. దూరాన పేలుడుమందు దెబ్బకు రాళ్ళు పగులుతున్నాయి. కాని, మంగులు ఆ చీకట్లో బండరాళ్ళచాటుగా తనకన్న ముందుగాపోయి, ఒకచోట కాపేసివున్నాడన్న సంగతి బస్వీకి తెలియదు.

ఇరుగ్గావున్న కాలిబాటలో మెల్లిగా నడుస్తూ తనను సమీపించే బస్వీని గమనిస్తూనే మంగులు, దారిపక్కనున్న పెద్ద బండలో దట్టించిన తుపాకీమందుకు నిప్పంటించాడు. బస్వీ ఆ బండను సమీపించేలోపలే అది పెద్ద శబ్దంతో బద్దలైంది. బస్వీ ఒక్క అరుపుఅరిచి వెనుదిరిగి పరిగెత్తేంతలో అతడి మీదికి ఒక రాయి దొర్లుకుంటూ వచ్చిపడింది. లోయంతా ప్రతిధ్వనించేలా బస్వీ ఆర్తనాదంచేశాడు.



పావుగంట తరవాత ఒక కుర్రవాడు పరిగెత్తుకుంటూ వచ్చి, జరిగిన ప్రమాదం గురించి గంగకు చెప్పాడు. గంగ "నాన్నా! నాన్నా!" అని బిగ్గరగా ఏడుస్తూ లోయకేసి పరిగెత్తింది. ఆమె వెళ్ళేసరికి బస్సీని బండకిందినుంచి లాగి కూలీలు పచ్చికమీద పడుకోబెట్టారు. గంగ ఏడుస్తూ తండ్రి పక్కన కూర్చుని గుండెలు బాదుకోసాగింది. అంతలో అంబులెన్సు అక్కడికి వచ్చింది. డాక్టరు బస్సీని పరీక్షించి ప్రాణం ఉన్నట్టు గమనించి అతణ్ని అంబులెన్సులోకి చేర్పించి హాస్పిటల్‌కు తీసుకుపోయాడు.

బస్సీకి యీ దుర్దశపట్టించిన నరరూపరాక్షసుడు ప్రతాపసింహుడు బంగళాలో కూర్చుని, ఒంటివణుకూ, గుండెదడా తగ్గించుకునేందుకు బ్రాందీబుడ్లు తాగేస్తున్నాడు. కాని నాలుగు డబ్బులకోసం నిర్భాగ్యుడి నిలువుప్రాణం తీయటానికి మంగులు ఎలా అంగీకరించాడా అన్న అనుమానం, అందుకు ప్రోత్సహించింది తనేనన్న తలంపూ అతడి మస్తిష్కాన్ని తొలిచివేస్తున్నాయి.

బస్సీ దాదాపు నెలరోజులపాటు హాస్పిటల్లో ఉండవలసి వచ్చింది. బండరాయి కిందపడి కుడికాలు బాగా నలిగిపోవటంతో, నయం చేసేందుకు సాధ్యంకాక, కాలు నరికివేశారు. గాయం పూర్తిగా మానుపట్టగానే బస్సీ ఇంటికివచ్చేశాడు. ఈ నెల రోజులపాటు పిల్లల పోషణభారమంతా జానకీబాయే వహించింది.

బన్సీ ఇంటికివచ్చిన సాయంత్రమే ప్రతాపసింహుడు, మంగులును వెంటబెట్టుకు వచ్చి జరిగిన ప్రమాదానికి సానుభూతి కనబరిచాడు. మాటలసందర్భంలో బన్సీ స్థానంలో మరొక గుమస్తాను పెట్టుకున్నానని చెప్పి, అతడికి న్యాయంగా రావలసిన నష్టపరిహారమంతా ఇస్తానన్నాడు.

బన్సీ తాను ఉద్యోగం చేయగలిగిన స్థితిలో ఉన్నాననీ, కరుణించి తన పని తనకివ్వమనీ ఎంత బతిమాలినా ప్రతాపుడు లాభంలేదని చెప్పి, జీపులో హడావిడిగా వెళ్ళిపోయాడు. బన్సీకి నడిసముద్రాన జీవితనౌక మునిగి పోయినట్టు తోచింది. కూతురు గంగ అతణ్ణి అనేక విధాలుగా ఓదార్చి, "నాన్నా, నేనే మగపిల్లవాణ్ణయితే యీ స్థితిలో కుటుంబభారమంతా నెత్తి నెత్తుకోక తప్పేదికాదుగదా. ఇప్పుడె తే మాత్రమేం; ఏ కూలోనాలో చేసి కుటుంబాన్ని పోషిస్తాను, మంజూనూ, శరత్‌నీ చదివిస్తాను," అన్నదామె.

కూతురుమాటల్తో బన్సీకి కొంతధైర్యం కలిగింది. తనకు నష్టపరిహారంకింద పదకొండునెలల జీతం వస్తుంది, అనుకున్నాడతను. ఈ డబ్బు అయిపోయేలోగా మరొకపని దొరక్కపోతుందా, అని గుండె నిబ్బరం కలిగిం దతడికి. ఈ లోగా సేఠ్‌జీ దగ్గిర ఎలానూ పనిచేస్తూనే వుండవచ్చు. ఇల్లు ఎలాగూ అతడికి తాకట్టుగా వుంది. దాన్ని అతడికే అమ్మి, ఆ మిగిలే డబ్బుకూడా దాయవచ్చు, గంగపెళ్ళికి ఉపయోగిస్తుంది.. బన్సీ యిలాంటి గాలి మేడలు కట్టసాగాడు...

లెక్కలు చూసి తనకు రావలసిన మొత్తం తెచ్చుకునేందుకు, ఆ మర్నాడే బన్సీ ప్రతాపుడి దగ్గిరకు వెళ్ళాడు. పాతబాకీలూ, హాస్పిటల్‌లో అయిన ఖర్చులూ మినహాయించుకుని, ప్రతాప్ బన్సీ చేతిలో నూటయాభై రూపాయలు పెట్టాడు. బన్సీ గిలగిల్లాడిపోతూ, "బాబూ! చికిత్సకయిన ఖర్చు...చట్టప్రకారం మీరే భరించాలి గదా?" అన్నాడు.

"నిజమే, అది కార్మికులకైతే కాని, నువ్వు కార్మికుడివికాదు, గుమాస్తావి," అన్నాడు ప్రతాపుడు.

"ఎంతోకాలంగా తమ సేవచేశాను. కాస్త దయతలచండి బాబూ. ఈ నూటయాభైతో నా బతుకెలా గడుస్తుంది," అన్నాడు బన్సీ కన్నీళ్ళతో.

"ఎవరి అదృష్టాని కెవరుబాధ్యులు?" అంటూ ప్రతాపుడు కుర్చీలోంచి లేచి బయిటికిపోయి జీపుయెక్కాడు.

బన్సీ ఇల్లు చేరేసరికి వాకిట్లో నులకమంచంమీద సేఠ్‌జీ కూచునివున్నాడు. బన్సీ రావటం చూస్తూనే లేచినిలబడి, "బన్సీ! నీ కోసమే చూస్తున్నాను," అన్నాడు.

"వచ్చాగదా, సేఠ్‌జీ!" అన్నాడు బన్సీ ఆయాసపడుతూ. సేఠ్ బాకీడబ్బు అడిగాడు.

"ఓ నాలుగురోజులాగు, సేఠ్‌జీ. హాస్పిటల్‌నుంచి మొన్ననేగదా వచ్చాను. పైగావున్న ఉద్యోగంకూడపోయె." అన్నాడు బన్సీ.

"అందుకే యింత త్వరగావచ్చాను. ఉద్యోగంకూడా ఊడిందాయె, నా బాకీ ఎలాతీరుస్తావు? వడ్డీతోకలిపి అరువంద లయింది." అన్నాడు సేఠ్.

"అంతా తీరుస్తాను, ఈ కష్టాలు కలకాలం వుండవుగదా."

"మరి కంట్రాక్టర్ ప్రతాప్ దగ్గరనుంచి తెచ్చిన డబ్బంతా ఏం చేస్తావ్?" అని అడిగాడు సేఠ్,

"అంతాకలిపి ఆయనిచ్చింది ఎంతనుకుంటున్నారు? వందన్నర." అంటూ బన్సీ వణికేచేతులతో జేబులోంచి డబ్బుతీసి సేఠ్‌కు చూపాడు

సేఠ్ ఆ డబ్బు చప్పున లాగేసుకుని లెక్కపెడుతూ, "ఇదంతా వడ్డీక్కూడా చాలేట్టులేదు. ముందే చెపుతున్నాను, వచ్చేనెల బాకీ తీర్చకపోతే, ఇల్లు వేలం వేయిస్తాను." అంటూ నోట్లు జేబులోపెట్టుకుని బయటికి వెళ్ళిపోయాడు. బన్సీ నిశ్చేష్టుడై అతడికేసి ఓ క్షణకాలం చూసి కుక్కిమంచంలో సొమ్మసిల్లి పడిపోయాడు.

ఆ మర్నాటినుంచే గంగ పొలంపనికి వెళ్ళసాగింది. పొద్దున్నేపోయి పొద్దుగూకేదాకా పొలంపనిచేసి ఇంటికి తిరిగివచ్చేది. తండ్రికీ తమ్ముళ్ళకూ వంటచేసి, వాళ్ళకింత పెట్టి మిగిలింది తానుతినేది. అస్తమానం పనిలో నిమగ్నమై వుండటముతో ఆమెకు కాస్త మనశ్శాంతి వుండేది. కాని బన్సీకిమాత్రం ఎప్పుడూ ఒకటే దిగులు. గంగకు ఏ క్షణాన ఎలాంటి ప్రమాదం జరుగుతుందో, మోహన్ మనసు ఎప్పుడు ఎలామారిపోతుందో, అని ఆలోచిస్తూ నానాయాతనా పడేవాడు.

మోహన్‌ద్వారా రూపకు డాక్టరీ చదివిన ఒకకుర్రాడితో పెళ్ళి నిశ్చయం అయిపోయింది. మోహన్ ఆ కుర్రవాడి ఫోటోనూ తన ఫోటోనూ చెల్లెలు రూపకు పంపుతూ, గంగ క్షేమసమాచారాలు అడిగాడు. రూప ఆ వుత్తరం, మోహన్ ఫోటో తీసుకుని గంగను వెతుక్కుంటూ పొలాలకేసి పోయింది. రూప చేలగట్లంట రావటం చూసిన గంగ పని ఆపి, ఆమెకు ఎదురువచ్చింది. సిగ్గుపడుతూ రూప తన పెళ్ళి మాటచెప్పి, మోహన్ ఫోటో గంగ కిచ్చింది.

ఇద్దరూ కొంచెంసేపు ఎకసక్కాలాడుకున్నారు. రూప రాత్రి తప్పకుండా యింటికొస్తానని చెప్పి వెళ్ళిపోయింది. తనప్రియుడి ఫోటో చూస్తుంటే గంగ

హృదయంలో ఎన్నో మధురభావాలు మెదలసాగాయి. మోహన్‌తో తాను భవిష్య జీవితంలో అనుభవించబోయే స్వర్గసుఖాలను గురించి ఆమె కలలు కనసాగింది. ఫోటోను జాకెట్‌లో దాచుకుని, ఆ సాయంత్రం అల్లా పొలం పనిచేసి, యింకా కాస్తపొద్దున్నదనగా, తండ్రికి మందులు కొనితెచ్చేందుకు బస్తీకి బయలుదేరింది.

బస్తీలో మందులు తీసుకుని గ్రామానికి బయలుదేరేసరికి బాగా చీకటి పడిపోయింది. ఆకాశంలో దట్టంగా మేఘాలు అలుముకున్నాయి. గ్రామానికి పోయేదారి నిర్మానుష్యంగా వున్నది. గంగకు చీకటి భయంకంటె, తండ్రి తనకోసం ఎంత ఆదుర్దాపడతాడో అన్నబాధ మనస్సును వేధించసాగింది.

హఠాత్తుగా గంగ కారుహారన్ విని దారికిపక్కగా జరిగింది. అంతలో జీపు కారు వచ్చి ఆమె పక్కనే ఆగింది. ప్రతాపుడు బయిటికి తొంగిచూస్తూ, "ఇంత చీకటిపడి ఎక్కణ్ణించి వస్తున్నావు?" అని అడిగాడు.

"బస్తీనుంచి," అన్నది గంగ ముఖం పక్కకు తిప్పుకుంటూ.

"బస్తీనుంచా? ఎందు కెళ్ళావ్?"

"నాన్నకు ఒంట్లో బావోలేదు, మందులకోసం వెళ్లాను." అంటూ గంగ ముందుకు నడవబోయింది.

"ఈ వేళప్పుడు, యీ దారివెంట ఒంటరిగా ప్రయాణం చెయ్యటం ప్రమాదం. గ్రామంలో దించుతాను." అన్నాడు ప్రతాపసింహుడు.

"వద్దులే, బాబూ," అన్నది గంగ.

"ఇందులో తప్పేముంది?" అన్నాడు ప్రతాపుడు కోపంగా.

"తప్పో, ఒప్పో. ధనికుడి ఉపకారంకోసం ప్రయత్నించే దరిద్రుడికి పశ్చాత్తాపంతప్ప ఏమీ మిగలదు బాబూ. నన్ను నా దారిన పోనివ్వండి," అంటూ గంగ గబగబా ముందుకు నడిచింది.

తన మనోభావాల్ని గంగ గ్రహించిందేమో అని ప్రతాపుడు కళవెళపడ్డాడు. అతడు మారుమాటాడకుండా జీపును స్టార్టుచేసి దుమ్ములేపుకుంటూ వెళ్ళిపోయాడు.

అక్కడ ఇంటిదగ్గిర బస్వి ఇంతచీకటిపడ్డా కూతురు రాలేదేమా అని ఆదుర్దా పడసాగాడు. కాలం గడుస్తున్నది. ఎంతకీ కూతురు జాడలేదు. ఇక ఉండబట్టలేక బస్వి లాంతరు తీసుకుని కర్రసాయంతో కుంటుకుంటూ వీధిలో బయలుదేరాడు.

గంగ నిర్జనంగా ఉన్న ఊరిపొలిమేర చేరేసరికి గ్రామంలోని ఇళ్ళదీపాలు కంటి కగపడి, ఆమెకు ధైర్యాన్నిచ్చాయి. అమె గ్రామంకేసి మరింత వేగంగా నడవ సాగింది. ఆ సమయంలో ఎవరో తనను పేరుపెట్టి పిలుస్తూ, లాంతరుతో తనకేసే



గబగబా రాసాగాడు: గంగ ఆ వ్యక్తి తనను సమీపించగానే పరీక్షగా అతడి ముఖంకేసి చూసింది. వాడు మంగులు. లాంతరు గుడ్డికాంతిలో అతడిముఖం భయంకరంగా మెరుస్తున్నది.

"గంగా! మీ నాన్న..." అంటూ మంగులు ఆగిపోయాడు.

"ఏం జరిగింది, నాన్నకు?" అన్నది గంగ ఆదుర్దాగా.

"నిన్ను వెతకటానికి బయలుదేరి...చీకట్లో గోతిలో పడిపోయాడు," అన్నాడు మంగులు.

"ఎక్కడ!" అంటూ గంగ బిగ్గరగా అరిచింది.

"అమ్మగారు గుడినుంచి వస్తూ, గల్లంతు విని మీ నాన్నను బండిలో ఎక్కించుకుని వారి భవంతికి తీసుకుపోయారు." అన్నాడు మంగులు ఏడ్పుగొంతుపెట్టి.

"నాన్నా! నాన్నా!" అని పెద్దగా ఏడుస్తూ గంగ ప్రతాపసింహుడి బంగళాకేసి పరిగెత్తసాగింది. మంగులుకూడా ఆమె వెనకనే పరిగెత్తాడు.

కర్ర సాయంతో కుంటుకుంటూ అప్పుడే ఊరుదాటి పొలిమేర ప్రాంతానికి వచ్చిన బస్వికి, దూరంగా గంగకేకలూ, లాంతరుకాంతీ కనిపించినై. కూతురేదో ప్రమాదంలో చిక్కుకున్నదని గాభరాపడి, అడుగడుక్కీ తూలిపడుతూ బస్వి అటుకేసి పోసాగాడు.

గంగ, ప్రతాపుడి బంగళా చేరగానే మంగులు ఆమెకు మేడమీది ఒకగది చూపుతూ, "అక్కడికిపో. మీ నాన్నను అక్కడే పడుకోబెట్టారు," అనిచెప్పాడు

గంగ గబగబా మేడమెట్లెక్కి గదిలోకి అడుగు పెడుతూనే భయంతో గజ గజ వణికిపోయింది. ప్రతాపుడు టేబిల్ముందు కుర్చీలో కూర్చుని సారాతాగుతూ ఆమెనుచూసి, చిరునవ్వు నవ్వి మీసాలు సవరించుకో సాగాడు. గంగ తెప్పరిల్లి వెనుదిరిగి పారిపోబోయింది. అది గ్రహించిన ప్రతాపుడు చప్పున కుర్చీలోంచి లేచి, గదితలుపులు దభీమని మూసి లోపల గడియ పెట్టేశాడు.

గంగ భీతితో అరవబోయిందిగాని నోరు పెగలలేదు. ప్రతాపుడు గ్లాసులోవున్న సారా మరోగుక్కెడుతాగి తడబడుతున్న అడుగులతో ఆమెను సమీపించి, చేయి గట్టిగా పట్టుకున్నాడు. గంగ యీసారి తెప్పరిల్లి, "అమ్మగారూ! అమ్మగారూ!" అంటూ బిగ్గరగా అరిచింది.

"ఊరికే గొంతుచించుకుని లాభంలేదే, పిల్లా. మీ అమ్మగారు పట్నంవెళ్ళారు," అన్నాడు ప్రతాపుడు వెకిలిగానవ్వుతూ.

"అంతా మోసమన్నమాట!" అన్నది గంగ కోపంతో తల్లడిల్లిపోతూ.

"మంచిమాటల్తో నువ్వు వినవుగా," అన్నాడు ప్రతాపుడు.

గంగ ఛీ అంటూ అతడి ముఖంమీద ఉమ్మేసింది. ప్రతాపుడు కోపంతో ఊగిపోతూ, ఆమె చీరకొంగుతోనే ముఖం తుడుచుకుని ఆమె ముంజేతిని గట్టిగా బిగించి పట్టుకున్నాడు. మోహన్ ప్రణయచిహ్నంగా ఆమె చేతికితొడిగిన మట్టి గాజులు ముక్కలై, చెల్లాచెదరుగా కిందపడిపోయాయి. గంగ బిగ్గరగా అరిచింది, ఏడ్చింది. ప్రార్థించింది. కాని ఆనాలుగుగోడలమధ్యా, ఆమెరోదన ప్రతిధ్వనించింది, అంతే. ఎంతోకాలంగా తాను చేజిక్కించుకోదలచిన పిట్ట, ఈనాటికి తాను పన్నిన







రామకృష్ణ ; N.A.T. కంబైన్స్

# వరకట్నం



నిర్మాత
N. త్రివిక్రమరావు

కథ స్క్రీన్ ప్లే దర్శకత్వం
N.T. రామారావు

దివ్యదత్త కంబైన్స్ రిలీజ్

ప్యాలెస్ * బాలాజీ ★ అలంకార్

హైదరాబాద్ — సికింద్రాబాద్

— Divya Dutta Combines.

ఈ సంచికలో


| | | |
|---|---|---|
| యస్.యస్. ప్రకాశరావు | ★ డబ్బు | 17 |
| వి. వి. యస్. రామదాసు | ★ తీరనిబాకీ | 28 |
| గోపాలచక్రవర్తి | ★ బంగారుకాలం | 37 |
| గంటి వెంకటరమణ | ★ తీరినకోరిక | 38 |
| గుల్షన్ నందా | ★ మట్టిగాజులు (సంక్షిప్తనవల) | 59 |
| దేవులపల్లి గోపాలకృష్ణ | ★ చీకట్లో చిన్నవాడు | 115 |
| వి. రాజా రామమోహనరావు | ★ వానచినుకులు | 125 |
| సి. ఆనందారామం | ★ ప్రాప్తం | 131 |
| శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి | ★ మీనా (సీరియల్) | 144 |


ముఖచిత్రం :

ప్రకృతి - పురుషుడు

చిత్రకారుడు :

వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-00

యువ, సైఫాబాద్, హైదరాబాద్-4.

# లేఖలు

1968 లో మన పత్రికల్లో వెలువడిన కథలు కనీసం ఐదువందలైనా చదివాను. 'మంచికథలు' నాకునచ్చినవి వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. వాటిలో 'యువ' డిశంబరు సంచికలో వెలువడిన 'చెదిరిన రూపం' ఒకటి. ఇంత చక్కటి కథ వ్రాసిన రచయిత్రి డి. కామేశ్వరి గార్ని, అందించిన మిమ్మల్ని అభినందించకుండా ఎలా వుండగలను ?

పి. రామకృష్ణంరాజు, మధ్యప్రదేశ్.

ఈ మధ్య 'యువ' చాలా బాగుంటున్నది ఈ నెల (జనవరి) యువలో చాలా చిన్న చిన్నకథలు కూడా పడాయి. ఆ చిన్నకథలు చూస్తూఉంటే, మళ్ళా నాక్కూడా ఏదైనా రాయాలనిపిస్తున్నది. చాలా తక్కువలో ఎక్కువవిషయాలు స్ఫురింపచేసే రచనలంటే నా కెంతో ఇష్టం. 'యువ' పత్రిక అటువంటి కథలు అందచేస్తున్నందుకు నా ధన్యవాదాలు.

మీ దీపావళి సంచిక, శాశ్వతంగా బైండు చేయించి ఉంచుకో తగ్గదనడంలో అతిశయోక్తి లేదేమో!

రంగనాయకి, వాల్తేరు.

"యువ" జనపరిసంచిక ప్రత్యేక సంచిక కాకున్నా, అలాంటి భావనను కల్గింపజేసేలా ఉంది.

మీ సంపాదకీయంలో మీరు చెప్పినట్లు మన నాయకులు ఇరవై సంవత్సరములనుండి ఇప్పటివరకు దేశాన్ని బాగుపర్చలేక పోయారు.

విద్యార్థులకు మీరు సూచించిన మార్గాలతో నేను సంపూర్ణంగా ఏకీభవించుచున్నాను.

వడ్డాదిపాపయ్యగారి స్మృతిస్థితి రంగవల్లిక' చిత్రంలో ఓంకారనాదం ప్రతిధ్వనించుచున్నది.

కథలలో "స్లీపర్ కోచ్" లోని 'అమ్మాయి' పాత్ర "గైడ్"లోని "ఎలిజా" పాత్ర స్త్రీ సహజమైన ప్రకృతిని, నిజమైన బలహీనతలను నింపుకొని ఎలాంటి వారి హృదయాన్నైనా ద్రవింపజేస్తాయి. ఇక 'మాయ కథలో' భగవంతుడు మనతో ఆడుకొనే ఆటలలో విచిత్రమైన ఆటతో నిండిఉంది

వి. వి. స్వామి,
కరీమ్‌నగర్.

ఈ నెల యువసంచికలో మీరు ప్రచురించిన స్లీపర్ కోచ్, నెలలుకాపు-రలలు, మరియు దత్తపుత్రుడు కథలు చాలా బాగున్నవి ఇంకా మంచిమంచి కథల ద్వారా ఆనందింప జేస్తారని నా ప్రార్థన.

ఎల్ గ్లాడ్‌స్టన్, భీమవరం.




'ఇప్పుడు సబ్బులలో శ్రీమంత
శృంగార తిలకం లక్స్'



అంటున్నది సినీమాతార
కాంచన




కొత్త లక్స్‌లో అమూల్యమైన కొత్త
పరిమళం మరియు అంతర్జాతీయ
కొత్త రూపు గలదు

లింటాస్-LTS.224M-77 TL.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్టమైన ఉత్పత్తి




తక్కువ గడువులో చాలా [illegible]
5 శాతము పన్నులేని వడ్డీ నిస్తుంది. ప్రతి 100
రూపాయల డిపాజిట్లూ 5 ఏండ్ల తర్వాత 125
రూపాయలవుతుంది.

---

డిపాజిట్లు 50 రూపాయల గుణకాలలో 70,000 పోస్టా
ఫీసులలో, 2,800 స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాం
చీలలో దాని సబ్సిడియరీలలో తీసుకోబడుతున్నాయి.

---

ఒక వ్యక్తి 25,000 రూపాయలవరకు డిపాజిట్ చేయ
వచ్చును ఇద్దరు కలిసి 50,000 రూపాయలవరకు
డిపాజిట్ చేయవచ్చును

---

ఈ డిపాజిట్లపై
సంపద పన్ను
ఉంటదా



జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

# లేని వడ్డీ



మీ ముఖ
సౌందర్యానికి









రెమి ®
టాల్కం పౌడర్

SARATH

# సక్రమంగా బ్రష్‌తో తోముకుంటే
# ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు
# పనుచిగుళ్ల బాధలను
# దంత క్షయమును నిలుపును

ఇగుళ్ల బాధలను దంతక్షయమును నిలుపుటలో ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు సాధించిన అద్భుతమైన ఫలితాలను చిన్నా పెద్దా అనేభేదం లేకుండా అయాచితంగా చేసిన ప్రశంస లెలావున్నాయో చదవండి. ఈ ప్రశంసా పత్రాలను జెఫ్రీ మానర్స్ అండ్ కంపెనీ వారి యే కార్యాలయములోనైనా చూడవచ్చును.

''నేను పళ్ళజబ్బులతో బాధపడుతుండే వాడిని అప్పుడు ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు వాడి చూచేను...ఇప్పుడు అటువంటి జబ్బులేమి లేవు. షుమారు 20 నుండి 25 మంది వరకు ఇప్పుడు ఫోర్‌హాన్స్ ఉపయోగిస్తున్నారు. మా ఇంట్లో అయితే ఫోర్‌హాన్స్ తప్ప వేరేమాట వినబడదు.''

ఉదయశంకర్ తివారీ, పాట్నా

''శాస్త్రీయంగా నిర్మింపబడిన మీ ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు నేను గత పది సంవత్సరాల నుండి ఉపయోగిస్తున్నాను; నా చిగుళ్ళ బాధలన్నిటిని పోగొట్టింది. ఇప్పుడు మా ఇంట్లోని వారంతా క్రమంగా ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతోనే బ్రష్ చేస్తారు''.

ఎస్. ఎమ్. లాల్, న్యూ ఢిల్లీ

## ఫోర్‌హాన్స్

—ఒక దంతవైద్యునిచే నిర్మింపబడిన టూత్‌పేస్టు

సరియైన పంటి జాగ్రత్తకోసం ప్రతి రాత్రి, ప్రొద్దుటా ఫోర్‌హాన్స్ టూత్ పేస్టును, ఫోర్‌హాన్స్ డబుల్-ఏక్షన్ టూత్ బ్రష్‌నూ వాడండి...మరియు మీ దంత వైద్యుని వద్దకు నియమానుసారము వెళ్లండి.




ఉచితం ! ''పళ్లు, ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ'' అనే రంగుల చిన్న పుస్తకం ఇంగ్లీషు తెలుగు భాషల్లో లభిస్తున్న యీ చిన్న పుస్తకము కావలసినయెడల యీ కూపన్‌ను 15 పైసల తపాలా బిళ్లతో పాటు (తపాలా ఖర్చుల నిమిత్తం) మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ సం 10031 బొంబాయి-1 పంపండి.

పేరు ________________ వయస్సు ___ Y-11

చిరునామా ________________

భాష ________________

54F-172 TL

# యువ
## సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 19 ఫిబ్రవరి, 1969 సంచిక 2

రెండుమూడు నెలలుగా దేశంలోని అనేక ప్రాంతాలలో అరాచకత్వం ఎక్కువగా కనపడుతోంది. ఈ అరాచకత్వ చర్యలలో ప్రథమపాత్ర మార్క్సిస్టు కమ్యూనిస్టులు వహించారు. వారికి సంబంధించిన కొంతమంది పార్టీ సభ్యులు స్వయంగానే, దోపిళ్లు, పోలీసుస్టేషనులపై దాడిజరపడం మొదలగు చర్యలను కేరళలో సాగించారు. ఆంధ్రప్రదేశ్‌లో, పార్టీసభ్యులు స్వయంగా యీ చర్యలను జరపకపోయినా, శ్రీకాకుళం జిల్లాలో ఏజన్సీప్రాంతంలో గిరిజనులను పురికొల్పి అరాచక చర్యలను జరిపించారు. ఇలాటి పరిస్థితులను ఎంతమాత్రమూ సాగనివ్వకూడదు.

భారత ప్రభుత్వవిధానము, ప్రజారాజ్య సూత్రాలపై నడుస్తున్నది. దేశంలో వున్న అనేక రాజకీయ పక్షాలకు, వాటివిధానాలను ప్రచారం చేసుకోడానికీ, ఎన్నికలలో పాల్గొని శాసనసభలకు సభ్యులనుపంపి,

హారిద్వారా పరిపాలనా వ్యవహారాలలో పాల్గొనడానికి సంపూర్ణమైన హక్కులువున్నవి. అంతేకాదు; మనదేశంలో కొంతభాగాన్ని ఆక్రమించుకొని, మనపై యుద్ధచర్యలను జరిపిన చైనాప్రభుత్వ నాయకుణ్ణి దైవంగా ఆరాధిస్తూ, ఆతడి బొమ్మలను ఊరేగించుతూవున్న పార్టీనికూడా నిషేధించకుండా, మన శత్రుదేశపు ప్రభుత్వనాయకుల విధానాలను అమలుజరుప దలచుకున్న పార్టీపై ఏవిధమైన ఆంక్షలను విధించకుండా, ఆ పార్టీకి దేశంలోని తక్కిన ఇతర రాజకీయ పార్టీలతో సమానహక్కులను అనుభవించే సౌకర్యాన్ని ఇస్తున్న, రాజ్యాంగం మనది.

అలాటి సందర్భంలో, శాంతియుతంగా రాజకీయ విధానాలను ప్రచారం చేసుకోవడానికి ప్రతిపార్టీకీ సంపూర్ణమైన అవకాశంవుంది. అయినప్పటికీ, ఒకపార్టీ దౌర్జన్యచర్యలకు దిగడము, ప్రభుత్వ కార్యాలయాల మీదనూ, ప్రత్యేకవక్తుల ఇండ్లమీదనూ దాడులుజరిపి, దోపిడి జరపడం మాత్రమేకాక ప్రభుత్వ ఉద్యోగులకూ, ప్రత్యేకవ్యక్తులకూ ప్రాణహానికూడా కలిగించడము చాలా శోచనీయము. ఇలాటిచర్యలు ప్రజలలో ఆ పార్టీపట్ల జుగుప్సాభావాన్ని కలిగించి, ఆ పార్టీ సభ్యుల పట్ల ప్రజలకు ప్రతీకారచర్యలకు దిగే ఆగ్రహాన్ని కలిగించకపోవు. భీతావహులైన ప్రజలు తమకు ఉపద్రవాన్ని కలిగిస్తున్నవారిపై ప్రతీకారం చెయ్యడానికి ఏకం కాకపోరు. అలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు, ఏ రాజకీయపక్షమూ బ్రతకజాలదు.

ప్రజలను హింసించి, అలాంటి హింసాచర్యలద్వారా ప్రభుత్వాన్ని బెదిరించుదామనుకోవడం, ఒట్టి భ్రమ. దోపిళ్ళవల్ల కొంతడబ్బును చేజిక్కించుకొన్నా, మారణచర్యలవల్ల కొంతమంది అమాయకుల ప్రాణాలను బలితీసుకున్నా, ఇది తాత్కాలికమైన ఘనవిజయాలు కావచ్చునే

గాని, ఉత్తరోత్తరా, యీ చర్యలకు కారకులైనవారు దారుణమైన ప్రతిఫలాన్ని అనుభవించక తప్పదు.

ప్రజలు, తమపట్ల అత్యాచారాలను సాగిస్తున్నవారిపై ప్రతీకార చర్య తీసుకోవడం అనే పరిస్థితి ఏర్పడడంకూడా దేశానికి మంచిది కాదు. దేశంలో అరాచక పరిస్థితులను కలిగిస్తున్న వారిపై తగినచర్య తీసుకోవలసిన అధికారమూ, బాధ్యతా, ప్రభుత్వానివి. ప్రభుత్వం ఈ బాధ్యతను నిర్వహించలేకపోయినా, ప్రజలే తమరక్షణకు తామే సన్నద్ధులై తమకు ఉపద్రవాన్ని కలిగిస్తున్నవారిపై ప్రతీకారచర్య తీసుకున్నా, దేశంలో అరాచకపరిస్థితి ఏర్పడుతుందన్నమాట. బాధ్యతా యుతమైన ప్రభుత్వం ఇలాటి పరిస్థితిని ఎన్నడూ రానివ్వకూడదు.

ప్రభుత్వ నిర్వహణకోసం ప్రజలు పన్నులు చెల్లిస్తున్నారు. పరదేశీయులు దేశంపై దండయాత్ర జరుపకుండానూ, దేశంలోని దుండగీండ్లు ఉపద్రవాలను కలిగించకుండానూ తగిన కట్టుదిట్టాలను ఏర్పాటుచేసి, ప్రజలు ప్రశాంతంగా తమ నిత్యజీవితాన్ని గడుపుకోడానికి ఏ ఆటంకమూ లేకుండా చూడడం, ప్రభుత్వపు ప్రథమ బాధ్యత.

శ్రీకాకుళంజిల్లాలో ఇటీవల జరిగిన దాడులు, ఏదో క్షణికమైన ఉద్రేకంతో కొంతమంది వ్యక్తులుచేసే దుండగీడుతనం కాక, ఒక ప్లాను ప్రకారం జరుగుతున్నవిగా కనపడుతున్నవి. అంచేత, ప్రభుత్వం కఠిన మార్గాలను అనుసరించి అయినా, అలాటి సంఘటనలు శ్రీకాకుళంలో గాని, మరొకచోటగాని, జరుగకుండా చూడాలి. ప్రజల క్షేమానికి ఉపద్రవం కలిగించేవారు క్షమార్హులు కాజాలరు. వారి చర్యలు ఎంత మాత్రం సహించవలసినవి కావు.




త్రవ్వకాలలో బయటపడ్డ
ఈ చిత్రం బహుశా
ఆదిమానవులదేమోనని
శాస్త్రజ్ఞుల అభిప్రాయం!!


మరేం భయంలేదు!
మా చిలక్క మాటలు
రావు లెండి!






తల వంచుకుని నడుస్తున్నాడు సూర్యారావు. అవునుమరి, 'నాకేంలే!' అని, తలెత్తుకుని తిరిగే రోజులు వెళ్ళిపోయేయి. తలవంచుకునే నడుస్తున్న సూర్యారావు — రొచ్చుకంపూ, పేడవాసనా కలిసిన గాలి ముక్కుకి తగలగానే తలెత్తి చూసేడు.

వద్దామనుకున్న చోటుకి వచ్చేశాడు.
కలుద్దామనుకున్న మనిషిని కలవాలి.
చెప్పాలనుకున్న విషయం చెప్పాలి.
చెప్తే ఏమంటాడో? ఏంవనేస్తాడో.
దడ, దడ, దడాదడా — కొట్టుకుంటున్నాయి గుండెలు.

సూర్యారావు నోరువిప్పి పిలిచేననే అనుకున్నాడు. కాని, మాట బైటికి రాలేదు.

సిగ్గు, అవమానం, నైరాశ్యం — ఇవన్నీ గొంతులో తిష్ఠవేసుక్కూచుని, నోట్లోంచి మాటని బైటికి రానివ్వడం లేదు.

అతను అన్నింటికీ తెగించేసేడు! ఇంక దేనికి సిగ్గు? అవమానం ఎందుకు? నైరాశ్యమా? — చూదాం దాని సంగతీను.

"రాములూ!" అని మళ్ళి పిలిచేడు సూర్యారావు.

ఆ పిలుపులో అధికారంలేదు; అహంకారంలేదు; హోదాలేదు. కాని, ఆ పిలుపులో వున్నది దైన్యవూ, బాధానూ.

ఎవ్వరూ పలకలేదు, మళ్ళిపిలిచేడు.

పక్కనే గేదె ఒకటి అరుస్తోంది. ఆ గేదెకి కొంచెం దూరంగా మూతికి

ఉచ్చు కట్టేసిన దూడ మౌనంగా ఆరు స్తోంది.

ఎవరో వస్తున్నారు

రావులేనేమో! - ఎలా చెప్పడం? ఎలా మొదలెట్టాలి ఏమంటాడో? అతనికి జాలిపుట్టేలా నమ్మకంకలిగేలాచెప్పేపద్ధతేమిటి? ఇన్నాళ్ళూ కాలేజీల్లో చెప్పిన చదువులో జీవితానికి పనికొచ్చే 'ఇలాంటి' విషయం ఒక్కటీ చెప్పలేదేం?

"రాములు నేడు బాబూ! ఏటన్నా అర్జెంటుపనా?" రాములు పెళ్ళాం వచ్చింది.

ఇంకొకప్పుడైతే, ఏం చేసేవాడో కాని, సూర్యారావు ప్రస్తుతం, తలవంచుకునే, "రాములులేడా? ఎక్కడికెళ్ళేడో తెలుసా?" అన్నాడు.

"సిన్నబజారుకేసి ఎల్లేడు బాబూ! - ఏటన్నా పనుందా? - ఆనక అడొస్తే మీ యింటికి పంపించేదేటి?"

సిగ్గుపడిపోయాడు- సూర్యారావు. "అబ్బే! అర్జంటేంలేదు. నే వస్తా! వచ్చేసనిచెప్తేచాలు" (అవసరం నాతల్లి నాది. నా యింటికి నీ మొగుడెందుకొస్తాడు? ఆ రోజులు వెళ్ళిపోయేయి.)

ఎంతో ఆశపెట్టుకుని వస్తే;

కలుద్దామనుకున్న మనిషి లేనేలేడు.

చెప్దామనుకున్న విషయం చెప్పనే చెప్పలేదు.

ఇప్పుడెలాగా? ఏం చెయ్యడం?

చిన్నబజారుకి వెళ్ళేట్ట. ఇదేవుంది చిన్నబజారు. దారిలో 'కాస్తే!'-అంతే, అదేచెయ్యాలి!

రోడ్డుకి కొంచెం పక్కగా ఓ రావి చెట్టుంది. దానికింద చప్టావుంది. అక్కడికి వెళ్ళికూర్చున్నాడు-సూర్యారావు.

ప్రొద్దుట్నించీ ధనసంపాదనకోసం మనుషులు చేస్తున్న పనులన్నీ చూసి చూసి, మొహం ఎర్రగా చేసుకుని కిందకి దిగిపోతున్నాడు సూర్యుడు.

రావి చెట్టంతా కోలాహలంగా వుంది.

సూర్యారావు తలెత్తి చూసేడు. పక్షులన్నీ ఈ రోజుకి ఆహార ప్రయత్నం ఇక చాలుననుకుని గూళ్ళకి చేరుకుంటున్నాయి.

ఎవరు తినేదైనా, ఆ అన్నమేకదా!

డబ్బుందికదా - అన్చెప్పి బంగారం కణికెలు మింగరుకదా!

ఆ తిండికోసమే ఈ తాపత్రయాలన్నీను.

పక్షులకీ బాధలేం లేవు.

డబ్బు బాధలేదు!

డబ్బుతో బాధలేదు!

మరి మనకో—

తిండి కావాలంటే-కావాలి డబ్బు.

బతకాలంటే-కావాలి డబ్బు.

చస్తే బూడిద చెయ్యడానికి కావాలి-డబ్బు.

పిల్లల చదువులకి కావాలి

పెద్దల జబ్బులకి కావాలి.

డబ్బు! డబ్బు!! డబ్బు!!!

అందరికీ కావాలి – డబ్బు.

లేనివాడికి కావాలి.

వున్నవాడికీ కావాలి.

ఆడకూతుర్ని పెళ్ళి చేసుకోవాలంటే, పెళ్ళికొడుక్కి కావాలి!

వుద్యోగం రావాలంటే ఆఫీసరుకి ఇవ్వాలి – డబ్బు!

వున్న వుద్యోగం నిలబడాలంటే ఆఫీసరు పెళ్ళాం, పిల్లలకి ఖర్చుపెట్టాలి – డబ్బు!!

డబ్బు! డబ్బు!! డబ్బు!!!

పక్షులకి ఈ బాధలేం లేవు.

పశువులకి ఈ కష్టాలేం లేవు.

మరి, మేష్టారూ! – వీటన్నిటికంటె తెలివైనవాడు – మనిషికి ఈ బాధలూ, కష్టాలూ ఎందుకున్నాయి?

అవును, పక్షులకీ, పశువులకీ డబ్బు లేదు: అందుకే, కష్టాలూలేవు.

కష్టాలు పోవాలంటే కావాలి–డబ్బు!!

సుఖాలురావాలంటే కావాలి–డబ్బు!!

——ఇలా ఆలోచిస్తున్న సూర్యారావుకి రావు(లు జ్ఞాపకం వచ్చేడు. రోడ్డుమీదకి వెళ్ళి చూసేడు. కనుచూపు మేరలో ఎవరూ రావడంలేదు.

మళ్ళీ యథాస్థానంలోకి వచ్చి కూర్చున్నాడు సూర్యారావు

రమారమి ఏడాదికిందట, ఈ సూర్యారావు – ఇంజినీరు సూర్యారావు!

ఆ రోజులే వేరు! మహారాజులా గడిపిన రోజులవి! మరి మళ్ళీరమ్మంటే వస్తాయా? ('ఊఁ' అంటే వస్తాయా? 'ఆఁ' అంటే వస్తాయా?)

అయిదేళ్ళ ఇంజినీరింగు చదువుని, అయిదేళ్ళలోనే పూర్తి చేసేడు సూర్యారావు. అతని చదువు పూర్తయేసరికి. సూర్యారావు తండ్రి – 'రసం' పూర్తిగా పోయి 'పిప్పి' అయిపోయేడు; లేదా, 'వత్తి' పూర్తిగా కాలిపోయిన 'దీపం' అయిపోయేడు. అంతేకాదు, అతని చదువు పూర్తయేసరికి సూర్యారావు చెల్లెలికి 'పెళ్ళీడు'వచ్చి కొన్నేళ్ళయింది.

పెళ్ళీడు కొచ్చిన ఆడపిల్లల్ని కట్నాలిస్తేనేగాని, పెళ్ళిచేసుకోరు – 'పెళ్ళీడు' అంటూ లేని మగ'పిల్లలు'. అంచేత, ఇంజినీరు సూర్యారావు, ముందు ముందు చెల్లి పెళ్ళి చెయ్యడానికని తనుముందుగా పెళ్ళిచేసుకున్నాడు.

ప్రతీతండ్రీ కూతురు సౌభాగ్యాన్నే కోరుతాడు.

అందుకే, తమ ఆరిపోయయినా, ఏ ఇంజినీరునో, డాక్టరునో ఇచ్చి, కూతుర్ని వెలిగిస్తాడు.

సరిగ్గా అదే జరిగింది – సూర్యారావు మావఁగారి విషయంలో! కూతురు పెళ్ళి చేసేడు; అతను పూర్తిగా ఆరిపోయేడు.

డబ్బు! డబ్బు!!

అన్నిఁటికీ కావాలి.

అందరికీ కావాలి.

ఉద్యోగంరావాలంటే కావాలి–డబ్బు!

డిగ్రీవుంటే చాలదు. అర్హతలుంటే

ఎవడికొ్కావాలి? కావల్సింది — 'రెక్క' అదుంటేనే ఎగురుతావు ఆ రెక్కకూడా మామూల్ది పనికిరాదు. 'పెద్దలు'. వాళ్ళెవరన్నా ఇవ్వాలి. అదిలేకపోతే, కావాలి డబ్బు.

'ఇంత' ఇస్తే 'అంత' జీతంవచ్చే వుద్యోగం ఇప్పిస్తాను అన్నాడు — 'ఎంతో జీతంవస్తున్న' ఒక ఆఫీసరు!

'ఆరోజు', — సూర్యారావు కిప్పటికీ జ్ఞాపకంవుంది.

పెద్ద భవనం; దానిలో ఒక చిన్నగది. ఆ చిన్నగదిలో నాలుగు సోఫాలు. వాట్లో ఒకదాన్లో కూర్చున్నారు సూర్యారావూ, అతని తండ్రీను.

"రాగానే, లేచి నమస్కారంపెట్టు" అన్నాడు తండ్రి.

జరగబోయే నాటకంలో తమపాత్ర గురించి ఇద్దరూ ఆలోచిస్తున్నారు. గదంతా నిశ్శబ్దంగావుంది. గోడమీద గడియారం ఎప్పటిదో 'టైము' చూపిస్తోంది.

'ఆయన' వచ్చేరు.

సూర్యారావూ, తండ్రీ లేచి నిల్చున్నారు. నమస్కారాలు పెట్టేరు

ఆయన చిరాగ్గా ముఖంపెట్టి "ఊఁ, ఎవరండీ మీరు? ఏంకావాలి?" అన్నాడు

సూర్యారావు వెంటనే "నేను ... నేను ... బి. ఇ. పాసయ్యానండీ!" అన్నాడు.

"వాటె హెల్! అదిసరే! మీరు బి.ఇ. పాసయ్యేరు. అందుకోసం నా ఇంటికి వచ్చి, నన్ను డిస్టర్బ్ చేస్తే ఎలాగండీ! ఇంటిదగ్గరకూడా ఆఫీసుపనే చెయ్యడానికి నాకు ఎవరూ ఎక్స్‌ట్రా జీతం ఇవ్వడం లేదు - మీకు తెలుసుగదా! ఆఫీసుపని వుంటే, ఆఫీసుకి రండీ! ప్లీజ్! నన్నర్థం చేసుకోండి. ఇంట్లో నా వైఫ్, ఛిల్డ్రన్‌తో సాయంత్రంపూట సరదాగా వుండాలనుకోడం నా తప్పా-చెప్పండి? ... నో నో ... ఇదేం బాగులేదు ... ఐ వాంట్ టు బి స్ట్రిక్టు. లేకపోతే, నాకు రెస్టనేదే వుండదు. ప్లీజ్! మీరు వెళ్ళండి. ఆఫీసులో కల్సుకోండి. ప్లీజ్! ప్లీజ్!—"

సూర్యారావుకి చాలా ముచ్చట వేసేయి—ఆ ఆఫీసరుగారి మాటలు. అవును మరి, ఆఫీసుపని ఇంట్లోకూడా చేసుకుంటే, ఇంక సుఖం ఎక్కడుందీ బతుక్కి? ఆయనచెప్పింది నిజంవే! వెళ్ళిపోవాలి - అనుకున్నాడతను.

"సుదర్శనంగారు పంపించేరండీ!" అన్నాడు సూర్యారావు తండ్రి మెల్లిగా.

"ఓ! ఐసీ! మీరేనటండీ! మరి ఆ సంగతి ముందు చెప్పరేం? సో సారీ! .... కూర్చోండి, కూర్చోండి. ఓహో! మీరే నన్నమాట సూర్యారావు బి. ఇ. సరిసరి ... బాగానేవుంది ... ఆఁ ... అప్పన్నా! వీరికి డ్రింకులు తీసుకురా!..." అన్నాడు ఆఫీసరు.

"అబ్బెబ్బే! అవేఁవీ వొద్దండీ!



ఇదుగో, ఈ వుత్తరం మీ కిమ్మన్నారు సుదర్శనంగారు." అని, ఒక కవరు ఇచ్చేడు సూర్యారావు తండ్రి.

"థేంక్యూ!...ఊఁ....సారీ సార్! నాకు తెలియదు మీరనీ! ... ఇదేనండీ, వొకరు ఇంటికి వచ్చి_వుద్యోగా లిప్పించమని అడుగుతూ వుంటారు. మరేం అనుకోకండి. ఎక్స్‌క్యూజ్ మీ...అఁ ఏఁవండీ సూర్యారావుగారూ! మీరు ఎప్పుడు పాస యేరు...ఓ! ఈ ఇయరేనా! అచ్ఛా! ...డ్రింక్సు తీసుకోండి అని, ఆ కవరు జేబులో పెట్టుకున్నా డాయన.

"నాల్రోజులు పోయింతరవాత కల్సుకోండీ! అపాయింటు మెంటార్డర్స్ మీకిస్తాను. ఓ.కే! ...నమస్కారం! ... డోంట్ థింక్ అదర్వైజ్...నమస్తే!"

బయటికి వచ్చేశారు ఇద్దరూ.

అంతే!

క్షణంలో మారిపోయింది ప్రవర్తన.

క్షణంలో మారిపోయింది_ డబ్బు, తండ్రి చేతిలోంచి ఆయన చేతిలోకి!

నాలుగో రోజుకల్లా సూర్యారావు. - ఇంజినీరు సూర్యారావు అయిపోయాడు. సూర్యారావు భార్య - ఇంజినీరుగారి భార్య

అయిపోయింది తన వుద్యోగాని క్కావల్సిన విషయాలన్నీ వుద్యోగంలో చేరేకే నేర్చుకున్నాడు సూర్యారావు (మరి, ఈ ఐదేళ్ళచదువూ ఎందుకో ?)

ఇంజినీరుగారికి ఓ మంచి ఇల్లు వుండాలి. ఆఇంట్లో ఎన్నో సదుపాయాలు వుండాలి. వీటన్నింటికీ డబ్బు వుండాలి.

డబ్బులేకేం ? ముందు ముందు చెల్లి పెళ్ళికోసం 'సంపాదించిన' కట్నండబ్బు వుండనేవుంది. ఇంజినీరు సూర్యారావు చెల్లెలి పెళ్ళిచెయ్యలేదూ ? చెయ్యాలంటే ఆకట్నండబ్బే వుండాలా ?

అంతే ! కూర్చుని తింటే, కొండ లయినా కరుగుతాయి. (కొండల్ని తింటారా ?) చెల్లెలిపెళ్ళి అయిందేకాదు.

మనకి వాళ్ళ సంబంధం నచ్చితే, వాళ్ళకి మనడబ్బు నచ్చదు. వాళ్ళకి మన డబ్బునచ్చితే, వాళ్ళ సంబంధం మనకి నచ్చదు. ఇద్దరికీనచ్చే సంబంధాలున్నాయా ! ఏమోమరి !

సూర్యారావు ఒక కూతుర్ని ఎత్తుకునే నాటికి, కట్నండబ్బు మరేమీ మిగల్లేదు.

డబ్బు ! డబ్బు !! డబ్బు !!!

పిల్లల్ని పెంచడానికి కావాలి.

తండ్రి జబ్బుల్ని తగ్గించడానికి కావాలి.

భార్య అలంకారాలకి కావాలి.

చెల్లెలి పెళ్ళికికావాలి.

అలాగే,

, నెలాఖర్న నౌఖరీ చేయించుకున్న వుద్యోగస్తులకీ, బడి పంతుళ్ళకీ ఇవ్వడానికి కావాలి-డబ్బు !

అదేలేదు ! అదే లేదట !

అందుకే.

పెద్ద పెద్ద ఆఫీసర్లకి. చిన్న చిన్న నౌకర్లకీ తప్ప మధ్యవాళ్ళకి - అంటే, జూనియర్ ఇంజినీర్లకి. బడి పంతుళ్ళకి జీతాలు ఇవ్వలేక వాళ్ళని ఇంటికి పంపిం చేసేరు.

సూర్యారావు వుద్యోగం మూణ్ణాళ్ళ ముచ్చటే అయింది. అతను ప్రస్తుతం రిట్రెంచ్డ్ ఇంజినీరు. అంటే, ఇంజినీరు సూర్యారావు- 'వట్టి' సూర్యారావు' అయి పోయేడు.

ఒక్కగా నొక్క కొడుకు వుద్యోగం పోయింది.

'ఒక్కగానొక్క' తండ్రి అదివిని పోయేడు.

ఛస్తే బూడిచ్చెయ్యడానికి కావాలి- డబ్బు.

పోయినవాళ్ళతో పోలేంకదా ? ఎన్నాళ్ళని తిండి మానుకున్కుంటాం ?

తిండి తినాలంటే-కావాలి డబ్బు.

బతకాలంటే కావాలి-డబ్బు.

వున్న డబ్బంతా ఎక్కడికో వెళ్ళి పోయింది; ఇంకెక్కణ్ణించి వస్తుంది- డబ్బు ?

ఇంట్లోవున్న సామాన్లన్నీ కాళ్ళొచ్చి వెళ్ళి పోతున్నాయి.

రేడియో, ఫేన్. సోఫాలూ కుర్చీలూ,




బిందెలూ, గిన్నెలూ - అన్నీ వెళ్ళిపోతున్నాయి.

మనుషులే మిగిలేరు!

వీళ్ళు ఎప్పుడో ఒకప్పుడు వెళ్ళిపోతారు!

కానీ, వున్నంతకాలం కావాలి - 'కానీ'

డబ్బు! డబ్బు!! డబ్బు!!!

అది వున్నంతకాలం ఒకలా వున్న మనిషి ప్రవర్తన, అది పోగానే మరోలా మారిపోతుంది.

మొహం ఎరిగున్నవాళ్ళంతా పక్కకి తిప్పేసుకుంటున్నారు. పలకరించడానికి జడుస్తున్నారు స్నేహితులు! బంధువులు!!

మొదట్లో. కొన్నాళ్ళు - మళ్ళీపిల్చి వుద్యోగం ఇవ్వక పోతారా - అనుకున్నాడు సూర్యారావు. కాని, అది వట్టి భ్రమేనని తెలిసిన తరువాత మరో వుద్యోగంకోసం ప్రయత్నం మొదలు పెట్టేడు.

వుద్యోగం రావాలంటే-కావాలిడబ్బు.

అంత డబ్బూ తీసుకుని వుద్యోగం ఇప్పించిన ఆ ఆఫీసరు వుద్యోగంమాత్రం పోలేదు!

ఇప్పుడుమళ్ళీ మరొకడికి ఇవ్వాలి-డబ్బు.

సూర్యారావు బి. యి. - ఏం వుద్యోగం చెయ్యాలి? సూర్యారావు ఎళ్ళీ ఇంజినీరు సూర్యారావు-అవుతాడా? - ఈ ప్రశ్నలకి సమాధానాలకి 'వెండితెర' చూద్దామంటే, అసలు 'తెరే' పూర్తిగా చిరిగిపోయింది.

ఇంజినీరు సూర్యారావు క్లార్కు-సూర్యారావు-అయిపోవాలి.

ప్లాన్లు, మేస్త్రీలు, కూలీలు, డ్రాయింగ్సు, కన్‌స్ట్రక్షన్సు జె. యీలూ, కంట్రాక్టర్లూ, లంచాలూ - వీళ్ళ (లేక వీటి) మధ్యనున్న సూర్యారావు - ఫైళ్లూ. బిల్లూ, ఆఫీసరూ, బంట్రోతులూ, టైపిస్టులూ గుమాస్తాలూ. గూడు పుఠా

ణీలూ, కాకాలూ – మధ్యకి వెళ్ళిపోవాలి

వంద రూపాయలు నీవి కావనుకుంటే దెబ్భయి రూపాయల వుద్యోగం నీదను కునేలా చేస్తానన్నాడొకాయన.

వంద రూపాయలు 'నావికావు' అని అనుకోడం ఎలాగ? అసలు 'నావీ' అని వంద రూపాయలు వుంటేనేకదా?

అందుకే, సూర్యారావు నిన్న రాములు దగ్గరకు వెళ్ళేడు. పూర్వం సూర్యారావు ఇంజినీరుగా పని చేసినచోట రాములు బంట్రోతు. బొటనవేలు ముద్ర వేస్తేనేగాని, నాలుగువేళ్ళు నోట్లోకెళ్ళని పరిస్థితి రావు(లి కెప్పుడూ లేదు అతనికి పాలవ్యాపారం వుంది.

'సరింగ జూసుకుంటే, అదొక్కటే కాన బాబూ! ఏటంటే, మా యింటిది ఆ యాపారం సంగజ్జూసుగుని, నన్ను ఏదో గౌరవం వుండేపని సేసుకో మంటుంది. అందికే, ఈ రూ(వుల ఫెయిల్లు ఆరూవు(నోకీ, అరూ(వులకాయి తాలు, ఈ రూ(వునోకి సేర్పి పనికి కుదురుకున్నాను. నాకుగాని తిక్కరేగిం దంటే. ఏటి? – ఈ వుద్యోగం వొగ్గీసి పోగల్ను' అనేవాడు రాములు అందరితో.

సూర్యారావు రాములుతో తన పరి స్థితంతా చెప్పేడు. రాములు అంతావిని, "నాకు తెల్దేటి బాబూ! ఇంజినీరు సదుంకున్న బాబులందరి వుజ్జోగాలూ పోనాయి. కోపం తెచ్చుకోనంటే సెప్తాను బాబూ! ఎందుకు బాబూ! ఈ సదం? వందరూపాయలు కావాలంటే, కూడెట్టనేక పోనాక! నా నేటి సదివేను? వికానీగోణ్ణే కదా!... అయితే, బాబూ! వందరూపాయిలి స్తే, గుమస్తా వుజ్జోగం ఇప్పిస్తానన్నాడా – అబాబు? మీలాం టోళ్ల మా యింటికొచ్చి అడగడవే( సాల్పాలు! వుండండి బాబూ! ఇప్పుడే వస్తా..." అని లోపలికి వెళ్ళేడు.

అనుకున్నపని ఇంత అనుకూలంగా జరుగుతుందని సూర్యారావు వూహించ లేదు; కానీ, తలచినదే జరిగితే దేవు డెందుకూ వుండి – అన్నారు 'పెద్దలు'. అనుకున్నవన్నీ తలకిందులు చెయ్యా డానికే కాబోలు దేవు(డున్నాడు.

కొంత సేపటికి రాములు బైటికి వచ్చి, "బాబూ! మీరు మరోలాఅనుకోపోతే సెప్తాను. మా ఇంటిదాన్తో మీ ఇసయం ఇవరంగ పెప్పేను. అది అంటదిగదా – ఏదన్నా వొస్తువు తాకట్టెడితే...అ( అ( బాబూ! మీ మీన నమ్మకం నేదని కాదు. మరేట్నేదు – ఈ డబ్బు కాపీనం అడో ల్లకి మాజాస్తి. దాన్ని కాదని, నాను పైసా కూడా మీకు ఇయ్యనేను. మరి మరోఇదంగా ఆలోచించకండి బాబూ..." అన్నాడు.

"సరే, అలాగే, మరైతే రేపొ స్తాను'' అని వచ్చేశాడేగాని, సూర్యా రావుకి తాకట్టు పెట్టేవస్తువు ఇంట్లో ఏ(వుందో తోచడంలేదు.



పెట్టేవస్తువు ఇంట్లో ఏదీలేదు వున్నవేవో ఎప్పుడో వెళ్ళిపోయేయి.

ఇంకా ఏం వున్నాయి? ఆం. వుంది. ఒక్కటే వుంది!... అది... భార్య మంగళసూత్రం!! ఇక అదే మిగిలింది భార్యనడిగితే ఇస్తుందా?... ఇస్తుంది. తప్పకుండా ఇస్తుంది.

గబ గబా, మెల్లిమెల్లిగా — నడిచేడు సూర్యారావు.

సాయంత్రం రాత్రి — గా మారిపోతోంది.

ఇంటికి వెళ్ళేసరికి భార్య, అప్పుడే లైటు వెలిగించి, మంగళసూత్రం కళ్ళ కద్దుకుంది.

అంతే! సూర్యారావు వుత్సాహం చచ్చిపోయింది. ఆతనికే తెలియని ఏదో సెంటిమెంటు, అతన్ని మరి అడగ నియ్యకుండా చేసింది.

రాత్రంతా వైగ ఆలోచించేడు — సూర్యారావు వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకున్నట్టు! అంతే! అలాగే, సూర్యారావు రావులు కాళ్ళు పట్టుకుంటాడు.

అంతేనండీ! అవసరం!

పగలంతా ఇంట్లో కాలుగాలిన పిల్లిలా తిరిగేడు సూర్యారావు. రావులికి పగలు




ఆఫీసులోపని. సాయంత్రానిగ్గాని ఇంటికి రాడు

అందుకే, సాయంత్రం బయలుదేరి రావుఁలు ఇంటికి వెళ్ళేడు సూర్యారావు, వెళ్తే జరిగింది. రావుఁలు చిన్నబజారుకి వేళ్ళాడు.

ప్రస్తుతానికి వచ్చాడు సూర్యారావు.

సూర్యుడు పూర్తిగా మాయ మయ్యాడు చీకట్లు కమ్ముకుంటున్నాయి. మునిసిపల్ దీపాలు ఆచీకటిని మెడపట్టు కుని గెంటడానికి యథాశక్తి ప్రయత్ని స్తున్నాయి.

రోడ్డు మీదకి వచ్చేడు సూర్యారావు. దూరంగా ఎవరో వస్తున్నారు. రావుఁలే కాబోలు!

సూర్యారావు గుండె దడదడా కొట్టు కుంటోంది.

కలుద్దామనుకుంటున్న మనిషి వచ్చే స్తున్నాడు.

చెప్పాలనుకుంటున్న విషయం చెప్పెయ్యాలి.

ఎలా చెప్పాలి? ఎలా? ఎలాగా?

దగ్గరగా వచ్చాడు అతను. అవును. రావుఁలే!

"ఓ! సూర్రేవుగారూ! మీరా!—" గుప్పుమని కొడ్తోంది నాటుసారావాసన. సూర్యారావు ముక్కుమూసుకోలేదు. విసుగునటా, ఆశ్చర్యం చూపించలేదు— దీనంగా ముఖంపెట్టి," చూడు రావుఁలూ! నేను నీకు కాయితం రాసిస్తాను; అది దగ్గ రుంచుకో. నేను వుద్యోగంలో చేరగానే నువ్వెంత చెప్తే అంత వడ్డీతో తిరిగి నీకు ఇచ్చేస్తాను? నన్ను నమ్ము రావుఁలూ!—" అన్నాడు. సూర్యారావు.



ఇహా ఇంటికి బయలు దేరాడు.

రావులు పెద్దగా నవ్వేడు. నవ్వి నవ్వుతూ, "హ! హ!—సూర్రేవు గారూ! ఎంత అమాయకుడివయ్యా! డబ్బు కాడ ఎవుర్ని ఎవుడూ నమ్మడు బాబూ! తాకట్టుకి వొస్తువు ఎట్టనేకపోతే, నీకు నాను సొమ్మియ్య నేను; ఏటంటే — నమ్మనని గాదు. రోజులలా వున్నాయి. నమ్మకంగా వుజ్జోగం ఇచ్చినోడు అలాగే సాపకింద నీరు నాగ, నీ వుజ్జోగం తీసేసి పీ కూడులో మట్టి జల్లేసి, నీ జీవాలు ఈదిని బడీ నాగ సేస్తాడని నువ్వు కలగన్నావా? అంతే బాబూ! అంతే! ఏటో...రోజులిలాగే వుంటే...ఎవడు ఏఁవయిపోతాడో! గారంటీ ఏత్నేదు బతుక్కి!...ఏటి నమ్మకం! మొన్నటి దాకా ఇంజినీరు వుజ్జోగం సేసి నోడివి... నీ బతుకు ఇలా బజారు పాలవుతుందని ఎన్నడన్నా అనుకున్నాడా? ఎవడి జాగర్తలో ఆడుండాలి; తెల్లారి లేస్తే మన బతుకెలాగుంటదో ఆలోసించుకునే ఈ రోజు గడపాల; మరోటీ మరోటీ అనుకుని నాబం లేదు. నువ్వు కాయితం రాసిచ్చినా నాకు, నీకు డబ్బియ్యనేను_ వస్తాను బాబూ!" అని, తూలుకుంటూ వెళ్ళిపోయేడు.

రావులు తాగి వున్నాడు. అందుకే 'విజాన్ని' అలా కుండబద్దలు కొట్టినట్టు చెప్పేడు.

సూర్యారావు రెక్కలు విరిగిపోయేయి. అతని ఆశలు అంతరించాయి– డబ్బు! డబ్బు!! డబ్బు!!!

తలవంచుకుని నడుస్తున్నాడు–సూర్యారావు

తల–వంచుకునే నడుస్తున్నా సూర్యారావు. తలెత్తుకుని తిరిగేరోజు వస్తుందా? మేష్టారూ! వస్తుందా?



# తీరని బాకీ

## వి.వి.యస్. రామదాసు

వెంకటరావు నాంపల్లి స్టేషనుకు వెళ్ళాడు. పూరీపాసెంజరు రైటు టైముకి వస్తోందా_లేటుగా వస్తోందా_అని నోటీసుబోర్డు చూశాడు. నలభై నిమిషాలు లేటు_అని వ్రాసివున్నది.

పూరీపాసెంజరుఎన్నోనంబరు ప్లాటుఫారందగ్గర వస్తుందో తెలుసుకుని ఆ ప్లాటుఫారంమీదికి వెళ్ళి, అక్కడ ఖాళీగా ఉన్నబెంచీమీద కూర్చుని జేబులోనుంచి ఒకకాగితం తీసి ఇట్లా చదువుతున్నాడు.

"తాడేపల్లిగూడెం,
6_4_1966.

సోదర టైపిస్టుగారికి నమస్కారములు. మీ పేరు తెలియక యీ విధముగా వ్రాసినందుకు క్షమించండి. మీ ఆఫీసులో నన్ను టైపిస్టుగా వేసినట్లు

మీకు తెలుసు ననుకుంటాను. ఇవ్వాళే నాకు ఆర్డరు అందినది. నేను పూరీ పాసెంజరులో పదవ తేదీన బయలుదేరి హైదరాబాదు వస్తున్నాను. నేను ఇంతకు



మునుపు ఎప్పుడూ హైదరాబాదు రాలేదు. నాయందు దయవుంచి స్టేషనుకు రావల సిందని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు,
డి. సుబ్బారావు'

కాగితం మడచి జేబులో పెట్టుకు న్నాడు వెంకటరావు.

ఈ సుబ్బారావు తననుగురించి మరి కొన్ని వివరాలు యిచ్చి ఉంటే బాగుం డేది. అతనిని సులభంగా గుర్తుపట్టడానికి వీలుండేదని వెంకటరావు అనుకున్నాడు. ఆ ఉత్తరం మూడురోజుల క్రితం వచ్చింది. ఆఫీసులో పనిచేస్తున్న తక్కిన ముగ్గురు టైపిస్టులు ఆ ఉత్తరం తమది కాదని వదిలివేశారు. వెంకటరావు మాత్రం ఆ ఉత్తరం విప్పి చదువుకున్నాడు. మిగతా ముగ్గురు టైపిస్టులకు చూపించాడు.

"ఇతనెవరో భలేవాడండీ. ఇతని కోసం వేరే ఒకరు వెళ్ళడం ఎందుకో? సీదాగా వచ్చేసి ఒకపూటకు ఏదో ఒక హోటలులో బసచేయవచ్చుగదా. మనల్ని చంపడం దేనికి?" అన్నాడు ఒక టైపిస్టు రంగారావు.

"అతని కీనగరం క్రొత్త అని వ్రాశాడు కదా, పాపం..." అని నచ్చ చెప్పబోయాడు వెంకటరావు.

"అయితే నేమండీ. నేరుగా ఆఫీసుకే రావచ్చును కదా" అన్నాడు మరొక టైపిస్టు మాధవరావు.

"రావచ్చు ననుకోండి. అయినా మనతో కలిసి పనిచేయబోయేవాడు వస్తు న్నాడు. ఆ మాత్రం స్టేషనుకి వెళ్ళితే మనసొమ్మేం పోతుంది చెప్పండి." అన్నాడు వెంటకరావు.

"మీదంతా ఒక ఛాదస్తం; దయాకర రావు రిటైరై పోయాడంటే అతనితోనే ఛాదస్తం పోయిందనుకున్నాము. కాని అతని గుణాలు కొన్ని మీకు అలవ

డ్డాయి. వెంకటరావుగారూ," అన్నాడు వేరొక టైపిస్టు ఆనందరావు

"ఇంతకూ మీరు ఆ రోజున నాతో స్టేషనుకు వస్తారా, రారా, ఆ సంగతి చెప్పండి," అని అడిగాడు వెంకటరావు.

"మాకు అంతకంటె మంచిపను లున్నాయి. మా కేమీ తీరికలేదు," అని మిగతా యిద్దరివైపూ చూశాడు మాధవ రావు.

"అయినా అత నేమీ నిస్సహాయు లైన స్త్రీ యేం కాదుకదా, మనలాంటి మగాడే; అతని తంటాలు అతను పడ గలడు; మన కెందుకు లెద్దురూ," అన్నాడు రంగారావు.

"అతనే స్త్రీ అయితే మనలో మనం పోటీపడి వెళ్ళేవాళ్ళం. ఎంత ముఖ్య మైన పనులున్నా అవన్నీ వాయిదా పడి పోయేవి ... వాళ్ళతో మనకేం గాని, మీరైనా వస్తారా, ఆనందరావుగారూ?" అని అడిగాడు వెంకటరావు.

"నాకేమీ అభ్యంతరం లేదు గాని ఎల్లుండి కిర్సనాయిల్ కోసం ప్రయత్నం చేయాలి, అందుచేత రావడానికి వీలుం డదు," అన్నాడు ఆనందరావు.

వాళ్ళ ప్రమేయం లేకుండానే ఆరోజు వెంకటరావు స్వయంగా నాంపల్లి స్టేషనుకు వెళ్ళాడు.

మూడేళ్ళక్రితం ఈ ఆఫీసుకి వెంకట రావును బదిలీ చేసినప్పుడు అతడు ఒక ఉత్తరం ముక్కయినా వ్రాయకపోయి నప్పటికీ దయాకరరావు స్టేషనుకు వచ్చి రైల్వే పోర్టరుతో తాను మాట్లాడే పద్ధతిలోనే తాను యీ నగరానికి క్రొత్త వాడని గుర్తించి "మీ పేరు వెంకట రావుగారు కాదూ?" అని పలకరిం చాడు.

"నా పేరు మీ కెలా తెలుసు? మీ రెవరండీ?" అన్నాడు వెంకటరావు.

"నేను...ఆఫీసులో టైపిస్టుగా పని చేస్తున్నాను. నా పేరు దయాకరరావు. మీ రేమీ మొగమాటం పడకండి. మా యింటికి వచ్చేయండి," అంటూ పోర్ట రుతో చక చకా ఉర్దూలో మాట్లాడి స్టేషను బయటకు వచ్చి, ఒకరిక్షా మలక పేటకు కుదుర్చుకుని అందులో సామాన్లు యెక్కించి, "ముందు మీరు ఎక్కండి, వెంకటరావుగారూ," అని పోర్టరుకు తానే డబ్బు ఇచ్చి రిక్షాలో ఎక్కాడు.

"నేను ఇవ్వాళ వస్తానని మీకు ఎలా తెలుసునండీ, దయాకరరావుగారూ," అని అడిగాడు వెంకటరావు,

"చాలా సులభం, వెంకటరావుగారూ! మీ బదిలీఆర్డరు టైపు చేసినవాడను నేనే. ఇవ్వాళ మీరు జాయను కావడానికి ఆఖరురోజు. ఇంతకుముందు ఏరోజున మీరు వచ్చినా నేను స్టేషనుకు వచ్చే వాడినికాదు. కారణం ఏమిటంటే – మీరు ఫలానా రోజున వచ్చితీరుతారని తెలి యదుకదా. కాని ఈరోజున తప్పకుండా




వస్తారనుకున్నాను. వచ్చారు.'' అన్నాడు దయాకరరావు.

"చాలా థాంక్సండి, దయాకరరావు గారూ! చాలా మంచిపనిచేశారు. మీరే రాకపోతే నేను చాలా ఇబ్బంది పడి పోయేవాడిని," అన్నాడు వెంకటరావు

రిక్షాలో ఉన్నంత సేపూ వెంకటరావు మనసు పరిపరి విధాలుగా పోయింది. ఈ దయాకరరావు ఎందుకింత శ్రద్ధ చూపిస్తున్నాడు? ఆఫీసులో ఎవరికీ పట్టనిది ఇతనికేం పట్టింది? ఇతనికేమైనా పెండ్లీడుకున్న ఆడపిల్లలున్నారా? వెనకటికొకసారి ఒక ఆఫీసుకి బదిలీఅయి వెంకటరావు వెళ్ళినప్పుడు తాను అవివాహితుడననుకుని ఆఫీసులో ఒకాయన_ ఆడపిల్లలతండ్రి, తానంటే ఎంతో అభిమానం ప్రకటిస్తూ ఇంటికి తీసుకొనిపోయి కాఫీ యిచ్చాడు; చివరకు ప్రసంగవశాత్తు తనకు ఇదివరకే పెళ్ళి అయిపోయిందని తెలియగానే నెమ్మదిగా మానవత్వ ప్రకటన మానివేశాడు. అటువంటి సంఘటన మరొకసారి జరగకూడదనే ఉద్దేశంతో వెంకటరావు, "దయాకరరావుగారూ, సాయంత్రం ఆఫీసు నుండి రాగానే ఏదయినా ఒక చిన్నగది చూసుకోవాలండీ, తరువాత నెమ్మదిగా ఒక ఫ్యామిలీ పోర్షను చూసుకుంటాను, మావాళ్ళను ఎన్నాళ్ళని వాళ్ళ పుట్టింట్లో ఉంచడం; _ చెప్పండి.'' అన్నాడు.

"వేరే చిన్నగది ఎందుకండీ నాకు గవర్నమెంటువారు అద్దెకిచ్చిన క్వార్టర్సులో రెండు గదులున్నాయి, అందులో

ఒక గదిలో మా అబ్బాయి చదువు కుంటాడు. ఆ గదిలోనే మీరు కూడా ఉండవచ్చును." అన్నాడు దయాకరరావు.

దయాకరరావు తనచేత వాళ్ళ అబ్బాయికి ఉచితంగా ట్యూషను చెప్పించుకొనవచ్చునని అనుకుంటున్నాడు కాబోల, అందుకా ఈ సహాయం చేయడం అని శంకించాడు వెంకటరావు. ఉండబట్టలేక మీ అబ్బాయి ఏమి చదువుకుంటున్నాడండి, దయాకరరావుగారూ?'' అని అడిగాడు వెంకటరావు.

"ఇంజనీరింగు ఫైనలియరు చదువుతున్నాడండీ'' అన్నాడు దయాకరరావు.

వెంకటరావు సిగ్గుపడ్డాడు. ఇంజనీరింగు విద్యార్థికి తనేం చదువు చెప్పగలడు?

రిక్షా మలకపేటచేరింది. ఎంతో ఆప్యాయంగా దయాకరరావుగారి భార్య కరుణమ్మగారు ఆదరించి అమృతతుల్యమైన భోజనం పెట్టింది.

ఎవరూ స్వార్థరహితంగా ఏ పనీ చేయరని వెంకటరావు అనుభవపూర్వకంగా తెలుసుకున్న విషయం. కాని దానికి భిన్నంగా దయాకరరావు ప్రవర్తిస్తున్నాడంటే అతనికి ఆశ్చర్యం కలిగింది. ఎవరు ఏ సలహా ఇచ్చినప్పటికీ ఆ సలహా వెనుక ఉన్న స్వార్థం పసికట్టడం వెంకటరావుకి ఒక అలవాటయింది.

సింగిల్ రూము దొరకడానికే వెంకటరావుకు పదిరోజులు పట్టింది. ఆ పదిరోజులూ దయాకరరావు బలవంతంగా తన ఇంటిలో వెంకటరావుకు భోజనం పెట్టాడు. వాళ్ళ ఇంట్లో ఆదరణను చవిచూసిన వెంకటరావుకి మానవత్వంమీద నమ్మకం మళ్ళీ చిగురించింది.

సింగిల్ రూముకి వెంకటరావు వెళ్ళిన తరువాత ఫ్యామిలీ పోర్షనుకోసం అతనితోబాటు దయాకరరావుకూడా తిరిగాడు. చివరకు ఆయన సహాయం చెయ్యడం వల్లనే ఒకచోట ఒక వాటా అద్దెకు దొరికింది.

"చూడండి వెంకటరావుగారూ, ఫలానా రోజున మంచిది కాబట్టి మీ కుటుంబాన్ని తీసుకురండి, వాళ్ళు వచ్చిన రోజున సామాన్లు మీ ఇంటికి పట్టించుకునివెళ్ళి భోజనానికిమాత్రం మా ఇంటికి వచ్చేయండి. ప్రయాణపు బడలికతో ఏమి తంటాలు పడతారు, పిల్లలతో. మరునాడు పాలూ, కూరగాయలూ, బియ్యం, మిగతా పదార్థాలన్నీ సమకూర్చుకుని ఉంచుకున్న తరువాత మీ ఇంటికి తీసుకొని వెళ్ళవచ్చును." అని సలహా ఇచ్చారు దయాకరరావు. ఆ ప్రకారమే జరిగింది.

అతడు ఇంటికోసం తిరుగుతున్న మొదటినాడే, వెంకటరావుగారూ, ఈ రోజే ఇల్లు కావాలని ఒక దరఖాస్తు పెట్టుకోండి. మా కాలనీలో ఎవరైనా బదిలీఅయి వెళ్ళుతున్నారేమో ఒక కంట కనిపెడతాను. ఎవరైనా బదిలీఅయి ఆ క్వార్టరు మీకు లభిస్తే సంతోషమే.




అలా దొరకని పక్షంలో ఒక మూడు సంవత్సరాలు ఓపిక పట్టారంటే నేను రిటైరవుతాను. అప్పుడు నా క్వార్టరు మీకు వచ్చేటట్లు ప్రయత్నంచేద్దాము.'' అన్నాడు దయాకరరావు. అతడుఅన్నట్లే వేరే ఏ క్వార్టరు ఖాళీ అయినప్పటికినీ వెంకటరావుకి రాలేదు. చివరకు దయాకరరావు రిటైరైన తరువాత ఎంతో ప్రయత్నంచేసి తనకు ఆ క్వార్టరు ఇప్పించేటట్లుచేశాడు దయాకరరావు

దయాకరరావు తనకు ఎందుకంత సహాయంచేశాడో అప్పటికీ ఇప్పటికీ వెంకటరావుకి అంతుపట్టలేదు. రిటైరయే దశ వస్తున్నకొలదీ పైపుచేసే ఓపిక తగ్గిపోయి తనచేత అతని పని కూడా చేయించుకోవాలనే ఉద్దేశ్యంతో ఇంత సహాయంచేస్తూ వచ్చాడేమోనని మొదట్లో వెంకటరావు అనుకున్నాడు. కాని దయాకరరావు ఎప్పుడూ తనపని ఎవరిమీదనూ నెట్టలేదు; పైగా గొలుసు కట్టు వ్రాతలను చదవడంలో మిగతా టైపిస్టులకు దయాకరరావు ఎప్పుడూ సహాయం చేసేవాడు.

పోనీ – నెలాఖరువారంలో చేబదులు పుచ్చుకునే ఉద్దేశ్యంతో ఇంతమంచిగా ఉంటున్నాడేమోనని వెంకటరావు అనుకున్నాడు. కాని ఎప్పుడూ దయాకరరావు వెంకటరావుని చేబదులు అడగలేదు. సరికదా – రెండుమూడుసార్లు తాను చేబదులు ఎవర్ని అడుగుదామా అని సతమత మవుతున్న సమయంలో దయాకరరావు, "వెంకటరావుగారూ, ఏమిటి అదో మాదిరిగా ఉన్నారు, ఏమైనా చేబదులు కావాలా ?'' అన్నాడు.

"మరేనండి, దయాకరరావు గారూ. అయినా ఎన్నిటికని మిమ్మల్ని బాధ పెట్టడం చెప్పండి." అన్నాడు వెంకటరావు.

"నాకేం బాధలేదు. నాదగ్గర డబ్బు లేదే, మీకు ఇవ్వడానికనేది – ఒక్కటే నాబాధ." అని దయాకరరావు అంటూ ఉంటే వెంకటరావు ముఖం నిరాశతో వెలవెల పోయింది. అతనిదగ్గర డబ్బు లేనప్పుడు తనెందుకా ప్రస్తావన చేయాలి అని పరమ దయాళువైన దయాకరరావు మీద వెంకటరావుకి చేతకాని చిరాకు వచ్చింది. అది క్షణమాత్రం. దయాకర రావు ఇంకా ఇలా అన్నాడు. "మన ఆఫీసులో వెంగళరావు అని ఒక గుమాస్తా ఉన్నారు. ఆయనను మీకు పరిచయం చేస్తాను. అతడు ఎప్పుడూ ఎవరికీ చేబదులు లేదనడు; అయితే మీకెంతకావాలో దానికి రెట్టింపు అడ గండి. అడిగినదానిలో సగం ఇవ్వడం అతనికి అలవాటు." ఈమాట వినేసరికి వెంకటరావుకి వేసవిలో కూల్ డ్రింక్ త్రాగినంత హాయిగా అనిపించింది. చేబదులు విషయంలో దయాకరరావు చూపించిన మార్గాన్నే వెంకటరావు అనుసరించాడు.

కృతజ్ఞత భారంలో కృంగిపోతున్న వెంకటరావు దయాకరరావుకి ఏవిధముగా సహాయంచేసి బాకీ తీర్చుకుందామా అని ఆలోచించాడు. ఎప్పుడూ తానే దయాకర రావు సహాయాన్ని పొందడం జరిగింది గాని దయాకరరావుకి సహాయంచేసే అవకాశం వెంకటరావుకి కలుగలేదు ఒకనాడు వెంకటరావు, "దయాకరరావు గారూ, ఎప్పుడూ మీరేనాకు సహాయం చేస్తున్నారుగాని నేను మీకు ఏమీ సహాయం చేయలేదు. మీబాకీ ఎలా తీర్చుకోవాలో నాకు తెలియడంలేదు." అన్నాడు.

"పెద్ద పెద్ద మాటలు ఉపయోగించి నన్ను సిగ్గుపరచకండి – వెంకటరావు గారూ. ఇంతకూ నేను చేసినది చాలా స్వల్పం. ఆ స్వల్పకార్యాలు చేయడం లోనే నేను ఆనందాన్ని పొందాను. ఆవిధముగా ప్రతిఫలం నాకు ముట్టింది." అన్నాడు దయాకరరావు.

అలాంటి దయాకరరావు రిటైరయ్యే టప్పుడు ఇచ్చే టీపార్టీవగైరా కార్య క్రమంలో ఎక్కువగా పాల్గొనాలని వెంకటరావు అనుకున్నాడు. కాని దయాకరరావు అభిమానులు ఆఫీసులో చాలమంది ఉండడంవల్ల వెంకటరావుకు ఆభాగ్యం కలుగలేదు.

రిటైరయిన తరువాత కొంచెం యిబ్బందులలో ఉండవచ్చు కనుక– అంటే అతనికి ఇబ్బందులు కలగాలని కోరడంకాదు కాని–సాధారణంగా ఇబ్బం దులు వస్తాయి కాబట్టి సహాయం చేద్దా మనుకున్నాడు. కాని భగవంతుని దయ వల్ల దయాకరరావు కొడుకు ప్రథమ శ్రేణిలో బి. ఇ. పాసైనాడు. ఈ కథా

కాలంనాటికి ఇంజనీర్లలో నిరుద్యోగ సమస్య లేదు కాబట్టి వెంటనే ఉద్యోగం వచ్చింది. జూనియర్ ఇంజనీరుగా నాగార్జున సాగర్ ప్రాజెక్టువద్ద వేశారు. దయాకరరావు రిటైరయేనాటికే వాళ్ళ అబ్బాయి రెండు సంవత్సరాలనాటి నుంచి ఉద్యోగం చేస్తున్నాడు.

దయాకరరావు రిటైరయిన కారణంగా ఏర్పడిన ఖాళీని భర్తీ చేయడానికే సర్వీసు కమీషనువారు కేటాయించిన అభ్యర్థుల నుంచి ఎంచి సుబ్బారావును వేశారు.

"యువర్ అటెన్షన్ ప్లీజ్" అని రైల్వే పాసెంజరు లౌడు స్పీకర్‌లో చేసిన ధ్వనితో వెంకటరావు పాత స్మృతులలోనుండి ప్రస్తుత ప్రపంచం లోకి వచ్చాడు.

"దయచేసి వినండి, పూరీనుండి వచ్చు పాసెంజరు ఇంకొక అయిదు నిముషములలో ఒకటవ నంబరు ప్లాటు ఫారం మీదికి వచ్చును." అనే ప్రకటన విన్న వెంకటరావు బెంచీమీదనుంచి లేచి బద్ధకం విరుచుకుని ప్లాటుఫారం మీద అక్కడక్కడ ఉన్న జనం మధ్యనుంచి నడువసాగాడు.

ఇంక రైలుబండి వచ్చేస్తుంది. కాని సుబ్బారావు అనే ఆయన ఎలా ఉంటాడో తెలియకుండా ఏవిధముగా కలుసుకొనడ మని వెంకటరావు ఆలోచిస్తున్నాడు.

ఇంతలో పొగలు చిమ్ముకుంటూ పూరీ పాసెంజరు రానేవచ్చింది. పోర్టర్లు కారేజీల వెంబడి ప్లాటుఫారం మీద పరుగెత్తుతున్నారు. బండి ఆగింది. చాలా కోలాహలంగా ఉంది. ఒక్కొక్క క్యారేజి నుండి ప్రయాణీకులు దిగుతున్నారు. వెంకటరావు ఆనాడు దయాకరరావు ఏమి చేశాడో గుర్తుకు తెచ్చుకున్నాడు. రైల్వే పోర్టరుతో ఎవరు భాష తెలియక తికమక పడుతున్నారా -అని ఒక్కొక్క ప్రయాణీకుడినీ చూశాడు. ఒకచోట ఒక యువకుడు ఒక హోల్డాలూ ఒకపెట్టె చెరొక చేత్తో పట్టుకుని దించుకుని ప్లాటు ఫారం మీద నిలబడి అటూ ఇటూ ఎవరి కోసమో వెదుకుతున్నట్లు చూస్తున్నాడు. అతని దగ్గరకు వెళ్ళాడు వెంకటరావు అతని పెట్టెమీద వ్రాసిఉన్న పేరు చూశాడు. డి. సుబ్బారావు, తాడేపల్లి గూడెం - అని ఉన్నది. ఎక్కువ శ్రమ పడకుండా ఆమాకీ దొరికినందుకు వెంకటరావు మనస్సులో దేవుడికి నమస్కరించి ఆ యువకునితో, "క్షమించండి. మీపేరు సుబ్బారావుగారు కదా?" అన్నాడు.

మూడేళ్ళక్రితం తాను ఆశ్చర్య పడి నట్లే అతనుకూడా ఆశ్చర్యపడుతూ, "నాపేరు మీకెలా తెలిసింది? నేను వ్రాసిన ఉత్తరం మీకు అందినదా?" అన్నాడు.

"అందింది. రండి - మా ఇంటికి

వోదాం" అని ఆహ్వానించాడు_ వెంకట రావు.

రిక్షాలో అతని సామాన్లు ఎక్కించి, ముందు సుబ్బారావుని ఎక్కమని, పోర్టరుకు డబ్బులిచ్చి తానుకూడా రిక్షాలో ఎక్కాడు వెంకటరావు. పాపం, రాత్రంతా నిద్రలేదు కాబోలు _ సుబ్బారావు రిక్షాలో కునికిపాట్లు పడ్డాడు.

రిక్షా మలక్‌పేట చేరింది.

స్నానానికి వేడినీళ్ళు ఇచ్చింది వెంకట రావు భార్య పద్మావతమ్మ. ఎంతో ఆద రంతో రుచికరమైన భోజనం పెట్టింది.

భోజనాలయాక వసారాలో చాపమీద వక్కలూ, ఆకులూ సున్నమూ పెట్టింది పద్మావతమ్మ.

వెంకటరావూ, సుబ్బారావూ చాప మీద కూర్చుని తాంబూలం వేసుకుంటు న్నారు. వాళ్ళకు కొంచెం దూరంగా పద్మావతమ్మ నిలబడి ఉంది.

"ఇంక నువ్వు వెళ్ళి భోజనం చెయ్యి. పద్మా," అన్నాడు వెంకటరావు.

"చేస్తాలెండి, మీ కేం కావాలో ఇవ్వాలని నుంచున్నాను. మీరు ఆఫీసుకి వెళ్ళిన తరువాత భోజనం చేస్తాను." అన్నది పద్మావతి.

ఇతరులకు సహాయం చేయడంలో ఎంత ఆనందం ఉన్నదో వెంకటరావు గ్రహించాడు. దయాకరరావు ఎంత ఆనందాన్ని పొందేవాడో వెంకటరావుకి అర్థమయింది. తనకు ఎంతో సహాయం చేసిన దయాకరరావు ఋణం తీర్చుకో డానికి మార్గం కనిపించింది. తానుకూడా ఇతరులకు సహాయం చేయడం ద్వారానే ఆ బాకీ కొంతవరకు తీరుతుందని వెంక టరావుకి నమ్మకం కుదిరింది.

భోజనం చేసి తాంబూలం వేసుకుని స్థిమితపడిన సుబ్బారావుకి హఠాత్తుగా ఒక విషయం గుర్తుకు వచ్చింది. "ఇన్నాళ్లు అడగడమే మరిచిపోయాను. మీపేరేమిటి మాస్టారూ?" అని వెంకట రావుని అడిగాడు.

"నా పేరు దయాకరరావు" అన్నాడు వెంకటరావు పరధ్యానంగా.

పద్మావతికి నవ్వాపుకొనడం చాలా కష్టమైంది. ఎలాగో నవ్వాపుకొంటూ,

"అదేంటండీ అంత పరధ్యానంగా ఉంటే ఎలాగండీ? మీ పేరు చెప్పక దయాకరరావుగారి పేరుచెబుతారేమండీ?" అన్నది పద్మావతమ్మ.

"సారీ, సుబ్బారావుగారు! నా పేరు వెంకటరావు ..ఇంక ఆఫీసుకి వెళదాం, లేవండి," అన్నాడు వెంకటరావు.

# బంగారు కాలం

## గోపాల చక్రవర్తి

సంవత్సరం 2030 క్రి. శ. ఒక్కసారి పెద్ద జలప్రళయం వొచ్చేసింది. ప్రపంచమంతా మునిగిపోయింది. మొత్తం మానవజనాభా, పశువులూ, అన్ని జీవరాసులూ తుడిచిపెట్టుకుపోయాయి. అయితే ఏనాడో కెనడా వెళ్ళిన ఒక ఆంధ్రుడూ ఒక పంజాబీ, ఒక మహారాష్ట్రుడూ వాళ్ళ భార్యలూ మరణించకుండా మిగిలిపోయారు. ఒక చిన్న పడవలో వాళ్ళు బయలుదేరి ప్రయాణం సాగించారు. కతిపయదినాలకు వాళ్ళు భారతదేశం చేరుకున్నారు. భారతదేశంకూడా పూర్తిగా నీళ్ళల్లో తేలుతున్నది. వాళ్ళు కాస్సేపు బాధపడి, ఆంధ్రదేశంవైపు పడవలో సాగిపోయారు. కనుచూపుమేర అంతానీళ్ళే. వెళ్ళగా వెళ్ళగా ఒకచోటమాత్రం మునిగిపోకుండావున్న ఒక మేడ కన్పించింది. నెమ్మదిగా పడవదిగి కాస్సేపు ఈదిమేడపైకి చేరారు. అక్కడ వాళ్ళకు కట్టలుకట్టిన అత్యంత సుందరమైన కొన్ని పుస్తకాలు కన్పించాయి. అవి తీసి చదవడం మొదలుపెట్టారు - వాళ్ళు ఆరుగురూ. అవి కొన్ని దశాబ్దాలకు పూర్వం కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు ప్రకటించిన పత్రికలూ, కరపత్రాలూ. "ఎంతబంగారు కాలమది. ఆరోజుల్లో కరువూ కాటకం లేవన్నమాట. దేశం ఎంతో సుఖిఉంగా శాంతిభద్రతలతో వుండేదన్నమాట" అని ముచ్చటపడిపోయారు వాళ్ళు.

* * * *

మళ్ళీ సృష్టి ఆరంభమయింది.

# తీరిన కోరిక

గండూరి వెంకట రమణి

స్టాఫ్ రూమ్‌లో కొత్త వ్యక్తిని చూసి అడుగు ముందుకు వేయబోయిన జయ వెనక్కి వేసి వీధిలోనే నిలుచుండి పోయింది. హెడ్‌మిస్ట్రెస్ అప్పటికి రాలేదు. టైమ్ తొమ్మిదిన్నర దాటలేదు. వేపచెట్టుక్రింద తలదించుకుని నిలుచుండి పోయింది జయ. అతను గదిబయటికి వచ్చి రెండు క్షణాలు అటూ యిటూ తచ్చాడి చివరికి స్టాఫ్‌రూమ్‌గుమ్మంమీద మోకాలు ఆన్చి రెండుచేతులూ ద్వార బంధానికి ఆసరాగా వేసుకుని జయకి వినిపించే స్థాయిలో అన్నాడు; 'నేను రాత్రి వచ్చేను. ఇక్కడి సెక్రటరీ మధు నా స్నేహితుడు. అతను యింత వరకూ రాలేదు. మీకేమైనా వివరాలు తెలుసాండీ'

ఆతని కంఠంవిని జయ తలెత్తింది. ఆరడుగులపొడుగు, మంచి ఠీవీ, దర్పం, మొహంలో గిరిగీసిన అందంతో నిస్సహాయంగా సెక్రెటరీ గురించి అడుగుతూంటే క్రింది పెదవితో నవ్వుని బిగబట్టిఅతనివైపు చూస్తూ 'కొంచెం ఆగుతే హెడ్‌మిస్ట్రెస్ వస్తారు. యివాళే ఆలస్యం చేశారు. రోజూ యీవేళ్టికి వచ్చే వారు ఆవిడ. సెక్రెటరీ ఈరోజు వస్తారు. పన్నెండుగంటలవరకూ ఆగాలి మీరు.' అన్నది.

'అయితే మీరు యిక్కడ వర్క్ చేస్తున్నారన్నమాట. లాస్ట్‌టైమ్ వచ్చినప్పుడు మిమ్మల్ని చూడలేదు నేను. మాది నిజామాబాద్, అక్కడ నేను స్కూల్ యిన్స్‌పెక్టర్ని. హైదరాబాద్ పనిమీద వచ్చేను' ఆతను చెప్పుకుపోతున్నాడు. ప్రతి మాటలోనూ విరుపు, అందంగా పలికే వుచ్చారణ. జయ మొహాన్ని తిప్పుకుంది బలవంతంగా.

దూరంనుంచే నమస్కారం చేస్తూ వచ్చిన హెడ్‌మిస్ట్రెస్‌ని చూసి ఆశ్చర్య



పోయింది. సునందకి యెవరెటువంటి వారో పసిగట్టే స్వభావాన్ని దేవుడు వరంలా యిచ్చేడు. హెడ్‌మిస్ట్రెస్‌గా వున్నా కలుపుగోరుతనంగావుండే ఆవి డంటేఅందరికీయిష్టమే. జయరెప్పవేయ కుండా చూస్తూ ఉండిపోయింది. అతను యెంతోసేపు మాట్లాడేడు. చివరికి విలు చుంటూ జయవైపు తిరిగి. 'మీకు పనికి వచ్చే లిటరేచర్ బుక్స్ కావాలంటే తీసుకోండి' అన్నాడు. జయ మాట్లాడ లేదు. పదిగంటల ప్రాంతంలో చూసిన అతనిస్నేహం రెండుగంటలు కాక ముందే ధ్వజం యెత్తుతోంది. తన మన సులో అప్పటికప్పుడే గుట్టలు గుట్టలుగా పేరుకునే పూటల్ని పేర్చి మాలకట్టి అతని మెడలో వేయాలనే వూహ రాగానే సిగ్గుపడింది. ఆ కోరిక మరింత పటిష్ఠంగా పాతుకుపోయి అతనితో ఒకక్షణం మాట్లాడి తీరాలనే పట్టుదల వరకూ సాగగానే పిచ్చిదానిలా అయిపో యింది. అతను అందరికీ నమస్కారం చేస్తూంటే సెక్రెటరీ అప్పుడు వచ్చి

పరిచయంచేస్తూ అన్నాడు: 'ఇతను దేవేంద్ర; నాక్లోజ్ ఫ్రెండ్.'

రెండు చేతులూ జోడించేలోగానే స్క్రెటరీ మోటార్ సైకిల్ శబ్దం దద్దరిల్లింది. అతను గుమ్మం వరకూ వెడుతూ హెడ్‌మిస్ట్రెస్ వైపు చూస్తూంటే జయకంఠాన్ని పెగిలించుకుంది: 'మేడమ్' ప్లీజ్ - ఆయన్ని ఒక్కసారి పిలవరూ?'

సునంద కళ్ళు జయని పరికించేయి. జయ అమాయకురాలు. మనసులో మాటని దాచుకోలేని ఆ పిల్లకి పాతిక నిండినా పసితనం పోలేదు. మొదటి నుంచీ జయపట్ల గౌరవం, ప్రేమా వున్నాయి సునందకి. 'నిజంగా అంటున్నావా? జయా' అన్నది కొంచెం సందిగ్ధంగా.

'అవును మేడమ్; ఒక్కసారి మీరు పిలుస్తున్నట్టు పిలవరూ. ఆయనతో ఒక్కమాట మాట్లాడుతాను'.

సునంద అతన్ని పిలిచింది. అతను లోపలికి వస్తూనే జయ వైపుచూసి పిలిచారుట. చెప్పండి - యేమిటి సంగతి?' అన్నాడు నవ్వుతూ.

'మరేమీ లేదండి. మీరు నచ్చారు నాకు. అంతే.'

అతనికళ్ళు పెద్దవిగా అయిపోయాయి. ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని నెమ్మదిగా అన్నాడు. 'ఎంత ధైర్యం మీకు - మరి వస్తాను' అతను కదిలివెడుతూంటే జయ నిశ్శబ్దంగా సాగనంపింది.

* * *

జయకళ్ళు ఆ రోజు జరిగిన సంఘటనలమీదనుంచి క్రమం తప్పి చేతిలో నలిగిపోయే వుత్తరాల వైపు మళ్ళేయి. అతను రాసిన వుత్తరాలు - అవి ఒకటి కాదు రెండుకాదు. అతని గుండెల్ని చీల్చి రక్తాన్ని దోసిట్లో నింపుకుని కాగితంమీద కుమ్మరించిన అనురాగపు దివ్యజ్యోతులు. కళ్ళల్లోంచి అవిరామంగా కారుతున్న నీటిని ఆపుచేయాలనే ప్రయత్నం చెయ్యలేదు.

జయలక్ష్మిగారికి :

నా కన్నా చిన్నవారు మీరు. నా ఆశీస్సులు మీకు; ఆ రోజు మిమ్మల్ని మొదటిసారి చూసినప్పుడే మీకు వుత్తరం రాయాలనిపించింది; కానీ - యేదో బెంగ భయం. నేను రాసినా మీరు అర్థంచేసుకుంటారా నన్ను. ఈ వుత్తరానికి మీరు జవాబు యిస్తే నాకు కొండంత ధైర్యం. నేను యెదురు చూస్తూంటాను.

ఇట్లు
దేవేంద్ర.

ప్రతి వుత్తరంలోనూ దేవేంద్ర పలకరిస్తూనే వున్నాడు. ఆడపిల్లని ఆకట్టుకునే అందంతో, విశాల వక్షస్థలంతో, నిశ్చలంగా నిలిచిపోయే చూపుల్తో జయలక్ష్మి హృదయంనిండా ఆక్రమించుకుని పీఠం వేసుకుని నరనరంలోనూ అణు



వలలోపడింది. ప్రతాపుడి హృదయంలో ఎంతోకాలంగా రగులుతున్న రాక్షసవాంఛ విషజ్వాలల్ని వెలిగక్కింది. నిస్సహాయురాలైన గంగ సర్పపరిష్వంగంలో చిక్కిపోయింది.

వరండాలో కూచుని యజమాని ఎప్పుడు పిలుస్తాడాఅని ఎదురుచూస్తూ, మంగులు గంజాయిదమ్ము లాగుతున్నాడు. ఉన్నట్టుండి హఠాత్తుగా గేటుదగ్గిర లాంతరుకాంతీ, ఆవెంటనే, "మంగులూ! గంగఎక్కడ?" అన్న బసివిప్రశ్నా అతణ్ణి విచలితుణ్ణి చేశాయి. తను ఒక ఘోరకార్యంలో పాలు పంచుకున్నానని ఆతడికి బాధగానూ, భయంగానూ వున్నది. దానికితోడు గంజాయి తాగినమైకం.

బస్సీ తనను సమీపించటం చూస్తూనే మంగులు వరండాలోంచిలేచి బంగళావెనక్కి పారిపోయాడు.

బస్సీ తలెత్తిచూశాడు. మేడమీదిగది కిటికీలోంచి బయటికి వెలుగు ప్రసరిస్తున్నది. అతి కష్టంమీద కర్రసాయంతో మెట్లెక్కి బస్సీ గదిగుమ్మందగ్గరకు చేరాడు. గదితలుపులు గభాలుమంటూ తెరుచుకున్నాయి. గంగ పరిగెత్తుకుంటూ బయటికివచ్చింది. రేగినజుట్టూ, తొలగినచీరే - ఆమె శోకదేవతలా వున్నది. బస్సీ కూతుర్ని చూస్తూనే, గద్గద స్వరంతో, "అమ్మా !" అన్నాడు.

గంగ వెక్కివెక్కి ఏడుస్తూ తండ్రిని తప్పించుకుని, "నన్ను ముట్టుకోకు నాన్నా, ముట్టుకోకు. ఈ పాపిష్టిశరీరాన్ని ముట్టుకోకు," అంటూ వేగంగా మెట్లుదిగి కిందికెళ్ళిపోయింది. బస్సీ ఒకటి రెండుసార్లు పిలిచాడు, జవాబులేదు.

బస్సీ క్రోధమూర్తి అయిపోయి, గదిలో ప్రవేశించాడు. బస్సీని చూస్తూనే ప్రతాపుడు స్తంభించిపోయాడు. బస్సీకి గదిలో చెల్లాచెదరుగా పడివున్న తన కూతురిచేతి గాజుముక్కలు కనిపించాయి. నిప్పుచెరిగే కళ్ళతో, అతడు భయంకరంగా గర్జించి, ప్రతాపుడిమీదికి ఉరికాడు.

ప్రతాపుడు అసలే తాగినమత్తులో వున్నాడు. పైగా బస్సీ యింతసాహసం చేస్తాడని అతడు వూహించలేదు. ఆకారణంగా అతడిమెడను బస్సీ తేలిగ్గా చేతుల్లో చిక్కించుకోగలిగాడు. "నీచుడా, దుర్మార్గుడా ! ఇవ్వాళ నీరక్తం చూసిగాని పోను," అంటూ బస్సీ హుంకరించాడు.

ఆసరికి ప్రతాపుడికి తను ప్రమాదంలో చిక్కుకున్నానన్న జ్ఞానం కలిగింది. ఆతడు బలంగా బస్సీని పక్కకుతోశాడు. బస్సీకిప్పుడు కర్రసాయంలేదు. అతడు ఒంటికాలిమీద ఊగుతూ కొంచెందూరంపోయి దభీమంటూ గచ్చుమీద పడ్డాడు. అతడికాదెబ్బతో తల పగిలిపోయినట్టనిపించింది. నోటిలోనుంచి రక్తం కారసాగింది. బస్సీ, బాధతో తన్నుకుంటూనే, ప్రతాపుడికేసి నిప్పులుచెరిగే కళ్ళతో చూస్తూ, "పాపాత్ముడా, బతికిపోయావు. అన్నెమూ పున్నెమూ తెలియని నాబిడ్డకు నీవుచేసిన అన్యాయానికి, ప్రాణంలేని ఆకొండరాళ్ళూ, బండలూ ఏదోఒకనాడు నీకు ప్రాయశ్చిత్తంచేసి తీరుతాయి !" అన్నాడు.

ఆతరవాత బస్సీ యిక మాట్లాడలేకపోయాడు. కళ్ళు మూతలుపడ్డాయి. ఒక్కసారిగా యింతరక్తం అతడి నోటినుంచి భళుక్కుమంటూ బయటపడింది.

## 5

ఒకనెల గడిచింది. ప్రతాపుడివల్ల తనకుకలిగిన కళంకంగురించి గంగ రూపకు చెప్పింది. రూప ఆమెను ఎంతగానోఓదార్చి, యీసంగతి మరెవరితోనూ అనటం



మంచిదికాదని సలహాయిచ్చింది. కానీ, తనను ప్రేమించిన మోహన్‌దగ్గిర యిది దాయటంఎలా అన్నది గంగకు తీరనిసమస్యగా పరిణమించింది.

ఈదశలో మోహన్ వచ్చాడు. పిన్నితో మాట్లాడి పెళ్ళిముహూర్తం పెట్టించాడు రూపతల్లి యీసంగతి గంగతో చెప్పినప్పుడు, గంగ దుఃఖవివశురాలైపోయింది. తన పాపాన్నిదాచి మోహన్‌ను వివాహమాడటం ఎలా? అతడికి ముందే జరిగిన ఘోరంగురించి చెప్పటం ధర్మంగా వుంటుందన్న నిర్ణయానికి వచ్చింది గంగ.

వివాహం మర్నాటి ఉదయం అనగా గంగ ఆరాత్రికూచుని ప్రతాపుడీద్వారా తానుపొందిన కళంకం గురించి వివరంగారాసి, ఆకాయితాన్ని వుండగాచుట్టి, రూప తల్లివాళ్ళింట మోహన్ నిద్రపోతున్న గదికిటికీలోంచి, ఆతడిమీదపడేలా విసిరింది. కాని దురదృష్టవశాత్తూ, ఆకాయితపువుండ గురితప్పి మంచంపక్కనున్న బల్లమీది పూలకుండీలోని పూలరెమ్మలమధ్య చిక్కుకుపోయింది. గంగ అది గమనించలేదు. కిటికీ చప్పుడుఅవటంతో మోహన్ నిద్రమేల్కొని, "ఎవరది ?" అన్నాడు. అతడికి వెళ్ళిపోతున్న గంగ కనిపించింది.

ఇక ఆరాత్రంతా గంగకు కంటిమీద కునుకులేదు. తనవుత్తరం చదివింతరవాత మోహన్ ప్రవర్తన ఎలావుంటుంది ? అన్న ఆలోచనతో ఆమెతల వేడెక్కిపోయింది.

తెలతెల వారుతూనే యింటిముందు మంగళవాయిద్యాలు మోగసాగాయి. గంగను పెళ్ళికూతురును చేశారు. మోహన్ ముహూర్తానికి ముందు అల్లంతదూరంలో ఆమెకు కనిపించి చిరునవ్వులు నవ్వాడు. గంగహృదయం కుదుటబడింది. "భగవాన్, ఆయన నన్ను క్షమించారు. నాది తెలిసి చేసినపాపం కాదుగదా ?" అనుకున్నది గంగ.

పెళ్ళితంతు అంతా ముగిసిపోయింది. రాత్రి గదిలో పూలుచల్లిన శయ్యమీద ఒయ్యారంగా కూర్చునివున్నది, గంగ. మోహన్ నిశ్శబ్దంగా తలుపుతెరిచి, అంత నిశ్శబ్దంగానూ మూసి లోపలగడియపెట్టి గంగదగ్గిరకువచ్చి, పక్కనే శయ్యమీద కూర్చున్నాడు. గంగ సిగ్గుతో తల వంచుకున్నది.

"గంగా ! లోగడ ఎంత పరిచయం వున్నవాళ్ళయినా, ఇలాంటి రాత్రి వచ్చేసరికి ఆడపిల్లలు యింత సిగ్గుపడిపోతారేం ?" అంటూ మోహన్, గంగచేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

గంగశరీరం పులకరించింది. ఆమె చెక్కిళ్లు ఎర్రగులాబు లయినాయి. ఆమె మరింతగా తలవంచుకుంటూ, "నాకేంతెలుసు ?" అన్నది మెల్లిగా.

"గంగా ! యీసమయంలో నాతప్పొకటిచెప్పి, నిన్ను క్షమించమని కోర దలిచాను. నేను కాలేజీలో చదివేప్పుడు ఒకమ్మాయిని ప్రేమించి వివాహం ఆడాలనుకున్నాను. కాని, ఆమె మరొకర్ని ప్రేమించి నాతో కేవలం కపటనాటకం ఆడిందని చివరకునాకు తెలిసింది. అప్పుడేమనుకున్నానో తెలుసా ? మళ్ళీ ఎవర్నయినా ప్రేమించటం జరిగితే, కృత్రిమ నాగరికతకు బానిస అయిన కాయితపు పూవును కాక, ఏమారుమూలపల్లెలోనో పూసినపూవును... మాయమర్మ మెరుగని

మల్లెపూవును... మూర్తీభవించిన సౌందర్యాన్ని ప్రేమించాలనుకున్నాను. ప్రేమించాను... ఆ సౌందర్యదేవతను నాదాన్నిగా చేసుకున్నాను. లోగడ నే చేసినతప్పును క్షమిస్తావుగదూ ?" అన్నాడు మోహన్.

"తప్పా !" అంటూ గంగ తలెత్తి, మోహన్ ముఖంలోకి చూసి, నిలువెల్లా కంపించిపోయింది.

"అవును, గంగా ! ఈ రహస్యం ఎక్కడ నీకు తెలుస్తుందో, ఎంతగా నన్ను అసహ్యించుకుంటావో అని చాలా భయపడిపోయాను." అన్నాడు మోహన్.

"నా మహాపరాధాన్ని మీరు మన్నించినపుడు, నేను యీ చిన్న..."

గంగ మాట పూర్తిచేసేలోపలే మోహన్ ఠక్కున శయ్యమీంచి లేచి నిలబడి, "నువ్వు చేసిన మహాపరాధమా ? ఏవిటది ?" అని ప్రశ్నించాడు.

గంగ భయంతో వణికిపోతూ, తల వంచుకుని, నేను ముఖాముఖి మీతో చెప్పలేక...ఉత్తరంలో రాసిన విషయం..." అన్నది తడబడుతూ.

"ఉత్తరమా ?" అంటూ మోహన్ ఆశ్చర్యపోయాడు.

"అవును, రాత్రి కిటికీలోంచి మీ మీదపడేలా విసిరాను" అన్నది గంగ. ఆమెకు తాను మహావిపత్తులో పడిపోతున్నట్టుగా తోచింది.

"ఆ ఉత్తరం నేను చూడలేదు. ఏంరాశావందులో ?" అన్నాడు మోహన్, గంగకేసి గుచ్చిగుచ్చి చూస్తూ.

గంగ ఒక్క నిట్టూర్పు విడిచి, గుండె దిటవుచేసుకుని, చుట్టూ ఓ మారు కలయ చూసి, మేజా బల్లదగ్గిరకు పోయి, దాని మీదవున్న పూలకుండీలోకి పరీక్షగా చూసింది. ఉత్తరం ఉండరూపంలోనే పూలరేకుల్లో ఇరుక్కుని ఉండటం ఆమె కంటబడింది. గంగ వణుకుతున్న చేతుల్తో దాన్ని తీయబోయేంతలో మోహన్ గబగబా వచ్చి తీసుకుని, మడతలు విప్పి సరిచేసి చదవసాగాడు.

ఉత్తరం చదువుతూంటే మోహన్‌కు తన స్వప్నసౌధాలన్నీ కూలిపోతున్నట్టు కనిపించింది. ఉత్తరం పూర్తిగా చదివి అతడు గంగకేసి ఉగ్రంగా చూశాడు.

"నా మాట నమ్మండి. ఇందులో నా దోషం ఏమీలేదు. అయినా, యీ సంగతి పెళ్ళికి ముందే మీకు తెలియటం మంచిదని రాశాను. కాని, ఆది దురదృష్టవశాత్తూ..." కంఠం రుద్ధమైపోవటంతో గంగ ఇక మాట్లాడలేకపోయింది.

మోహన్ నేత్రాలు అగ్నిగోళాల్లా మెరిసినై. అతడు గంగమెడలో తాను కట్టిన మంగళసూత్రాన్ని రెండుచేతులతో పట్టుకుని పుటుక్కున తెంపి, విసురుగా గది నుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

గంగ స్తంభితురాలై గదిమధ్య నిలబడిపోయింది. అంతలో రూప తల్లి ఆడసింహంలా గదిలోకి పరుగుపరుగున వచ్చి, గంగ నుదుటిమీదవున్న బొట్టును చెరిపివేసి, జడపట్టుకుని బలంగా లాగి, "ఛీ, పాపిష్టిదానా! నా ఇంటికి నిప్పుపెట్టా లనుకున్నావా? నా బిడ్డ జీవితాన్ని నాశనంచేద్దా మనుకున్నావా? పద...నా ఇంట్లో నుంచి తక్షణం బయటికిపో," అని గర్జించింది.

గంగ ఏదో చెప్పబోయింది గాని, రూప తల్లి వినిపించుకోలేదు. రూప పరిగెత్తు కుంటూ అక్కడికి వచ్చి తల్లితో ఏదో అనబోయింది. కాని ఆమె కూతుర్ని కసిరి కొట్టి, గంగను చేయిపట్టుకుని బయిటికి లాక్కువచ్చి, రెండిళ్ళమధ్య ఉన్న గుమ్మం దగ్గిర కూలదోస్తూ, "నా ఇంటి తలుపులు నీకు మాత్రం ఎప్పుడూ మూసేవుంటాయి." అని, పక్కనే నిలబడివున్న కూతురుతో, "ఈ చెడిపోయినదాన్ని ఎప్పుడైనా ఇంట్లోకి రానిచ్చావా, నీ నెత్తురు చూస్తాను,'' అన్నది పళ్లు కొరుకుతూ.

గంగ కుమిలికుమిలి ఏడుస్తూ వచ్చి తన ఇంట్లోపడింది శరత్, మంజులు హాయిగా నిద్రపోతున్నారు. ఇంత అవమానం జరిగిన తరవాత తను బతికి ఉండటం ఎందుకన్నభావం ఆమె మనసులో తిరిగితిరిగి తల చూపసాగింది. నదిలో పడి తాను ఆత్మహత్య చేసుకోవచ్చు. కాని, తల్లీ తండ్రీలేని యీ పసితమ్ముళ్ళ గతేం అవుతుంది?

గంగ మస్తిష్కంలో ఇలాంటి ఆలోచనలతో పెద్ద కల్లోలం చెలరేగింది. ఆమె ఒకసారి నిద్రిస్తున్న తన తమ్ముళ్ళను సమీపించి, బాధగా ఏదో గొణుక్కుంటూ, వాళ్ళ మంచంపక్కనే కొంచెంసేపు నిలబడి, నీరసంగా నేలమీద పడిపోయి కళ్లు మూసుకున్నది.

* * * *

రెండునెల్లకాలం గడిచిపోయింది. ఊళ్ళోవాళ్ళంతా గంగను కులటగా భావించి గుసగుసలాడుతున్నారు. తల్లి చూడకుండా రూప అప్పుడప్పుడూ వచ్చి గంగతో మాట్లాడిపోతున్నది. అలా ఒకసారి వచ్చినప్పుడు రూప తన పెళ్ళికి మరి పది రోజుల్లో ముహూర్తం పెట్టారని చెప్పి, "సంబంధం తెచ్చింది మోహన్ అన్నయ్యే కదా? లేకపోతే డాక్టరు చదివినాయన నాకు దొరకపోయాడా. కనక పెళ్ళికి మోహన్ అన్నయ్య తప్పకవస్తాడు,'' అన్నది

"నే నిక్కడో దౌర్భాగ్యురాల్ని వున్నాగనక, ఆయన రారు,'' అన్నది గంగ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.




సరిగా గంగ ఊహించినట్టే జరిగింది. రూప పెళ్ళికి మోహన్ రాలేదు. పిన్నికి తాను సెలవుదొరకని కారణంగా రావటంలేదని ఉత్తరంరాశాడు.

పెళ్ళి బహుమానంగా రూపకిచ్చేందుకు గంగ ఒకశాలువా అల్లింది. దాన్ని తన స్నేహితురాలికి ఎలాచేర్చటమో ఆమెకు అంతుచిక్కలేదు. డాక్టర్ జీవన్‌తో రూప వివాహం సక్రమంగా జరిగిపోయింది. గంగ తన తమ్ముళ్ళనుపంపి. రూప ఒంటరిగా ఎక్కడైనా కనబడుతుందేమో చూడమన్నది. అలావచ్చిన గంగ తమ్ముళ్ళతో రూప, గంగను రహస్యంగా ఒకసారివచ్చి తనను కలుసుకోవలసిందిగా చెప్పిపంపింది.

తమ్ముళ్ళు రూప రమ్మన్నసంగతి గంగకు చెప్పారు. గంగ చాలా సేపు వెళ్ళటమా, మానటమా అని ఆలోచించి, చివరకు వెళ్ళటానికే నిశ్చయించుకుని తలదువ్వుకుని, బట్టలు మార్చుకుని, తానుకుట్టిన శాలువాతీసుకుని బయలుదేరింది.

పెళ్ళింట్లో ఎవరి హడావిడిలో వాళ్ళున్నారు. గంగ ఎవరూచూడకుండా రూప వున్న గదికేసివెళ్ళి, గదిలో అడుగు పెట్టబోయేంతలో. రూపతల్లి ఆగు అంటూ అక్కడికివచ్చి "ఏం, పాడుమొహందానా! యీ శుభసమయంలో యిక్కడికివచ్చి పడ్డావేం? నీలాగే నాకూతురు బతుక్కూడా తగలడాలని కోరుకుంటున్నావా? పో యిక్కణ్ణించి!" అని కసిరింది.

గంగ అక్కణ్ణించి వెనుదిరిగి ఇంటికివచ్చింది. హృదయభారం తగ్గేవరకూ మంచంమీదపడి దుఃఖించింది.

ఆ మర్నాడు గంగ నిద్రలేచేసరికి రూపను అత్తవారింటికి పంపేందుకు బోయీలు

పల్లకీని సిద్ధపరిచారు. ఇరుగు పొరుగు స్త్రీలంతా పల్లకీదగ్గిర చేరారు. రూప ముత్తయిదువులు వెంటరా పల్లకీలోఎక్కి కూర్చుని, గంగ ఇంటిగుమ్మంకేసి ఓమారుచూసి తల దించుకున్నది. బోయీలు పల్లకీ ఎత్తుకున్నారు.

గంగకా సమయంలో ఒక ఆలోచన కలిగింది. ఆమె శాలువాతీసుకుని, గ్రామస్తులకళ్ళబడకుండా, పక్కదారులవెంట నడిచి, ఊరుబయట రూప పల్లకీ వెళ్ళే దారిపక్కన ఒకచేలో దాక్కున్నది.

పావుగంట తరవాత రూపఎక్కినపల్లకీ కాలవమీది వంతెనదాటే సమయంలో గంగ చేలోనుంచి బయిటికివచ్చి గబగబా రోడ్డెక్కి పల్లకీ ఆపమని బోయీలకు సైగచేసింది. బోయీలు పల్లకీ ఆపగానే రూప తెరతొలిగించి బయిటికిచూసి, "గంగా!" అన్నది ఆనందాశ్చర్యాలతో.

గంగ తనచేతిలోని శాలువాను రూపకిచ్చేందుకు ముందుకు పోబోయేంతలోరూప పల్లకీదిగివచ్చి ఆమెను కావిలించుకున్నది. ఇద్దరి కళ్ళనుంచీ ఆనందబాష్పాలు రాలాయి. ఇద్దరూ మాట్లాడాలని ప్రయత్నించారుగాని, వెక్కిళ్ళతో అది సాధ్యం కాలేదు.

నాలుగైదు నిమిషాల తర్వాత రూప తనస్నేహితురాలికి సెలవుచెప్పి, శాలువాను భద్రంగా గుండెలకు హత్తుకుని పల్లకీ ఎక్కింది. బోయీలు తిరిగి పల్లకీ నెత్తుకుని బయలుదేరారు. గంగ ఏడుస్తూ పల్లకీ కనుమరుగయేవరకూ వంతెనమీదే నిలబడిపోయింది.

రూప అత్తవారింటికి వెళ్ళటంతో గంగకు గ్రామంలోవున్న ఒక్కగా నొక్క తోడూపోయిన ట్టయింది. ఆమె పొలంపనికి వెళ్ళటం మానేసింది. శరత్, మంజూలు బడి ఎగ్గొట్టి ఎక్కడెక్కడో తిరగసాగారు. అయినా గంగ వాళ్ళ సంగతేమీ పట్టించుకోలేదు. నాలుగైదు రోజులతేడాలో సేఠ్ రెండుసార్లు యింటికి వచ్చి, ఇల్లు వేలం వేయిస్తానని బెదిరించిపోయాడు. గంగకు ఊరుమీద పూర్తిగా విరక్తిపుట్టింది. కాని, ఎక్కడికి వెళ్ళాలి అన్నదే సమస్య.

ఈ పరిస్థితుల్లో గంగకు రూపతల్లిని గురించిన దుఃఖకరమైనవార్త వినవచ్చింది ఆమెకు ఆ మధ్య దృష్టి సరిగా ఆనటంలేదు. ఒకరాత్రివేళ డాబా మెట్లెక్కుతూ కాలుజారి పడటంలో తలకు బాగాదెబ్బతగిలింది. దానితో కళ్ళు రెండూ అసలే కన బడకుండాపోయాయి. గంగ ఓసారివెళ్ళి ఆమెను చూడాలనుకున్నది. కాని...

గంగ ఏమయితే అదవుతుం దనుకుని ఒకసాయంకాలంవేళ రూపతల్లిని చూడ



యు

బోయింది. పట్టింట్లో మంచంమీద పడుకునివున్న దామె. తలకు కట్లుకట్టివున్నాయి. అడుగులచప్పుడు విని, "ఎవరదీ?" అన్నది రూపతల్లి.

గంగ కాస్త భయపడుతూనే, "నేను...నేను...చంపని!" అనేసింది.

రూపతల్లి గంగను దగ్గరకుపిలిచి, "రూప ఉత్తరమేమైనా రాసిందా, నీకు?" అని అడిగింది

"లేదు" అన్నది గంగ చిన్నగొంతుతో.

"నీకు రాయలేదు – నాకూరాయలేదు." అన్నది రూపతల్లి ఆయాసపడుతూ.

ఆమెకు దాహంగావున్నదని గ్రహించి గంగ పక్కనేవున్న పీటమీది మంచినీళ్ళ గ్లాసులోంచి చెంచాతో నీళ్ళుతీసి, ఆమెనోట్లోపోసింది. రూపతల్లి చిన్నగా ఓమారు మూలిగి, "చంపా!" అన్నది.

"ఊఁ"

"నాకు దాహంగావుందని నీవెలా గ్రహించావు."

"నీపెదాలు ఎండిపోతున్నాయి..."

"సాయంత్రం అయిందా, అమ్మాయ్?"

"అఁ, చీకటిపడుతున్నది.. దీపం వెలిగించనా?" అని అడిగింది గంగ.

"కళ్ళల్లో జ్యోతులు ఆరిపోయినవాళ్ళకి దీపం ఏం ఉపయోగమమ్మా?" అంటూ నిట్టూర్చింది రూపతల్లి.

"పొద్దుట్నించీ ఏమైనా తిన్నావా, అత్తా!" అని అడిగింది గంగ.

"లేదమ్మా."

"అయితే పాలు తెస్తానుండు." అంటూ గంగ లేవబోయింది.

రూపతల్లి, ఆప్యాయంగా గంగచేయి పట్టుకుని, "పిచ్చితల్లీ! నీ ఇంట్లోనే లేనప్పుడు, ఎక్కణ్ణించి తెస్తావమ్మా?" అన్నది.

"అత్తా!" అంటూ గంగ వెక్కివెక్కి ఏడ్వసాగింది.

"కళ్ళ వెలుగు పోవచ్చుకాని, మనోదృష్టి ఎక్కడికి పోతుందమ్మా. నా గంగను నేను గుర్తుపట్టలేనా?" అన్నది రూపతల్లి గాద్గదికంగా.

"నన్ను క్షమించు, అత్తా!"

"క్షమాపణ కోరవలసింది నేనమ్మా, దేవుడు నా పాపానికి తగిన శిక్షే విధించాడు నీ కాపరం విడబెట్టినప్పుడే నా పాపాలు పరిహారమవుతాయి," అన్నది రూపతల్లి, కన్నీళ్ళొత్తుకుంటూ.

గంగ మౌనంగా వూరుకున్నది. ఒకటి రెండు నిమిషా లాగి రూపతల్లి:

"మోహన్‌కు వెంటనే రమ్మని వైరిప్పించానమ్మా. వాడు రాకపోతే నేనే నిన్ను తీసుకుపోయి దిగబెట్టి వస్తాను," అన్నది.

గంగ మంచం పక్కనే కాసేపు కూర్చుని, రూపతల్లి మగతగా నిద్రపోవటం గమనించి, ఇంటికి వెళ్ళింది. అక్కడ అరుగుమీద సేఠ్ కూర్చుని వున్నాడు. గంగరావటం చూస్తూనే, "గంగా! ఇవాల్టితో మన పేచీ తీరిపోతుంది." అన్నాడు సంతోషంగా.

"ఏం జరిగింది సేఠ్‌జీ?" అన్నది గంగ.

"కోర్టువారు డిక్రీ యిచ్చారు. ఇప్పుడిహ యీ ఇల్లు నాదే." అన్నాడు సేఠ్.

"ఆఁ," అని మాత్రం అనగలిగింది గంగ. ఆమె ముఖం వివర్ణమైపోయింది.

"వేలం వెయ్యబోయేముందు నీతో ఒక మాట చెప్పిపోదామని వచ్చాను. సర్కారువారి ఆర్డరు ప్రకారం నువ్వు ఇల్లు ఖాళీచేసి పోవటానికి రెండు రోజుల గడువుంది. కాని, బస్సీతో నా స్నేహం మర్చిపోలేదు. అందుకని నీకు మరి నాలుగు రోజులు గడువిస్తాను. సరా?" అన్నాడు సేఠ్.

"ఆ గడువుమాత్రం నన్ను రక్షిస్తుందా? రేపు పొద్దున్నే వచ్చి ఇంటికి తాళం పెట్టుకోవచ్చు." అంటూ గంగ లోపలికి వెళ్ళిపోయింది.

"పొద్దున్నేనా!" అన్నాడు సేఠ్ ఆశ్చర్యంగా.

"అవును, నే నీ రాత్రే యిల్లు ఖాళీచేసి పోతున్నాను," అన్నది గంగ దృఢంగా.

"ఎక్కడికి పోతావు?"

"ఆ ప్రశ్నకూడా జవాబు చెప్పాలని సర్కారువారి ఆర్డర్లో వుందా?" అనడిగింది గంగ కాస్త కోపంగా.

సేఠ్ ఆమె ముఖం కేసి ఓ క్షణకాలం చూసి, ఏమనుకున్నాడో ఏమో మరి మాట్లాడకుండా వీధి కేసి నడిచాడు.

## 6

కుండపోతగా వర్షం కురుస్తున్నది. ఆకాశంలో మేఘాలు ప్రళయ భయంకరంగా గర్జిస్తున్నవి. వీటికితోడు రివ్వుమంటూ వీచేగాలి. గంగ పట్నానికి వెళ్లేదారిలో ఊరిబయట పాడుబడ్డ ఒక దేవాలయంలో కూర్చుని వున్నది. శరత్ విపరీతమైన జ్వరంతో మూలుగుతున్నాడు. మంజూ అన్నపక్కనే కూర్చుని చలికి వణుకుతున్నాడు. ముగ్గురూ వానలో బాగా తడిసి ఆ గుడి చేరారు.

అంత గాఢాంధకారంలోకూడా పట్నానికి వెళ్ళేరోడ్డు మసకమసగ్గా కనిపి



స్తున్నది. గంగ ఆ రోడ్డుకేసే చూస్తున్నది. ఎవరైనా అటు వచ్చేవాళ్ళు తనకు సాయపడి పట్నం చేరుస్తారేమో అని ఆమె ఆశ.

అకస్మాత్తుగా ఒక కారు గుడిముందుకొచ్చి ఆగింది. కార్లోనుంచి యిద్దరు వ్యక్తులు దిగి గుడి చూరుకిందికి పరుగెత్తుకుంటూ వచ్చారు. ఇద్దరూ ఊగిసలాడుతూ తడబడుతూ మాట్లాడుకోసాగారు. ఒకడు జేబులోంచి సారాసీసా తీసి గడగడ తాగసాగాడు. రెండోవాడుకూడా జేబులోంచి సారాసీసా తీస్తూ, "ఒరేయ్, యీ పాడుబడ్డ గుళ్ళో ఎవరో మనుషులున్నట్టుందిరోయ్, ఆడవాసన!" అన్నాడు.

ఆ మాట వింటూనే గంగ వణికిపోయి, ఊపిరి బిగబట్టి గోడచీకట్లోకి మరి కాస్త జరిగి కూర్చున్నది.

"ఏడ్చావ్‌లే, ఆడవాసనా లేదూ, నీ ముఖం లేదు. అంతా సారావాసనే!" అంటూ మొదటివాడు తాగిన సీసాను గుడిలోపలికి విసిరాడు. అది గంగకు దాపుల వచ్చిపడి ముక్కలై పోయింది. తరవాత మొదటివాడు రెండో తాగుబోతు భుజం పట్టుకుని కారుదగ్గరకు లాక్కుపోయాడు. ఒకటి రెండు నిమిషాల్లో కారు పెద్ద శబ్దం చేస్తూ, పట్నం కేసి వెళ్ళిపోయింది.

శరత్ జ్వరంతో పలవరించసాగాడు. ఏ విధంగానైనా పట్నం చేరకపోతే శరత్ తనకు దక్కడన్న భయం గంగను పట్టిపీడించసాగింది ఆ స్థితిలో ఒక గుర్రబ్బండీ పట్నంకేసి పోతూ రోడ్డంట వేగంగా వస్తున్నది. గంగ ఏమైతే అదవుతుందనుకుంటూ, బండివచ్చే దారికి అడ్డంగా నిలబడి చేతులూపింది బండి ఆగిపోయింది.

"నాతమ్ముడు చావుబతుకుల్లో వున్నాడు. దయవుంచి మమ్మల్ని పట్నంలో ఏదైనా ఆస్పత్రికి చేర్చండి. నాకు యిల్లూవాకిలీ లేదు. దిక్కులేనిదాన్ని...యిక్కడ చిక్కుబడిపోయాను," అన్నది గంగ, బండిలోనివ్యక్తిని వుద్దేశించి.

బండిలోనుంచి ఒక యువకుడు కిందికిదిగాడు. అతడు గంగకేసి ఓమారుచూసి, ఆమె వెనకనేపోయి బండివాడి సాయంతో శరత్‌నీ, మంజూనీ బండిలోకితెచ్చి దించాడు. తరవాత గంగని ఎక్కమన్నాడు. అందరికన్న వెనక తానెక్కి కూచుంటూ, "రామూ, బండి త్వరగాపోనీ ఇంటికి," అన్నాడు బండివాడితో.

"ఇంటికా?" అంటూ గంగ అదిరిపోయింది.

ఆమె ప్రశ్నలోనిభయాన్ని గమనించిన యువకుడు, "భయపడకు, నేను డాక్టర్ని. ఇప్పుడే ఒక పేషంటునుచూచి ఇంటికిపోతున్నాను," అన్నాడు.

అరగంట తరవాత బండి పట్నానికి కొంచెం వెలపలగావున్న ఒక పెద్ద ఇంటిముందుకొచ్చి ఆగింది. శరత్‌ని భుజానికెత్తుకుని డాక్టర్ ఇంటికేసి నడిచాడు. మంజూను వెంటబెట్టుకుని గంగ ఆతణ్ణనుసరించింది.

డాక్టర్ ఒకపెద్ద గదిలోకివెళ్ళి లైటువేశాడు. గంగ గుమ్మందగ్గిరే ఆగిపోయింది. చక్కగా అలంకరించివున్న ఆపెద్దగది చూస్తూంటే గంగకు ప్రతాపుడి మేడమీదిగది గుర్తుకొచ్చింది. గంగ వాకిలిదగ్గిరే ఆగిపోవటంచూసి డాక్టరు, "భయం ఎందుకు, లోపలికిరా. నా హాస్పిటల్‌కూడా యిదే నేనిప్పుడే వస్తాను," అంటూ శరత్‌ని ఒక బెడ్‌మీద పడుకోబెట్టి పక్కగదిలోకి వెళ్ళాడు.

డాక్టర్ వెళ్ళినగదిలో చిన్నలైటు వెలుగుతున్నది. అతడు చిన్నగొంతుతో, "రూపా! నిద్రపోతున్నావా?" అని పిలిచాడు.

భర్తపిలుపు వింటూనే రూప కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్నది. డాక్టర్ ఆమెతో, "నేనొక్కక్షణ్ణోరాలేదు. ఎవరో బీదపిల్ల-పాపం చాలా కష్టాల్లోవుంది. వెంట యిద్దరు చిన్నపిల్లలున్నారు. వాళ్ళల్లో ఒకడికి విపరీతమైనజ్వరం," అన్నాడు.

"అలాగా," అన్నదిరూప మంచం దిగుతూ

"నేను ఆకుర్రాణ్ణి పరీక్షచేస్తాను నువ్వీలోపల కాసిని వేన్నీళ్ళుపెట్టు" అని డాక్టరు భార్యకుచెప్పి, తిరిగి గంగవున్న గదిలోకి వచ్చాడు.

రూప నీళ్ళుకాచి, వాటిని తీసుకుని పెద్దగదిలోకి వచ్చింది అక్కడికి వస్తూనే ఆమెపొందిన ఆశ్చర్యం అంతా యింతాకాదు. భర్తచెప్పిన అభాగ్యురాలు మరెవరో కాదు, గంగ! రూప వేడినీళ్ళపాత్రను బల్లమీదవుంచి ఒక్కవుదుటున వచ్చి గంగను కౌగిలించుకున్నది. ఆ తరువాత భర్తకేసి తిరిగి, "శరత్ కేమైనా విష జ్వరమా?" అని అడిగింది.

"ఊహుం, అదేం కాదు" అని తలూపి డాక్టర్ జీవన్ శరత్‌కు ఒక ఇంజక్షన్ యిచ్చి, గంగకు ధైర్యం చెప్పి లోపలికి వెళ్ళాడు. ఆ తరువాత రూపా గంగలు తెల్లవారేదాకా ఆ గదిలోనే కూర్చుని అనేక సంగతులు మాట్లాడుకున్నారు. తెల్లవారే వేళకు శరత్‌కు జ్వరం పూర్తిగా తగ్గిపోయింది.

డాక్టర్ జీవన్ మరోసారి గదిలోకివచ్చి శరత్‌ను పరీక్షించి తృప్తిగా తల వూపాడు. అప్పుడు రూప భర్తతో, "మేం తెల్లవార్లూ కబుర్లు చెప్పుకుంటూనే వున్నాం. ఇద్దరం ప్రాణసఖులం గదా. కాని, ఒక్క విషయంలో గంగను నా మాట వినేలా చేయలేకపోతున్నాను. ఎక్కడికో వెళ్ళిపోతుందట" అని చెప్పింది.

"మీరు ఎక్కడికైనా వెళ్ళదలిస్తే ఆపే అధికారం నాకు లేనిమాట నిజమే. కాని, శరత్‌ని యీ స్థితిలో యిక్కణ్ణించి తీసుకుపోవటం మాత్రం మంచిదికాదు," అన్నాడు డాక్టర్ జీవన్.

"అదికా దన్నగారూ..." అంటూ గంగ ఏదో చెప్పబోయింది.

"మీ రేమైనా చెప్పండి. కాని, డాక్టర్‌గా నా సలహా-శరత్‌ని యిక్కణ్ణించి కదిలించటం క్షేమం కాదని!" అంటూ జీవన్ బయిటికి వెళ్ళిపోయాడు.

* * *

డాక్టర్ జీవన్ ఆఫీసులో ప్రవేశించే సరికి మోహన్ ఫైళ్ళేవో తిరగవేస్తున్నాడు. జీవన్ రావటం చూసి, "రా కూర్చో. ఏవిటీ విశేషాలు?" అన్నాడు.

"విశేషా లేమీ లేవు. నిన్ను చూద్దామని వచ్చాను," అన్నాడు జీవన్.

"మంచిపని చేశావ్. నేనే రావాలనుకుంటున్నాను," అంటూ నవ్వాడు మోహన్.

"తప్పకుండా రా. మంగళవారం రాఖీ పండగ ఆదివారం వస్తే నాలుగురోజు లుండిపోవచ్చు," అన్నాడు జీవన్.

"ఆదివారం బహుశా వూరి కెళ్ళవలసిరావచ్చు మా పిన్నిని తీసుకురావాలని వుంది. ఆమె కక్కడ చేసేవాళ్ళెవరూలేరు," అన్నాడు మోహన్.

"ఎవరూ లేకేం? ఆమె కోడలు గంగ వుందిగా?"

గంగపేరు వినగానే మోహన్ ముఖం చిట్లించుకున్నాడు. అది చూసిన జీవన్ "ఎవడో దుర్మార్గుడి అత్యాచారానికి బలయినదాన్ని, వదలిపెట్టటంలో న్యాయం వున్నదంటావా, మోహన్?'' అనడిగాడు.

మోహన్ జవాబు చెప్పబోయి, అంతలోనే ఆగి ఏదో ఆలోచించసాగాడు. జీవన్ కాసేపాగి, "యిక్కడో పేషంటును చూడటానికి వచ్చాను, యికపోవాలి. రాఖీనాటికి రావటం మర్చిపోకు,'' అంటూ లేచి బయిటికి వచ్చేశాడు.

ఇంటికి రాగానే రూప భర్తను మోహన్ సంగతి అడిగి, "గంగ విషయం మాట్లాడారా?" అని ప్రశ్నించింది.

''మాట్లాడాను. ఎటూ చెప్పకుండా వూరుకున్నాడు. బహుశా, రాఖీ పండగ నాటికి వస్తాడు. గంగకూడా యిక్కడే వుంటుంది గనక, వ్యవహారం తేల్చేద్దాం," అన్నాడు జీవన్.

భార్యాభర్తల సంభాషణ పక్కగదిలోవున్న గంగకు వినిపించింది. ఆమెకు జీవన్‌మీద ఎంతో కృతజ్ఞతాభావం కలిగింది వాళ్ళిద్దరూ అనుకున్నట్టు తన భర్తలో మార్పు వస్తుందన్న నమ్మకం ఆమె కేకోశానాలేదు. రాఖీనాడు ఆయన వస్తే, ఎదటపడటంకూడా ఆమెకు ఎంతో లజ్జాకరంగా కనిపించింది. అట్లని తమ్ముళ్ళని తీసుకుని యీ లోపలే ఎక్కడైనా పోయేందుకు లేదు. రూపా, ఆమె భర్తకూడా యిక్కడే వుండిపొమ్మని ఎంతో బలవంతం చేస్తున్నారు.

ఎంతో ఆలోచించిన మీదట గంగకు ఒక మంచి ఉపాయం తోచింది. జీవన్ ఇంట పనిచేసే పనిమనిషి తమ్ముడు పట్నం బయట కట్టే సిమెంట్ ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడు. అతడిద్వారా అక్కడేదైనా పని సంపాయించుకుంటే తనకు రూపావాళ్ళమీద ఆధారపడిబతికే అవస్థ తప్పుతుంది...

వారం తరవాత రాఖీపండుగ రానేవచ్చింది. కొంచెం పొద్దెక్కాక మోహన్ వచ్చాడు రూప అతణ్ణి "అన్నయ్యా!" అంటూ కావిలించుకుని, ముంజేతికి రాఖీ కట్టి కుర్చీలో కూర్చోబెట్టి మిఠాయి తినిపించింది.




మోహన్ జేబులోంచి పర్సు తీసి రూపకేసి చేయి చాచాడు. రూప పర్సులో వున్న నోట్ల వేపూ, అన్న ముఖం కేసీ చూస్తూ చిరునవ్వు నవ్వింది.

"చూస్తావేం? నీ క్కావలసినంత తీసుకో," అన్నాడు మోహన్. రూప ఊహూఁ అంటూ తల అడ్డంగా తిప్పింది.

"డబ్బొద్దా? అయితే నగలా...సరే. ఏం కావాలో కోరుకో," అన్నాడు మోహన్.

"కోరటాని కేం? మాట పోతుందేమో అని భయం," అన్నది రూప.

"నే నెన్నడైనా మాట యిచ్చి తప్పానా?" అన్నాడు మోహన్ చిరుకోపంగా.

"అయితే, గంగని స్వీకరించన్నయ్యా," అన్నది రూప.

మోహన్ కళవెళ పడ్డాడు. ఏమీ సమాధానం చెప్పకుండా చెల్లెలి కేసి చూస్తూ వూరుకున్నాడు. రూప కన్నీళ్ళు తుడుచుకుంటూ, "అయితే గంగని ఏలుకోవా, అన్నయ్యా?" అని అడిగింది.

"ఏలుకోమనేనా నీ కోరిక?"

"అవును, రాఖీ పండగనాడు నీ చెల్లెలు కోరేది అదే," అన్నది రూప.

"నువ్వీ కోర్కె కోరతావని నాకు తెలుసు," అంటూ చిన్నగానవ్వాడు మోహన్.

"అంటే?"

"అంటే మరేం లేదు. నేను నీ కోర్కె తీరుద్దామనే వచ్చాను. కాని, గంగ ఆ వూళ్లో లేదు. ఎక్కడికో వెళ్ళిపోయింది," అన్నాడు మోహన్ కటువుగా.

"గంగ మా ఇంటనే వున్నది. పిలుచుకొస్తానుండు." అంటూ రూప మేడ మీదికి పరిగెత్తింది. అంతలో డిస్పెన్సరీనుంచి గదిలోకి వచ్చిన డాక్టర్ జీవన్, మోహన్‌నుచూసి కుశల ప్రశ్నలు వేశాడు.

కొద్దిసేపు తరవాత రూప, మోహన్‌దగ్గరకు వచ్చి, "గంగ యింట్లో లేదు, ఎటో వెళ్ళింది." అని చెప్పింది.

"ఎక్కడికి వెళ్ళిందో తెలియదా?" అనడిగాడు జీవన్.

"పనికోసం...పని మనిషి కొడుకువెంట పోయిందట."

"అయితే, సిమెంటు ఫ్యాక్టరీ కట్టుతున్న మంగళాపురం వెళ్ళి వుంటుంది," అన్నాడు జీవన్.

"మంగళాపురమా? అది నది అవతలివొడ్డు నున్నదేనా?" అన్నాడు మోహన్.

"అవును పద వెళ్దాం."

"వద్దు, జీవన్. నేనొక్కడినే వెళతాను," అంటూ కుర్చీలోంచి లేచాడు మోహన్.

"గంగ ఏదైనా పేచీ పెడుతుందేమో అన్నయ్యా, రావటానికి," అన్నది రూప.

"ఫర్వాలేదమ్మా. ఆమె గుండె రాయిచేసుకున్నాసరే. నేను కరిగించగలను," అన్నాడు మోహన్ గంభీరంగా.

# 7

మంగళాపురం పక్కన, నదికి దాపుల్లో పెద్ద సిమెంట్‌ఫ్యాక్టరీ ఒకటి కడుతున్నారు. అక్కడ వందలమంది కూలీలు చెమటోడ్చి పనిచేస్తున్నారు. ఒక్కపక్కగా రాళ్ళను పగలగొట్టే పెద్దపెద్ద యంత్రాలు పనిచేస్తున్నాయి. వాటి మోతతో ఆ కొండ ప్రాంతమంతా దద్దరిల్లిపోతున్నది. ఆ సమీపంలోనే ఒక గుట్టమీద నిర్మించబడ్డ మేడమీది బాల్కనీలో నిలబడి, ఆ చుట్టుపక్కల జరుగుతున్న పని పాటల్ని సగర్వంగా చూస్తున్నాడు ప్రతాపసింహుడు. లక్షల ఖర్చుతో తయారవుతున్న ఆ సిమెంటుఫ్యాక్టరీకి అతడే యజమాని.

పనికోసం వచ్చి కింద నిలబడివున్న స్త్రీలలో ఒకామెనుచూసి ప్రతాపుడు నిర్విణ్ణుడయాడు. ఆమె అతడికి బాగా తెలుసు-గంగ. ఆమెను చూడగానే అతడి రక్తం ఉడుకులెత్తిపోసాగింది, వాంఛ పరుగులు ప్రారంభించింది. అతడొక చీటీరాసి, కూలీలను తీసుకుంటున్న, గుమాస్తాకి పంపాడు.

కళ్ళజోడు సరిదిద్దుకుంటూ, యజమాని పంపిన చీటీ చదివి గుమాస్తా, వరసలో

నిలబడ్డ గంగను పిలిచాడు. ఆమె రాగానే ఎగాదిగా చూసి, "నీ పేరు ?' అని ప్రశ్నించాడు.

"గంగ''

"ఊరు ?"

"చందనపురం.''

"వయస్సెంత ?"

''పద్దెనిమిది,'' అంటూ గంగ, గుమాస్తా కేసి ఉరిమి చూసింది. అతడికి వయసుతో ఏం పనో ఆమె కర్థంకాలేదు. గుమాస్తా తానడిగి తెలుసుకున్న వివరాలన్నీ రాసిన కాయితాన్ని గంగచేతికిచ్చి, "పైన బాబుగారున్నారు. పోయి వారి సంతకము చేయించుకో," అని చెప్పాడు.

గంగ సంతోషంగా మేడపైకి వెళ్ళింది. అక్కడ గదిలో అడుగుపెడుతూనే, లోపలవున్న వ్యక్తిని చూసి స్తంభితురాలై పోయింది. తన జీవితాన్ని సర్వనాశనం చేసిన కిరాతకుడు, తండ్రి ప్రాణాలుతీసిన హంతకుడు అక్కడున్నాడు. గంగ గిరుక్కున వెనుదిరగబోయింది.

"ఏం, పనొద్దా ?" అన్నాడు ప్రతాపుడు.

గంగ ఆగి నిశితంగా అతడి ముఖం కేసి చూస్తూ. "పని యిస్తావా ?" అని అడిగింది నిర్భయంగా.

"యిస్తాను. అందరికీ రెండు రూపాయిలకూలీ, నీకు మూడు రూపాయిలు.''

"అంతేనా తేడా ?''

"అయితే, నాలుగు రూపాయిలిస్తాను, కాని ఒక షరతు," అన్నాడు ప్రతాపుడు.

''ఆ షరతేమిటి ?" అంటూ గంగ అతడికి దగ్గరగా వెళ్ళింది.

''నువ్విలాంటి వేడిచూపుల్తోనే మమ్మల్ని అప్పుడప్పుడూ చూస్తూండాలి.''

"ఊరికే చూ స్తే సరిపోతుందా ?"

"ఇప్పటికి దారి మార్గాన పడినట్టున్నావ్. నువ్వు మా మీద దయచూపుతే చాలు. నాలుగు నలభై చేసుకోగలవు,'' అన్నాడు ప్రతాపుడు మీసాలు మెలితిప్పుకుంటూ.

గంగ పిచ్చిదానిలా పెద్దగానవ్వి, "తండ్రికి జబ్బుచేస్తే అయిదు రూపాయిల కోసం నానా అవస్థా పడ్డాను. ఇప్పుడు అడక్కుండానే కావలసినంత డబ్బు నా కాళ్ళదగ్గిర కొస్తున్నది. మాసిపోయిన యీ శరీరానికి విలువ బాగా పెరిగిందన్న మాట !" అన్నది.

"అలా కాదు గంగా. నీ శరీరం యిప్పుడు మరింత అందంగా వుంది. ఆనాడు నీలో యింత విందుదనం, మెరుపూ లేదు...యిం..."

గంగ పెద్దగా గర్జిస్తున్నట్టు అరిచి, "అవును, ఆనాడు నేను అభమూ, శుభమూ తెలియని అమాయకురాలిని. నన్ను నీ పశువాంఛకు బలిగొన్నావు. నీచుడా!" అంటూ ఓ క్షణం ఆగింది. ఆమె కళ్ళవెంట నిప్పులు రాలుతున్నాయి. ఆమెలో కలిగిన యీ హఠాత్ పరిణామానికి ప్రతాపుడు కలవరపడ్డాడు.

గంగ పళ్ళుకొరుకుతూ, ప్రతాపుణ్ణి మరింతగా సమీపించి, "అప్పుడూ ఇలాంటి గదే! మవ్వూ నేనూ ఏకాంతంగా.. యిప్పుడూ, అంతే. కాని, నేను ఆ వెనుకటి గంగనుకాను. అంత అమాయకురాలిని కాను రా, యిప్పుడు నా ఒంటిమీద చెయ్యి వేసి చూడు! నీలో ధైర్యం వుంటే, రా! దుర్మార్గుడా! నీచుడా!" అంటూ హుంకరించింది.

ప్రతాపుడు గాభరా పడిపోతూ అటూ యిటూ చూడసాగాడు. చండీరూపం ధరించి సింహగర్జన చేస్తూ ఎదటనిలబడిన గంగను చూస్తుంటే అతడికి ప్రాణభయం పట్టుకున్నది. ముచ్చెమటలు పోయసాగాయి. అక్కణ్ణించి తప్పించుకుపోయే వుపాయం వెదకసాగాడు.

గంగ అతణ్ణి కవ్విస్తూ, "అలా వెర్రిముఖం వేసుకు చూస్తావేం? రా నన్ను తాకిచూడు. ఛండాలుడా, కుక్కా! నీ కెవరిప్పుడు దిక్కు?" అన్నది

ప్రతాపుడు గజగజ వణకసాగాడు. ఎనుబోతులా బలిసిన నిలువెత్తు మనిషి ఒక పల్లెటూరి పిల్లముందు భయంతో కంపించిపోతున్నాడు.

గంగ మరోఅడుగు ముందుకువేసి, అతడి ముఖాన తుపుక్కున ఉమ్మి "పిరికి పందా! దుర్మార్గుడా!" అంటూ తిట్టసాగింది.

ప్రతాపుడు హుమ్మంటూ ఎగిరిలేచి గంగమీద విరుచుకుపడ్డాడు. గంగకు ఆసమయంలో అంతబలం ఎక్కణ్ణించి వచ్చిందో చెప్పలేం. ఆమె ఒక్క వూపుతో అతడిపట్టు వదిలించుకుని, గోడపక్కనే పడవేసివున్న యినపకడ్డీలో ఒకటి తీసుకుని, అతడితలకు గురిపెట్టి విసిరింది. ప్రతాప్ చప్పున తల పక్కకు తిప్పుకున్నాడు. కాని ఇనపకడ్డీ అతడిభుజాన్ని బలంగాతాకింది.

ప్రతాపుడు బాధతో అబ్బాఅని అరిచి గదిలోంచి బాల్కనీలోకి పరిగెత్తాడు, గంగ అతణ్ణి వెంబడించి ఇనపకడ్డీని అతడిమీదికి విసిరింది. ప్రతాపుడు దాన్నుంచి



తప్పించుకోబోయి, ఆకంగారులో పిట్టగోడమీంచి దభీమంటూ, కింద రాళ్ళు పగల కొడుతున్న యంత్రంమీద పడిపోయాడు. అతడి చావుకేక యంత్రపుఘోరొదలో కలిసి పోయింది.

గంగ పిట్టగోడదగ్గిరకువచ్చి కిందికిచూసింది. రక్తసిక్తమై పడివున్న గ్రేతపుడి రాక్షసదేహం కనబడగానే ఆమెకు పైత్యప్రకోపం కలిగినట్టయి, కళ్ళు బైర్లు తిరిగాయి. ఆమె తూలి పడబోయేలోగా మోహన్ అక్కడికివచ్చి, పడకుండా పట్టుకున్నాడు.

కొంతసేపటికి స్పృహవచ్చి గంగ తాను మోహన్ ఒడిలో ఉన్నానని తెలుసుకుని అదికలా నిజమా అన్నట్టు భర్తముఖంకేసి ఆశ్చర్యంగా చూసింది.

"అలాచూస్తావేం గంగా! నేను నీమోహన్‌ని!" అన్నాడు మోహన్.

గంగ అతడి ఒడిలోంచి లేచివెళ్ళబోయింది. మోహన్ చటుక్కున ఆమె చేయిపట్టుకుని, "ఎక్కడికి!" అన్నాడు.

"చావటానికి! యింక నేనెవరికోసం బతకాలి?" అన్నది గంగ.

"గంగా! నన్నింకా బాధపెట్టకు. నాకోసం నువ్వుబతకాలి-నాకోసం!" అన్నాడు మోహన్ ప్రాధేయపడుతూన్నట్టు.

"మీకర్పించేందుకు నాలో ఏంమిగిలివుంది ?" అన్నది గంగ రెట్టిస్తున్నట్టు.

"ప్రేమ..."

"ప్రేమా ?" అన్నది గంగ; ఆమాట అర్థాన్నే మరిచినపోయిదానిలా.

"అవును, గంగా ! నాప్రేమ నీచేతికి నేను తొడిగిన మట్టిగాజుల లాటిది. వాటిలాగే అది బలహీనమైనది. వూరికే ముక్కలైపోయింది. కాని, యిప్పుడు, గంగా నాకు నీరక్తంలో కలిసివున్న పవిత్రప్రేమ కావాలి. దానితో నా వ్యర్థజీవితానికి ఓఅర్థం, ప్రయోజనం కలిగించు," అన్నాడు మోహన్ గాద్గదికంగా.

గంగ నేత్రాల్లో నీరు కదిలింది. మోహన్ ఆమెను తన హృదయానికి హత్తుకుంటూ. "నన్ను క్షమిస్తావుకాదూ, చెప్పుగంగా ?" అన్నాడు.

గంగ జవాబుచెప్పకుండా అతడి గుండెల్లో ముఖం దాచుకున్నది. 




ఆదివారం-రాత్రి.

గడియారం వరసగా పదీ, పదకొండూ, పన్నెండూ కొట్టడం లెక్క పెడుతూ విన్నాను, వింటూనే లెక్క పెట్టాను.

ఒంటిగంటమటుకు ఎప్పుడుకొట్టిందో తెలీలేదు.

ఆ సాయంకాలం, అప్పుడప్పుడే చీకట్లు కమ్ముతున్న సంధ్యాసమయంలో, విద్యుద్దీపాలతో తళుక్కుమని మెరిసిపోయే బజారు వీధుల్లోకి బయల్దేరుదామనుకుంటూండగా, తీరిగ్గా, సోఫాలో, జేరబడిఉన్న అన్నయ్య, వెర్రి ప్రశ్న వేశాడు.

"బజారుకేనా?" అని. నేను మౌనం వహించాను. తిరిగి అన్నయ్యే అన్నాడు. "ఒక్కనిమిషం కూచోరా, నీతో మాట్లాడాలి."

నేను కూర్చోవడానికి తటపటాయించాను. అన్నయ్య సోది మొదలెడతాడు. దేశ ఆర్థిక పరిస్థితి, కుటుంబ ఆర్థిక పరిస్థితి; పొదుపు; మొరార్జీని తప్పుకో

మని, అన్నయ్యను ఆర్థికమంత్రిగా చేస్తే ఎంత బాగుండుననూ అనిపిస్తుంది. తమలపాకులు నములుతూ, ఉపన్యాస ధోరణిలో అందమయిన సాయంకాలాలను హతమార్చడం అన్నయ్యకు పరిపాటే. ఈ సాయంకాలపు అందాల్ని అనుభవించి తీరాలి. అన్నయ్యబారి నుంచి తప్పించుకోవాలి. పనుందని అబద్ధం చెప్పి జారుకుందామనుకున్నాను. అన్నయ్య సర్వజ్ఞుడు. ఆదివారాల్లో, అందముందనీ, అందాలను సాయంకాలాలు పూసుకుంటాయనీ, నాకూ తెలిసిందంటే దానిక్కారణం అన్నయ్యే.

అయిదేళ్ళ క్రిందట అన్నయ్యకోసం ఆదివారాలు అందాలవి పూసుకున్నాయి. సూర్యుడి కిరణాలకు బంగారు వెలుగుల్నీ, చంద్రుడి కిరణాలకు వెండి వెలుగుల్నీ, ఆకాశంలో చుక్కలకి జిలుగు వెలుగుల్నీ, మావదినే ప్రసాదిస్తుందని అన్నయ్య అభిప్రాయం. సాయంకాలపు అందాలు చీకట్లో చెరిగిపోకముందే, అన్నయ్య బయలుదేరేవాడు వదినకోసం. అప్పటికింకా, వదిన పూర్తిగా మాకు వదినకాలేదులెండి.

నాలో చెలరేగుతున్న భావవైపరీత్యం గ్రహించింది కాబోలు "ఓనిమిషం కూర్చో మరదీ! నీగురించే మాట్లాడుతున్నాం" అంది వదిన తమలపాకులు చుడుతూ. నాగురించి వీళ్ళేం మాట్లాడుకుంటున్నారో నాకుతెలుసు. నన్ను రోజూ ఓమారు... పెళ్ళికొడుకును చేస్తారు. అరడజను అమ్మాయిల్ని, వాళ్ళ అత్యుత్తమ సౌందర్యాది గుణగణాలను, అద్భుతంగా, వాళ్ళిచ్చే కట్నాలరేటు ప్రకారం వర్ణించిచెప్పి, వీళ్ళలో ఎవర్నో ఒకర్ని పెళ్ళాంగాచేసుకుని, ఆదివారాలనీ, సాయంకాలాల్నీ అందంగాఇంట్లోనే భద్రపరుచుకోవోయ్ అని 'గీ' పెడతారు. వీళ్ళల్లో నాకెవరూ నచ్చరు. నాకు నచ్చిన వాళ్ళని మాత్రమే చూపించమనడం సాధ్య మెలాగవుతుంది.

"డబ్బుకొద్దీ దాణ్యం. రేటెక్కడ ఎక్కువుంటే ఆ అమ్మాయికే మొగుడవయిపో మరిదీ!" అంటుంది దమ్మిడీ కట్నంలేకుండా సాయంకాలాల్లో అందాల్ని చూపించి ఆదర్శంగా పెళ్ళి చేసుకున్న వదిన, నర్మగర్భంగా.

వీళ్ళు నన్ను మరీ అమాయకుడ్ని చేసి వేళాకోళం చేస్తున్నారేమో ననిపిస్తుంది. వీళ్ళకు మరీ చులకనయి పోకూడదు. నేమాత్రం తక్కువ తిన్నానా? నేనూ ప్రేమించే పెళ్ళిచేసుకుంటాను. అమాటకొస్తే చాలాభాగం అప్పుడే ప్రేమించేసేసాను కూడానూ! నన్ను కూడా ప్రేమించేస్తూనే ఉంది ఉండాలి విజయ ఈపాటికి. నాలో కరువయిందేమిటని? కాకపోతే, సూటిగా విజయవేపు చూడలేనంతే! భయంచేతకాదు. ఇంకా నాలో సభ్యత చావలేదు ప్రేమ గౌరవమయిందనీ, గౌరవంగా ప్రేమించాలనీ,

నా అభిప్రాయం.. అంతేకాని "నిన్ను ప్రేమించేస్తున్నాను విజ్జీ" అని ఏబస్సు క్యూలోనో, గుళ్ళో క్యూలోనో అనేసి, "సారీ బ్రదర్" అనిపించుకొని ప్రేమ నగౌరవపరచడం ఏం బాగుంటుందని.

"కూర్చోరా" రెట్టించాడన్నయ్య.

"లేదన్నయ్యా. ఇప్పట్లో నా పెళ్ళి గురించి త్వరపడకండి."

"పెళ్ళివిషయం కాదురా, నువ్వునన్ను చెప్పనియ్యవేం. ముందు కూర్చో."

అసలు విషయమేమిటో అర్థమవడం లేదు. సోఫాలో చేరగిలబడి తన్మయంగా జర్దాపాన్ నములుతూ అన్నయ్యదిగాడు.

"మా సెక్షనులో పనిచేసే విజయ నీకు తెలుసా?"

"తెలుసు"

"ఎలా తెలుసు?"

అసలు తెలీదు.

"అంటే, చూళ్ళేదా మాటాడ్లేదా" అన్నయ్య నవ్వుతున్నాడు

"మీ సెక్షనులో పనిచేస్తుందనే తెలుసు, అంతేకాని ఆవిడ నాకేమంత బాగా తెలీదు." ఇబ్బందిగా ఉంది పరిస్థితి.

"పోనీ, ఆవిడగురించి నీ అభిప్రాయం"

"నాకా అభిప్రాయం! నాకెందుకూ..." తడబడ్డాను. మొహమాట పడ్డాను. నిజ మొప్పుకోలేని పిరికితన మేదో నన్నావహిస్తోంది. విజయగురించి, నాక్కాక పోతే, మరెవడి కుంటుంది అభిప్రాయం. విజ్జీనాది. నేనెంత గౌరవంగా ప్రేమిస్తున్నానవీ...

"ఇవాళ విజయ మనింటికొస్తోంది" చల్లగా అనేసి కొంటెగా నవ్వుతోంది వదిన నన్ను వేళాకోళం పట్టిస్తూ. విస్మయంగా అన్నయ్యవేపు చూశాను.

"అవున్రా. ఆశ్చర్య పోతావేం. మొన్న వాళ్ళింట్లో పార్టీ ఏర్పాటు చేసింది మొదటి 'సాలరీ'గా తీసుకుంది; అందుకూ; అప్పుడందిలే మీ శ్రీమతి నెప్పుడు చూపిస్తారూ అని; ఉత్తినే అన్నా, ఆదివారం సాయంకాలం మా ఇంటికిరండి మా శ్రీమతిని చూసినట్టూ వుంటుంది; మా ఆతిథ్యం పొందినట్టూ ఉంటుందని. వెంటనే ఒప్పేసుకుంది."

"నిజంగానా!" ఆశ్చర్యం, ఆనందం, సందేహం, మెదళ్ళో గందరగోళం, ప్రారంభమయింది. వెర్రిగా జుత్తు పీక్కున్నాను. వదిన టాపులేచిపోయేలా నవ్వుతోంది. నోట్లోని తాంబూలం క్రింద పడకుండా అవస్థ పడుతూ, అన్నయ్యా నవ్వుతున్నాడు

పీళ్ళ వేళాకోళం భరించలేక పోతున్నాను నన్ను పసివాడికింద జమ కట్టేసి అమాయకుడ్నిచేసి ఏడిపిస్తున్నారు. నాలో ఉక్రోషం పెల్లుబుకుతున్నది.

"మీరిచ్చే టీడికాఫీకోసం విజయ మనింటికేంరాదు. మీరు నన్నుడికించటం కోసం, అంటున్నారంతే" విసురుగా అనేశాను.

"నువ్వుతుక్కోవడం దేనికోయ్. ఏం, నువ్వేమన్నా విజయని ప్రేమిస్తున్నావా ?" అన్నయ్య విపరీతంగా నవ్వుతున్నాడు.

"ఏం ? ప్రేమించకూడదా ? నీకు సదానందం చెప్పేసుంటాడు." నోరు జారాను. దొరికిపోయాను. అన్నయ్య మళ్ళా నోరువిప్పకముందే బయట పడదామని వీధి వరండాలోకి పరిగెత్తి దిగ్భ్రమచెంది గావుకేక పెట్టినంత పని చేశాను. గేటుముందాగిన రిక్షాలోంచి అందంగా దిగడానికి అవస్థ పడుతోంది విజయ.

విజయ రావడం కిటికీలోంచి చూశాడు కాబోలు; వరండాలోకి వచ్చి, నావేపు సగర్వంగా ఓచూపు పారేశాడన్నయ్య. విజయ గేటుతీసుకుని లోపలికొస్తోంది. నాగుండెలు వేగంగా స్పందిస్తున్నాయి. ఆనందం పట్టలేక పోతున్నాను. ఆశ్చర్యం చంపుకోలేక పోతున్నాను. ఏం చేయాలో తోచని అయోమయ పరిస్థితి. భరించలేని ఆనందంలో అనాలోచితంగా వంటింట్లోకి పరిగెత్తాను. మరికొన్ని క్షణాల తరువాత వదిన వచ్చింది

"ఏంమరిదీ ! మరీఇంత ఇదయితే పనికిరాదుసుమా ! ఇప్పట్నుంచే నువ్వు కాఫీకాచడం మొదలిడితే రేపుతను వంటిల్లు పట్టించుకోదయ్యా..."

వదిన వేళాకోళంచేసినా బాధనిపించలేదు. మనసంతా మధురమయిన భావనతో నిండిపోయింది.

''అదికాదు వదినా మీ రా విడతో మాటల్లోపడి మరచిపోతా రేమోనని..."

"నే మరచినా నువ్వూరుకుంటావా మహానుభావా!'' అయినా ఆవిడక్కడుంటే నువ్వొచ్చేస్తే ఎలా ? నేకాఫీలు తెస్తాగాని, నువ్వెళ్ళి కబుర్లు చెబుతూ వుండు."

'నువ్వు తోడురా వదినా' అందామనుకున్నాను. ఒంటరిగా విజయముందు కెళ్ళడానికి బిడియపడ్డాను.

"ఏం మగమహారాజువయ్యా ! వెళ్ళమంటుంటే" వదిన అందంగా కసిరింది.

పెద్ద పనున్నవాడిలా మొహంపెట్టి, సీరియస్‌గా బజార్లోకి దాటేస్తున్న నన్ను అన్నయ్యాడ్డేశాడు.

"అతిథు లింట్లోకొస్తే, అలా వెళ్ళిపోతావేం, చూడు ఎవరొచ్చారో...

"తమలపాకులు లేవంటే తెద్దామని." మాట మధ్యలో మింగేసి, నన్ను చూసి, సిగ్గుగా నమస్కరించిన విజయను పూరిగా చూళ్ళేక సిగ్గుపడుతూ ప్రతి నమస్కారం చేశాను.

"మీ ఉద్దేశ్యం, తమలపాకుబీడాలా?" టీపాయ్ మీదనున్న విడి తమలపాకుల వేపు చూస్తూ భావగర్భితంగా మందహాసం చేసింది విజయ.

"మీరు భలేవారేనే'' అన్నాను నవ్వుతూ. నాలోని బిడియం పటాపంచలయింది.



తనుకూడా ఆపాదమస్తకం అందంగా ఊగిపోతూ నవ్వుతోంది. అందంగా కదులుతున్న విజయనీ విజయలో కదులుతున్న అందాన్ని చూస్తూ కూర్చున్నాను. క్షమాపణ ద్యోతకమయ్యేలా మొహంపెట్టి "ఇప్పుడే వస్తా, మాట్లాడుతూ ఉండండి" అని అన్నయ్య లోపలికెళ్ళాడు. నవ్వునుంచి తేరుకుని, చీరకొంగును నిండుగా కప్పుకొని, పొందిగ్గా కూర్చుంది విజయ. ఎర్రటి చీరా అదేరంగు రవికా, నుదుటి మీద ఎర్రని తిలకం, మా తోటలో ఉషస్సులో వికసించే ముద్దమందారంలా ఉంది విజయ. అందాన్ని, ఆకర్షణీయ తనూ తనదిగా చేసుకున్న విజయను, కళ్ళల్లో నింపుకుంటున్నాను. ఇంతలో వదిన మంచినీళ్ళూ కాఫీ కప్పులూ తీసుకువచ్చి టీపాయ్‌మీద ఉంచి, 'స్టౌ ఆర్పివస్తా'నంటూ లోపలికెళ్ళింది. అదుదైన ఏకాంతం, అందమయిన నిశ్శబ్దం, బరువుగా వాలిపోతున్న చూపులూ, ఆరాటపడుతున్న పడుచు హృదయాల వేడి నిశ్వాసాలూ. ఉత్తినే కూచోవడం సభ్యతకాదని "కాఫీ తీసుకోండి" అన్నాను అతిప్రయత్నంమీద.

మంచినీళ్ళ గ్లాసుని చేతిలోకి తీసుకుంటూ అంది విజయ.

"మీ రేమయినా కబుర్లు చెప్పండి."

"ఏం మాట్లాడమంటారు. మీరు మా యింటికొచ్చారు. క్రొత్త వెలుగుల్ని తెచ్చారు. అంతకన్నా అదృష్ట మేమి టుంటుంది చెప్పండి. మీ ముందు నేను మూగివాడి నయిపోతున్నాను."ఉత్సాహం గట్లు తెంచుకొని ప్రవహిస్తోంది. మంచినీళ్ళు త్రాగడం ఆపి, ఆశ్చర్యంగా చూస్తూ, కళ్ళని చక్రాల్లా త్రిప్పి "మీరు మా బాగా పొగుడుతారే" అని త్రుళ్ళి త్రుళ్ళి నవ్వుతూ, అనాలోచితంగా, మంచినీళ్ళని మీద ఒంచేసుకుంది. తడిసిన ఎర్రటి పవిట ఎదఎొంపును ఎగదోస్తోంది. వర్షఋతువులో కనిపించే ఆరుద్ర పురుగురంగు గుండెలు. ఆకులేని మోదుగు వృక్షం మీద, గ్రీష్మంలో కాకలెత్తే పూమంటల్లాంటి గుండెలు. నన్నావహిస్తున్న ఆవేశాన్ని వివేకం అడ్డుకుంటున్నది.

"అరెరె తడిసిపోయారే. నీ క్లాలికి పోయాయా?" పరామర్శిస్తూ వదిన. అన్నయ్యా ఒకరివెంట ఒకరుగా గదిలో కొచ్చారు.

"ఫరవాలేదు లెండి" నిర్లిప్తంగా అంది విజయ.

"కాఫీ తీసుకోండి, వేడెక్కుతారు; తడిసిపోయారుకూడా," వదిన చమత్కరించింది.

"థ్యాంక్స్, మీ అభిమానానికి. మీ మరిదిగారి కంతమాత్రమయినా తట్టలేదు" కొంచెం సీరియస్‌గా అంది విజయ.

విజయ అట్లాఎందుకన్నదో ఆలోచనకంద లేదు. విస్తుపోయాను. నానుంచేదో పొరపాటు జరిగినట్టుగా ఫీలయ్యాను.

"అది మరిది దోషం కాదులెండి. కొందరి సమక్షంలో ఉండే ప్రభావం" వదిన నర్మగర్భంగా నవ్వింది. విజయ సిగ్గుపడిపోయింది. సిగ్గుతో నిగ్గుదేరిన విజయ చెక్కిళ్ళని చూసిం తర్వాతకాని మనసు కుదుటపడలేదు.

పెదాలను రేఖామాత్రంగా విప్పి కాఫీ కప్పును, అందమయిన పెదాలకు కందించబోతోంది విజయ. అంత అందమయిన, నాజూకైన పెదాలు, కాఫీ వేడికి కరిగిపోతాయేమో ననిపించింది.

కాఫీలయిన, మరికొంత సేపటికి విజయ వెళ్తానంది. అప్పుడే వీధిలో దీపాలు వెలిగించి, చాలా సేపయింది.

"బంకుదాకా వెళ్ళి రిక్షా ఎక్కించి రారా" అన్నాడన్నయ్య. విజయా నేనూ బయలుదేరాం. కనుచూపు మేరలో రిక్షా ఏదీ కనిపించలేదు. ఊరికి దూరంగా పారేసినట్టుగా ఉంది మా కాలనీ. నిర్మానుష్యమయిన రోడ్డు, చీకటుందిసుమా అని జ్ఞాపకం చేయడంకోసం, డ్యూటీగా వెలుగుతున్న మసకదీపాలు, గిలిగింతలు పెడుతున్న చల్లటి ఈదరగాలి విజయా నేనూ మాకు తెలియకుండానే, సన్నిహితంగా ప్రక్కప్రక్కనే నడుస్తున్నాం. విజయ ప్రక్కన నడుస్తున్నందుకు, నాకు చాలా గర్వంగా ఉంది.



"మీరు కొంచెం గర్విష్టులనుకుంటాను" ఉన్నఫళంగా విజయ అనేసింది.

"నాకా గర్వం." ఆశ్చర్యపోయాను.

"అవును వచ్చిం దగ్గర్నుంచి చూస్తున్నాను. నే వాగడం తప్పిస్తే మీరే మయినా మాట్లాడేరా?" విజయ నిష్ఠూరంగా అంది.

"ఈ మాటే నే నంటే? నే నన్న వాణ్ణి ఒహాడి నున్నాననయినా గమనించకుండా మీరన్నయ్యతోనూ వదినతోనూ మాట్లాడుతూ కూర్చుంటే నే నేం చేసేది. అసలు నే నంటే మీ కభిమానముంటే కదా."

"అవును. అభిమానం లేకపోవడం చేతే, ఇంత దూరం, ఊరుబయటకు మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను." విజయ సాధిస్తున్నట్టుగా అంది. గొంతు బొంగురుపోయింది. నన్ను నేను నమ్మలేకపోతున్నాను. విజయ నిజంగా నా కోసమే వచ్చిందా. ఇన్నాళ్ళూ విజయ నర్థం చేసుకోలేకపోయినందుకు నా మీద నాకే విసుగొచ్చింది.

"నీకు తెలీదు విజయా! నువ్వంటే నా కెంత అభిమానమో" నా కళ్ళు చెమర్చాయి.

"అంతా అబద్ధం. అంత ఇదేవున్న వారయితే మా సెక్షనులోంచి వెడుతూ కూడా నన్ను గమనించకుండా, నిర్ల

క్ష్యంగా చూసీ చూడనట్టుగా ఎందుకు వెళ్ళిపోయేవారు...? దూరంగా ఆ మూల సీట్లో కూర్చుని, ఠీవిగా, సదానందంతో కబుర్లుచెబుతూ ఉంటారుగానీ, ఏనాడయినా, క్రొత్తగా చేరానుకదానన్న జాలితోనయినా, మీ పని కష్టంగావుందా, ఎడ్జస్టవగలుగుతున్నారా అని అడిగారా.'' విజయలోని ఉద్వేగం, దుఃఖంగా మారి గొంతు జీరపోయింది. నేను పూర్తిగా కదిలిపోయాను. ''విజ్జీ!'' విజయ మరీ సన్నిహితంగా నడుస్తున్నది. భుజాలు ఒరుసుకుంటున్నాయి. విజయ చేతి వ్రేళ్ళని నా చేతి వేళ్ళతో అల్లి ఆవేశంగా నొక్కాను. విజయ పూర్తిగా నా మీద కొరిగి నడుస్తున్నది. బరువుగా అడుగులు వేస్తున్నాం.

"నీ కోసం, నేను తపించని రోజు లేదు విజ్జీ! దూరంగా ఉండి నన్నిలా దహిస్తున్నందుకు నీ మీద ఎంత కసిగా ఉండేదనీ, నీతో మాట్లాడే అవకాశం ఎలా కల్పించుకోవాలో తెలియక ఎలా అవస్థ పడేవాణ్ణనీ, నీతో మాట్లాడలేక, మాట్లాడకుండా ఉండలేక నేను పడ్డ వ్యథ నీ కర్థం కాదు. నీ సాక్షిగా విజ్జీ నువ్వు లేని నేను లేను."

"నేను ధన్యని'' బరువుగా నిట్టూర్చి తలని నా భుజంమీద వాల్చేసింది.

చిక్కటి చీకటి, చక్కటి తారురోడ్డు; స్వేచ్ఛగా మే మిద్దరం. మాలో అనంతమయిన కోరికలు. విజయను బలంగా హత్తుకుందామనుకున్న కోరికను బలంగా అణుచుకున్నాను.

దైవికంగా అటుగా ఓ రిక్షావచ్చింది. తనతోకూడా రమ్మని విజయ మారాం చేసింది. "గౌరవంగానువ్వు నాకౌగిలిలోకి వచ్చేరోజుకొరకెదురు చూడు విజ్జీ" విజయకళ్ళల్లోకి నవ్వుతూ అన్నాను. రిక్షాలోకూర్చుని నాచేయి నందుకుని ముద్దుపెట్టుకుంది. రిక్షా సాగిపోతూనే వుంది. కదులుతున్న రిక్షాలోంచి చేయి వూపుతున్నది విజయ. చెమర్చిన కళ్ళతో రిక్షా కనుమరుగయ్యే దాకా, చిక్కటి చీకటి. చీకట్లో ఒంటరిగా నేనూ...

* * *

సోమవారం ఉదయం సదానందం సీటుదగ్గర కూర్చుని రాత్రివచ్చిన అందమైన కల నెమరు వేసుకుంటున్నాను. విజయ, తతిమ్మా అమ్మాయిలూ వాళ్ళ పనులేవో చూసుకుంటున్నారు. సదానందం ఆత్రతగా అడిగాడు. "ఎందాకా వచ్చింది బ్రదర్ వ్యవహారం. విజయ నీకు మంచిజోడి, నువ్వే దక్కించుకోవాలి. మరిచాను రాత్రి కలగన్నా. అబ్బ! ఎంత అందమయిన కల; నువ్వూ నేనూ గుడిముందుగా వెళ్ళుతున్నాం. పట్టుచీరలో ప్రసాదంతో విజయ గుళ్ళోంచి సరాసరి మనముందు కొచ్చింది. నిన్ను పేరెట్టి పిలిచి ప్రసాదం నీచేతిలో వుంచింది. అదృష్టమంటే నీది బ్రదర్," విజయ నాకోసం మాత్రమే




పుట్టినట్టు మాట్లాడతాడు సదానందం, అమాయకంగా. విజయకు కనిపించేలా నిటారుగా కూర్చున్నాను. విజయ నావేపు చూసింది. నిర్వికారమయిన ఆ కళ్ళ లోతులవెనుక భావాలకోసం అన్వేషిస్తున్నాను. కనురెప్పలు బరువుగా దించేసి పనిలో మునిగిపోయింది.

విజయ మనోభావాలను మొహంలో పట్టేయడం చాలా కష్టంగా వుంది. దరహాసరేఖలు లీలామాత్రంగా కనిపిస్తున్నాయనుకున్న ఉత్తర క్షణంలోనే చాలా గంభీరంగా కనిపిస్తుంది విజయ. ముందురోజుల్లో విజయ నవ్వేది. బదులుగా నవ్వడానికి బిడియపడేవాణ్ణి. నన్ను చూసే నవ్విందా అని అనుమానం కలిగేది. పలకరింపుగా చిరునవ్వు నవ్వితే సభ్యత కాదేమోనన్న సంకోచం, పరిచయంకోసం పాకులాడుతున్నానని చులకనభావం వహిస్తుందేమోనని జంకు నన్ను వెనక్కిలాగేవి. నాకో విషయం దూఢిగా తెలుసు. విజయ నావేపునే గమనించకుండా చూడ్డానికి చాలా ప్రయత్నించేది. "ఆ అమ్మాయికి నీమీద మనసుంది. లేకపోతే నీ వేపెందుకలా గాఢంగా చూస్తుంది" అనేవాడు సదానందం. సదానందం భ్రమపడ్డాడని నేననుకోను. ఒక్కోసారి అనిపించేది. విజయ నన్ను ప్రేమిస్తోంది. లేకపోతే నేను కనిపించగానే చిరునవ్వెందుకు చిలికించేది? ఎటుగా వెళుతున్న నావైపు ఎందుకలా కళ్ళార్పకుండా చూసేది? కాని మరి, నేనంటే ఎందుకు నిరసనగా ఉంటోంది ఈ మధ్య? ప్రేమవల్ల కలిగిన గారాబపు అలుకకావచ్చు. నన్ను పలకరించడేం అన్న విసుగు కావచ్చు. పాపం పరితప్తహృదయ ప్రేమావేశాన్ని నిరసనగా ప్రదర్శిస్తోంది.

విజయ నన్నెందుకు ప్రేమిస్తోందీ ;

రోజూ నేనక్కడ తారాట్లాడడం చూసి నిరసనభావం వహించి ఉండవచ్చు. లేక నేను తనవేపలా గాఢంగా చూడడం, నలుగురూ గమనించి గేలిచేస్తారేమోనని విసుగుచెంది ఉండవచ్చు. నలుగురూ ఏమన్నా అనుకుంటారనే బాధే అయితే, విజయ నన్ను ప్రేమించినట్టేనా? నాకు నవ్వొచ్చింది. నా సందేహాలకు జవాబులు నాదగ్గరలేవు. నన్ను నేను ప్రశ్నించుకోవడం మాత్రమే నేను చేయగల్గింది. చీకట్లో నిలుచున్నాను. వెలుగును వెతుక్కుంటున్నాను. వెలుగుకనిపిస్తే భరించగలనా అని సందేహం. వొద్దు, వెలుగు నాకక్కర్లేదు చీకటే హాయిగాఉంది. అనుభూతుల్ని మిగుల్చుకోవచ్చు. ఆవారం రాత్రి చీకట్లో బంగారపు వెలుగుల కల మనస్సులో మిగిలిపోయింది. విజయ చేతిలో నాచేయి. చుట్టూ చీకటి, మృదువుగా నాచేతిని విజయ పెదాలతో స్పృశించడం. నీకోసమే నన్న నేను, నీవే నా సర్వస్వమన్న విజయ. కలలో ఎంత ఉదాత్తంగా పెరిగిపోయాను. నాకెంత ధైర్యమని! విజయ కళ్ళలో కళ్ళుచేర్చి ఎంత ధీమాగా ఆమె సౌందర్యాన్ని అవలోకించానని, చుట్టూ చీకటి, బంగారుకల. ఈకల చీకట్లోపుట్టింది. ఇందులో వెలుగుందా? ఏమోమరి? ఏదయినా అందమయిన బంగారుకల. అందమయిన చక్కటి చిక్కటి చీకటికి అందాలనిచ్చేకల. అందమయిన చీకటి, అందమయిన చిన్నవాడు. నాపరిస్థితికి నాకే నవ్వొచ్చింది. 'ఏమి'టన్నాడు సదానందం కుతూహలంగా.

"ఆఅమ్మాయికి నేనంటేఅసహ్యం." నిర్విచారంగా అన్నాను.

"ఏం, ఎందుకని" దెబ్బతిన్న వాడిలా అడిగాడు సదానందం.

"ఏమో తనే చెప్పింది" అబద్ధమాడాను. సరదాగాఉంది.

"అంతగర్వమా, తనేపెద్ద అందగత్తా, పోనీలే బ్రదర్ 'వర్రీ' అవకు. ఇంతకన్నా మంచివాళ్ళనే చేసుకుందువు గాని, నీకోసం ఎంతమందనిరారు?" విన్నటిదాకా విజయ అందాన్ని పొగిడిన సదానందం మొహం ఇవ్వాళ మరీ నల్లగా కనిపిస్తోంది. చిక్కటి చీకటి లాంటి అయోమయం. అందులోనే మిణుగురు పురుగుల్లాంటి ఆశల వెలుగును సందేహాలు మలిపేస్తున్నాయి. ఈచీకటి నన్ను ఎగతాళి చేస్తోంది. ఓదారుస్తోంది. బంగారపు కలల్ని పండించి, నన్ను కలల్లో బ్రతికిస్తోంది. నా ఆలోచనలకి నాకేనవ్వొచ్చింది. ఈమారు విపరీతంగా నవ్వాను. తనేదో ఓడిపోయిన వాడిలా బాధపడుతున్న సదానందాన్ని చూసి నవ్వుతున్నాను. అర్థంకాక బిత్తరపోయి నావేపు కళ్ళప్పగించిచూస్తున్న విజయని చూసి నవ్వుతున్నాను. కసిగా, ఆనందంగా, నవ్వుతున్నాను. తెరలు తెరలుగా నవ్వుతున్నాను. ఇప్పుడు విజయ నవ్వుతోంది; సదానందం నవ్వుతున్నాడు. నిర్భయంగా విజయవేపు చూస్తూ నవ్వుతున్నాను. చీకట్లో వెలుగుల్ని వెతుక్కున్న గ్రుడ్డివాణ్ణి నవ్వుతున్నాను.

# వానచినుకులు

వి. రాజారామమోహనరావు

కిటికీలోంచి...కురిసే వానలోంచి గతంలోకి చూసుకుని తమనితాము తడుముకోవటం చాలా మందికి అలవాటు.

దూరాన్ని రూపుమాపుతూ రేడియోలో సంగీతం....ఒక్కొక్క చినుకే సంగీతంతో పడుతోంది అరుగు పక్కన నీళ్ళ గుంటలోకి...

సిగరెట్ పారేయటానికి బయట పెట్టిన చేతిమీద ఒకే ఒక వానచినుకు, గతాన్ని సాక్షీభూతం చేసుకుంటోంది ముత్యరూపంలో...

అరగతీసిన మంచిగంధం చెక్కలాంటి వాణి మెరుపు మెడ వొంపులో ఆనాటి వానచినుకు...తన స్నేహితుల పంక్తిలో...

ఎవరో పాప వర్షంలో తడుస్తూ,

నవ్వుతూ ... వొణుకుతూ గెంతుతూ వెడుతోంది కిటికీ ముందునుంచి...

బాల్యంలో, యవ్వనంలో...ముసలి తనంలోకూడా, వానలో తడవటం సన్నని తృప్తిరేఖల అనుభవం...

''వెళ్ళి వానలో తడిస్తే''... చేతి మీద ఇంకో చినుకు పడింది. సన్నని పాశం లాగేసింది వెనక్కి...మళ్ళీ అనంతృప్తిలోకి...

''వాణి ఎలా ఉందో?...'' వర్షపు సాయంత్రం ఆనాటి వాణిమెడమీద వానచినుకుల రుచి...నాలుక జిల్లుమన్న గుర్తు...

''ఎలాగా ఇటువేపు వచ్చావు...ఇంక పంచమైళ్ళే కదా, వెళ్ళి వాణిని చూడ కూడదా?'' అనడిగిన లలితకి ఏం సమాధానం చెప్పగలను? నాలోని ఆనాటి నిర్లక్ష్యం...కేవలం అందాన్ని తప్ప, అనుభవాన్ని తప్ప...మృదు బంధాన్ని తప్ప...ఆడతనాన్ని, ఆడతనపు విలువని తెలుసుకోలేకపోయిన తెలివి తక్కువతనాన్ని ఎలా వొప్పుకోవటం? చిన్న చిరునవ్వే ఆయుధం లలితకి సమాధానంగా...

''పోనీ వెళ్ళి వాణిని చూస్తే...'' ఈదురుగాలి చెంపని కదిపింది. తల తిప్పితే...

పక్కమీద ఏనాటిదో దుప్పటి రంగు వెలిసి మెరుస్తోంది...

వాణి...మార్పు...మార్పు ఈ జీవన చైతన్య నౌకకి చక్కటి ఇంధనం...

''అవును వాణిని చూడాలి''

చెట్టుమీద చినుకులు ఒక్కసారి నవ్వాయి గబుక్కుని కిందకి దూకుతూ... కిటికీలోంచి...

* * *

లీలగా ... భయంగా, ఆనందంగా, ఆవేశంగా కోరుకున్న దాని చేరువ... గుండె వణుకుతోంది...చేతిలో సిగరెట్ వణుకుతోంది, తలుపు కొడుతుంటే...

తలుపులు తెరుచుకున్నాయి...ఒక్క క్షణం ఆలోచనకి తాళం పడింది...

కళ్ళల్లో ఒక్కసారి మండినవెలుగు. పెదవులమీద మృదువుగా పగిలిన నవ్వు.. ఆసంకల్పంగా కదలిన చిన్న కదలిక.. తలుపు పట్టుకుని అలా వాణి...అదే మెరుపు మెడలో...పచ్చటి మంగళ సూత్రాల గొలుసు సముద్ర తరగల్లో... పచ్చటి వెలుగు...

తృప్తిగా ...ఎన్నాళ్ళనుంచో ఉగ్గబట్టిన శ్వాస వదిలినట్టు నిట్టూర్చింది వాణి...''నిన్నుచూశాను...ఇన్నాళ్టికి'' అంటూ...

తెలుసుకోవాల్సింది, సంవత్సరాల మడతల్లోది, పూర్వపు పునాదుల్లోది, ఎంతో ఉంది ... తెలుసుకోవాలన్న ఆకాంక్ష ఉంది...కాని మాటలు రావు... కళ్ళ మెరుపు తప్ప...




"ఏరీ?"...'మీవారు ఏరీ" అని అన లేకపోతున్నావని తెలుసు...

"వస్తారు సాయంత్రం" కొద్దిగా వంగింది వాణి మెడ...

అడ్డపడిన జలపాతం అడ్డుదూకింది.. నవ్వుల్లో...చమర్చిన మనసుతృప్తిలో.. స్వచ్ఛమైన ఆనందంలో .. ఎన్నో సంగతులు...

తలెత్తుకు నిలబడుతోంది బలంగా. ఇంత ఆనందాన్ని శాశ్వతంగా అందుకో లేకపోయిన దౌర్భాగ్యం.

"ఆయన చాలా మంచివారు"

వాణి మిగిలిన మాటల్లా రుచించ లేదిది...

* * *

అలాగే గడచిన రెండురోజుల్లో... వదులుకోలేని చేరువ, ఎక్కడో చలవ దనం చిక్కబడుతున్న తెరల వెనకాల వొళ్ళు విరుచుకుంటున్న అపేక్ష .. రాత్రి ఒంటరిపడక ... జంట విలువని జీవితంలో తోడుస్థానాన్ని ఎత్తి చూపిస్తూ...

తీయటి తమలపాకులో... అక్కడో ఆకుకి, అక్కడో ఆకుకి విషం రాసుకు తయారైన తాంబూలం ఈ ఆనందం. ఈ విషానికి మరణంరాదు. చేదే మిగులు తుంది.

'వాణి... నిండుగా... బాధపడదేం. కోల్పోయిన దానికోసం గతంకోసం. ఒక్క కన్నీటిచారకూడా లేదాకళ్ళల్లో.

ఏనాటిదో. ఎవరిదో కథలా మరిచి పోయిందా గతాన్ని...?"

గుండెమీద పూరేకుపరచి పదునైన శూలం దింపుతోంది ఈ అనుభవం...

'భర్తదగ్గర వాణికి ఏం గుర్తుండదా? ఆవాణేనా ... ఎలా....ఎలా ...తనలో ఏమాత్రం స్థానంలేని నాకు... ఏ మిటి మిగిలింది?'

గదిలోంచి ఘల్లుమంది నవ్వు...

'గొంతుకనుంచి గుండెలవరకు తడి ఆరిపోయినట్టయింది. ఎందుకు ఇంత బలవంతంగా విషంలాంటి ఈ అనుభవం. రేపే వెళ్ళిపోవాలి. ఈక్షణమే వెళ్ళ గలిగితే ఎంత బాగుండును. వెళ్ళిపోతే అడ్డేదేముంది?'

కాళ్ళ వేళ్ళ నరాలు బిగుసుకున్నాయి.. మనసుకేలేదు ఆబిగువు.

ఇప్పుడుకాదు...రేపు...వాణిని కళ్ళ నిండుగా చూసి రేపు...

నాన్నిద్రలేని రాత్రుల సంఖ్య ఇంకొక దాన్ని చేర్చుకుంటోంది ..

తెల్లవారుజామున పనిమనిషికి తలుపు తీస్తూ, నలిగిన చీరమడతల సవరింపులో వాణి....

తెల్లారిందన్న ఆశతో, బలవంతంగా అందుకుంటున్న ఊపిరి మధ్యలోకి విరిగింది.

* * *

"ఇవాళ వెడతాను"

"ఇవాళ ఒక్కరోజు ఉండవూ!"

భర్తచేరువలో వాణికాదు ఈవాణి. ఈ కళ్ళతడిలో, ఈ దీనత్వంలో ఈవాణి వేరు. ఈ దీనత్వానికి, ఈబంధపు దారికకి లొంగనివాళ్ళు ఎవరూ ఉండరా?

చీకటి పడేవరకూ మళ్ళీ అదే మధురిమ....తీపిపూసుకున్న చేదులా....

వేసవి వర్షాకాలాల సరిహద్దు సాయంత్రం...దొడ్లో మల్లెపందిరికింద, దూరపు స్థూలపు లెఖల్లో దగ్గరగా కూర్చున్న మామీద వాన చినుకులు....

ఎన్నాళ్ళదో...ఏనాటిదో ఆవేశం... కొన్నిక్షణాల్లో రెక్కలు పెంచుకు వొళ్లు విరుచుకుంది.

చేతులు వణుకుతున్నాయి. వాణీ వెన్నెముక నావేళ్ళల్లో కరుగుతోందా?

"అబ్బ!"

"ఏం వాణి"

నవ్వు ... బాధైననవ్వు, కడుపు రాసుకుంటూ.

అవును వాణిలో ఆవిండు... ఎన్నో రంగులు పూసుకున్న మెడమెరుపు నలిగిన అందాలు దాచుకున్న ఆకళ్ళ బరువు...

"ఎన్నోనెల?"

"నాలుగు..." తలవంచుకుంది...

కాదు ... నా దేం లే దిక్కడ ... భ్రమ...

* * *

మింగిన తీయనివిషం ఆ అనుభవం... తీయని స్లోపాయిజన్ ... తన ప్రభావం చూపుతోంది ఈ రెండునెలలుగా ...

పాత కమ్మటికలలు...స్మృతులు... వికారపు అంచులులేని ఆలోచనలు.వర్షం చినుకుల్లో, మల్లెపూల వాసనల్లో ... ఋతువుల సరిహద్దు సాయంత్రాల్లోనిలుపుకున్న జ్ఞాపకాల్ని, ఒక్కొక్క దాన్నే తినేస్తోంది ఈ విషం ...

అనుభవానికి దూరంగా, ఆలోచనలకి, జ్ఞాపకాలకి దగ్గరగా ఉండాలన్న ఈ ప్రయత్నంలో వాణి ఉత్తరం మళ్ళీ ...

నీ కేం రాయను...అలా వచ్చావు? ఎందుకో ... ఏమో ఇద్దరికీ తెలియని స్థితిలో ... బాధపడుతున్నావా? ఒక్కసారి రావూ...తల్లి అవటం ఆడదానికి రెండో జన్మట...ఈ ఒక్కసారిరావూ...

'వాణి'

కేవలం ఉత్తరమేనా ఇది...కాదు... గుండెల్నిపిండే శక్తుంది ఆ మాటలకి .. 'ఈ ఒకేఒకసారిరావూ'వెళ్లనా,ఆ తీయని విషాన్ని మళ్ళీమింగనా ... గతం గదుల్లోకి భావిని తీసికెళ్ళి సమాధిచేయనా...

మెదడులో నరాలు ఒక్కుమ్మడిగా పనిచేస్తున్నబాధ ...

'వద్దు ... వాణితో కొండలెక్కి, లోయల్లోకి ఉరికే ఆ అనుభవంవద్దు... నే భరించగలిగినా, వాణి...వాణి భర్త... వద్దు...'

ఈనాటివరకూ నిజంగా నాకు వాణి తెలియదు.. వాణిభర్త ఉత్తరం రాయక పోతే ఈనాడూ తెలియదు.

మీ యిద్దరీగురించి నాకు వాణి ఏనాడో చెప్పింది. చిన్నప్పటినుంచి కలిసి పెరిగిన ఆత్మీయత మీది ... జీవితంలో యవ్వనం పులిమే స్వచ్ఛమైన రంగులు నింపుకున్న మనసులు మీవి... వాణిని మీరు తిన్నగా అర్థం చేసుకోలేదు. మీరు మాతో ఎన్నాళ్లు కలిసి ఉన్నా వాణీ మీతో ఏ తప్పూ చెయ్యదు. చేయలేదు. పెళ్ళయిన నాటినుంచి మీరు ఆత్మీయతకి, మనసుకు ప్రియమైన రూపానికి గుర్తు వాణికి. వ్యక్తిగా మీమీద వాణికి దృష్టే లేదు. అర్థం చేసుకోలేక పోయారు గను కనే రమ్మన్నా రాలేక పోయారు. ఈనాడు వాణీలేదు. రెండోసారి జన్మెత్తలేక పోయింది. చివరివరకూ మిమ్మల్నే వెతుక్కుంది...

"........."

సాంఘికంగా ఇంకొకరి భార్యని ఎంత ఆత్మీయురాలైనా నా దృష్టితో చూడటం తప్పే ...

నా మనసు ఇనప్పెట్టిగా మారటానికి, అలవాటుకి, కాలానికి మనసుకానిసని నేను నమ్మటానికి కేవలం భయం, సంప్రదాయాన్ని ఎదిరించలేనిభయమేకారణం..

సంప్రదాయ భీరువుని కాకపోతే, నా దృష్టి ఇంత ఇరుకయ్యేదికాదు. ఈ స్మశాన జీవితం అనుభవంలోకి వచ్చేది కాదు.

అందరికి, అన్ని మనసులకి ఒకే నీతిసూత్రంకాదు ... ఒకే సంప్రదాయం కాదు...మీదపడిన చినుకులకి అందరూ ఒకేలా స్పందించరు.

ఈనాడు వర్షం వస్తోంది...నా మీద చినుకులు పడుతున్నాయి...కాని నాలో స్పందనలేదు.



గుడ్డివాణ్ణి - పదిపైసలు ధర్మం చెయ్యండి బాబూ!
ఒక కన్ను కనిపిస్తోందే
పోనీ అయిదుపైసలు వెయ్యండి!!
'భారతి'




ఈ మందుతో ఏం లాభంలేదు డాక్టర్ - మాంచి డోసు ఏదైనా ఇవ్వండి!
ఆఖరున ఇస్తాను - బిల్లులా!!
'Anjan'




"చేసేదేముందీ? ఎవరి కెంత
ప్రాప్తమో అంత!"

బట్టలు బేరం చేస్తున్న హేమ ఒక్కసారి తుళ్ళిపడింది. ఎప్పుడో పదిహేనేళ్ళ క్రితం అవే మాటల్ని విన్నట్టు చప్పున జ్ఞాపకమొచ్చి నవ్వుకున్నది.

నాటికి నేడు మళ్ళీ అవేమాటలు! అదేగొంతు!

అతనే! సందేహంలేదు. ఈ పదిహేనేళ్ళ కాలంలో అతనిలో పెద్ద మార్పేదీ ఉన్నట్టు కనబడలేదు.

అప్పుడు పంచెలు కట్టుకునేవాడు.

ఇప్పుడు టెర్లిన్ ప్యాంటూ, టెర్లిన్ స్లాకూ తొడుక్కున్నాడు.

అప్పటికంటె కొద్దిగా మాత్రమే లావు. నిలకడగా అతను ఎవరితోనో మాట్లాడుతున్నాడు-తను మాట్లాడుతున్న వ్యక్తిని తప్ప పరిసరాలు మరిచిపోయి, ఎప్పటిలాగే !

"హలో ! రామూ ! గుర్తున్నానా ?''

ముందుకెళ్ళి పలకరించింది హేమ, తనను చూడగానే అత్యంత సంభ్రమంతో పలకరిస్తాడని గట్టి నమ్మకంతో.

"క్షమించండి...మీరు..."

అతను తొట్రుపడుతూ ఆగిపోయాడు. క్షణం మలినమయింది హేమ ముఖం. అంతలో లేనినవ్వు తెచ్చుకొని "భలేవాడివే ! నన్ను మరిచిపోయావా ? పైగా ఈ మీ రొకటా ! నేనయ్యా ! హేమని..." అంది.

"హేమ....హేమ...మీరా ?''

ఆలోచిస్తున్నట్లు నిలబడిపోయాడు - శూన్యంలోకి చూస్తూ.

ఈసారి హేమ ముఖం వడిలిపోయింది.

"అదృష్టవంతుడివి. ఎంత తేలికగా మరిచిపోయావ్ !" అన్నది.

"క్షమించాలి. నిజంగానే మరిచిపోయాను. ఇప్పుడు గుర్తొచ్చింది."

"ముందా 'అండీ' మానెయ్యి-నిన్ను మీరంటూ పిలవలేనిప్పుడు-నేను నీలాంటి అదృష్టవంతురాలిని కాను గనుక-నిన్ను మరిచిపోలేదు గనుక-నువ్వు మీరని పిలిచినా సహించలేను.''

ఎదుటి వ్యక్తుల్ని నొప్పించలేని సహృదయత ఉట్టిపడే ఆర్ద్రతతో- గుర్తుంచుకోలేని తనను క్షమించమని ప్రాధేయపడుతున్న భావం అతని ముఖంలో కనపడ్డది.

"పదిహేనేళ్ళ క్రితం నీ కోసం, నీ స్నేహంకోసం పనికట్టుకుని హైదరాబాద్ నుండి బెజవాడ వచ్చినఅమ్మాయిని. కలిసిన స్నేహం నిలుపుకోలేక తెంపుకున్న విభాగ్యురాలిని కూడా."

"చాలా మారిపోయావు. బాగా లావయిపోయావు. మొత్తం ఇంకో అమ్మాయిలా అయిపోయావు. అందుకని చప్పున గుర్తుపట్టలేకపోయాను... లేకపోతే నిన్ను...అప్పటి నిన్ను.... గుర్తుపట్టలేనా ?''

సంజాయిషీ ఇచ్చుకొంటున్నట్లు అన్నాడు. ఆ సంజాయిషీ హేమ హృదయాన్ని ఊరడించలేదు.

ముప్ఫైమూడేళ్ళు నిండిన వయసును ఎత్తిచూపింది. వ్యర్థంగా గడిచిపోయిన వయసు మళ్ళిపోతోందని హెచ్చరించింది.

వయసుతోపాటు వదలని కన్నె మనసును మాత్రం కుదిపి కూల్చింది.

"హమ్మయ్య ! ఇప్పటికి గుర్తుకొచ్చాను గదా !" అంది కన్నీళ్ళతో... చిరునవ్వుతో....




"ఏం చేస్తున్నావమ్మా."

"చంద్రుణ్ణి చూస్తున్నా!"

"రోజూ చూసే చంద్రుడేకాదు టే వచ్చి పడుకోక!"

---

ఆమె కను కొలకులలో నీటి బిందువులు చూసి కలవరపడుతూ. "వచ్చావు. గుర్తొచ్చావు. ఇంకె ప్పుడూ మరిచిపోను..." అనేశాడు గబగబా...

గలగల నవ్వింది.

అదే కంగారు! అదే పసితనపు స్వచ్ఛందం!

"ఇంక మరిచిపోనివ్వను. ఇక్కడే ఉంటానుగా! నువ్వెప్పుడొచ్చావ్ ఇక్కడికి?"

"ఇప్పుడా? పదేళ్ళయింది. సినిమాలలో పాటలు వ్రాస్తున్నప్పటి నుండీ ఇక్కడే ఉంటున్నాను."

"సినిమాలలో పాటలు వ్రాస్తున్నావా?"

"ఆ! సుమశ్రీ అనే పేరుతో..."

"సుమశ్రీ నువ్వా?"

"ఆ! నేనే! నీకు తెలీదా?"

"ఊహూ! నాకేం తెలీదు. చిత్రం! పదేళ్ళబట్టీ ఒకే నగరంలో ఉంటూ ఒకరి నొకరం కలుసుకోలేదు! నీకు తెలుసుగా, నే నిక్కడుంటున్నట్లు? నాకు కనపడలేదేం, ఇన్నాళ్ళలో?"

అతను రెండు క్షణాలు బాధగా దిక్కులు చూశాడు.

"ఇకముందు మనం కలుసుకోగా దన్నావు జ్ఞాపకం ఉందా?'' అన్నాడు నవ్వుతూ.

హేమ సమాధానం చెప్పలేక పోయింది. క్రింది పెదవిమాత్రం పళ్ళ మధ్య నలిగింది.

హేమ బాధపడుతున్నట్లు గ్రహించి అనునయంగా. "ఇంటికెళ్దాంరా! ఇప్పు డయితేనేం! కలుసుకున్నాంగా!'' అని కారు దగ్గిరకునడిచా డతను

"నీకు కారు కూడా ఉందే!" ఆశ్చ ర్యంగా అంది.

"ఆ! ఇటీవలే కొన్నాను. బాగుందా?"

"బ్రహ్మాండంగా ఉంది.''

రాము ఆర్థిక స్థితిగతుల్లో చాలా మార్పు వచ్చినట్టు తెలుస్తూనే ఉంది.

ఆనాడు తను మొదటిసారి చూసి నప్పుడు తాలూకా ఆఫీస్‌లో గుమస్తా అయిన రాము, రిక్షాలో వెళ్తే డబ్బాయి పోతుందని మైలుదూరం నడిచి వెళ్ళే వాడు ఇంటికి.

రాముతో పరిచయం తనకు చాలా చిత్రంగానే జరిగింది. పత్రికలలో అతని గేయాలు చదివినప్పుడు నిజంగానే తనకు మతిపోయేది. అతని పేరు చెప్పగానే పరవశించిపోయే అసంఖ్యాక పాఠకుల్లో తనూ ఒకతె ఆ రోజుల్లో — నిగ్రహించు కోలేక అతని గేయాన్ని ప్రశంసిస్తూ ఒక లేఖ వ్రాసింది. మొదట్లో పాఠకు రాలిగా—ఆదరంగా సమాధానం వచ్చింది. అలా మొదలయిన ఉత్తర ప్రత్యుత్తరాలు ఆత్మీయతాస్థాయికి చేరుకోవటానికి ఎంతో కాలం పట్టలేదు —

యమ్. బి. బి. యస్. మొదటి సంవత్సరం అయిపోయింది.

"నిన్ను చూడటాని కొస్తున్నా"నని వ్రాసింది.

"వెయ్యికళ్ళతో ఎదురుచూస్తుంటా" అని సమాధానం వచ్చింది. తనతో చదువు కున్న ఒక అమ్మాయికి, సరిగ్గా అదే సమయంలో, బెజవాడలో పెళ్ళి కాబో వడం బాగా కలిసొచ్చింది శుభలేఖ ఇంట్లో చూపించి రైలెక్కేసింది హేమ.

"హేమా! హేమా!" అని గట్టిగా అరుచుకుంటూ ప్లాట్‌ఫాం అంతా తిరిగే స్తున్నాడు హడావుడిగా ...

తనే హేమనని తెలియజెప్పటానికి రుమాలు ఊపుతూ చిరునవ్వు నవ్వింది.

"హలో! మీకోసం — నీకోసం——"

ఎంత తడబడతాడు!

కిలకిల నవ్విందితను —

"నన్ను 'నువ్వు' అని పిలవ్వచ్చు అదే సంతోషంనాకు" — అన్నది తను.

"నువ్వు కూడా నన్ను నువ్వనేపిలు! లేకపోతే నేను మీరనేస్తాను —" అన్నా డతను.

తను నవ్వింది — అంగీకార సూచ కంగా —




సామానుతో బయటికొచ్చి టాక్సీని పిలవబోయింది తను.

"టాక్సీ ఎందుకు రిక్షాలోపోదాం –" వెలవెలపోతూ అన్నాడు.

"ఒక్కరిక్షా ఎలా—"

"రెండు రిక్షాలు పిలుస్తాను –"

అప్పటి కింకేం మాట్లాడలేక పోయింది.

అతను ఉంటున్న ఇల్లు అనబడే ఆవరణ చూసేసరికి శరీరం జలదరించింది తనకి.

మురికిసందులో రెండే రెండు గదుల వాటా. దోమలు స్వైరవిహారం చేస్తున్నాయి. సూర్యుడు తొంగిచూస్తున్నాడు. ఆ చిన్నగదిలో అతనితోపాటు అతని తల్లి – తండ్రి – ఇద్దరు చెల్లెళ్ళు. అప్రయత్నంగా తనకు తమ డాబాఇల్లు-ఇంటిముందరి చక్కని పూలతోట స్మృతిపథంలో మెదిలాయి.

ఒక్క గంటకంటె ఆ ఇంట్లో ఉండలేక పోయింది.

"నన్ను క్షమించండి. మా స్నేహితురాలి పెళ్ళికొచ్చాను. అక్కడికి పోవాలి. మళ్ళీకలుస్తాగా !"

అతని ముఖం కొద్దిగా మలినమయినా అడ్డు చెప్పలేకపోయాడు.

"మా యింట్లో ఉండక తప్పదు," అనగలిగేచొరవ అతనిదగ్గిరలేదు.

వచ్చేటప్పుడు తన మనసులోకదిలిన

బంగారు కలలన్నీ ఈ వాస్తవికత ముందు కరిగిపోయాయి.

రాము తనను ఆకర్షించక పోలేదు కాని అతను ఒక యల్. డి. సి : తను యమ్. బి బి యస్. విద్యార్థిని.

ఆఇంట్లో_అమనుష్యులతో_భయంతో గెడ్డకట్టుకుపోయింది తను.

అయినా రామువచ్చి కనకదుర్గ దేవాలయానికి తీసికెళ్తానన్నప్పుడు సంతోషంగానే వెళ్ళింది.

అతనితోపాటు మెట్లెక్కి కొండమీద నించుని బొమ్మరిళ్ళలా కనిపించే బెజవాడ ఇళ్ళని చూస్తూ నించునేది.

అధునిక కవిత్వంలో తీరు తెన్నుల గురించీ. అభ్యుదయకవుల కవిత్వం గురించీఏవేవో మాట్లాడేవాడు అతడు...

అతదేం మాట్లాడినా తనకు అద్భుతంగానే ఉండేది. అతను చెప్పిన విషయాలకన్న అతని కంఠస్వరం ఎక్కువగా ఆకర్షించేది తనని....

ఏదో అలౌకిక సంగీతం పాడుతున్నట్లు అమాటలు వింటూ నిలిచి పోయేది.

ఉన్నట్లుండి "హేమా?" అనేవాడు రాము.

ఎందుకన్నట్లు చూసేది.

అతనిముఖం ఎఱ్ఱబడి పోయేది. ఆ వేసవి సాయంత్రాలలో కృష్ణానది మీంచి చల్లని గాలులు వీస్తున్నా శరీరమంతా చెమటలుపట్టేవి _ చేతి రుమాలుతో ముఖం మళ్ళీ మళ్ళీ వత్తుతాడు. ఒక్క క్షణం తన ముఖంలోకీ _ మరికొన్ని క్షణాలు పరిసరాలూ చూసి చివరకు మరేదో సంభాషణలోకి దిగిపోయేవాడు.

అతను చెప్పదలుచుకున్నది అతని కంఠంలోనే నిలిచిపోయేది.

అయినా అతడు చెప్పకుండానే అతనిమనసు తనకు తెలిసిపోయేది.

ఎఱ్ఱబడ్డ అతనిముఖంలో _ ఆరాధన ఉట్టిపడే కళ్ళలో _ కంపించేకాయంలో ప్రకంపించేగాత్రంలో_ అతని మనసంతా స్పష్టంగా కనిపిస్తోంటే ఎందుకు తెలియదు?

తన దగ్గరనుండి ఏ కొద్ది పాటి ప్రోత్సాహమయినా అతని మనసులోని మాటలకు భాషనిప్పించి ఉండేది అతని చేత.

అయినా తను ఏమీఎరగని అమాయకురాలిలానే నటించేది. అతనిని అయోమయంలో ఉంచేస్తూ.

తనే నిర్ణయానికి రాలేని విషయంలో అతనికి ప్రోత్సాహ మెలా ఇయ్యగలదు?

ఎలా గడిచాయో తెలియకుండా వారం రోజులు గడిచిపోయాయి.

ఆ వారంరోజులూ తనజీవితంలో కల్లా అమూల్యమయినవని ఆనాడు తెలియదు

ఈనాడు తెలిసినా ప్రయోజనంలేదు. తనను రైలెక్కిస్తూ ప్రాధేయత ధ్వనించే స్వరంతో అన్నాడు_







"మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావ్ ?"

"మళ్ళీనా ? ఎందుకూ ?"

జేబురుమాలుతో ముఖం తుడుచుకున్నాడు. నర్వస్‌నెస్‌ని జయించటానికి ప్రయత్నిస్తూ ఎలాగో అనేశాడు.

"నువ్వెళ్ళిపోతున్నావంటే చాలా బాధగా ఉంది. ఈ వారమూ అద్భుతంగా గడిచిపోయింది నాకు. నిన్ను కలుసుకునే వరకూ ఎప్పుడు కలుసుకుంటానా అని తహతహలాడాను. ఈ ఎడబాటు ఎలా సహించగలనో అర్థంకావటంలేదు. నువ్వు శాశ్వతంగా నా దగ్గిర ఉండిపోలేవా ?"

ఏదో అసంభవ విషయం వింటున్నట్లు చూసింది అతని వంక.

"నేను యమ్. బి. బి. యస్. చదువుతున్నానని నీకు చెప్పలేదా ?"

కావాలని కంఠంలో ధ్వనింపచేసిన హేళన అతనిని గాయపరిచిం దనటానికి వడిలిన అతని ముఖమే సాక్ష్యం.

పాడు అహం అంతటితో ఆగలేదు.

"ఎల్డీసీ కన్నా, నీకు ఎక్కువ ఆశలు లేవా రామూ ?" అన్నది తను.

"ఆశల కేం ? అవకాశా లెక్కడుంటాయి చెప్పు ?" అన్నాడతను.

అవకాశాలు వెతుక్కోలేనివాడూ, పెద్ద ఆశయాలు లేనివాడూ ఎమ్బీబీయస్‌కెట్లా సాటికాగలడు ?

అతని ముఖం మసిపూసినంత నల్లగా అయిపోయింది.

ఆ నలుపు అదేక్షణంలో తన మనసులోనూ ప్రతిఫలించిందనీ, ఒకనాటికి వామనమూర్తిలా పెరిగి తన బ్రతుకు

మొత్తాన్ని ఆవరించుకుంటుందనీ తెలిసి ఉంటే?...

తెలియదు కనుకనే అనగలిగింది.

"ఇంక మీదట మనం కలుసుకోం!"

రైలు భయంకరంగాకూసి అతని నుండి తనను విడదీస్తూ ముందుకు కదిలింది.

హృదయంలో అగ్నిపర్వతాలే రగులుతున్నాయో, మనసులో సాగర ఘోషే చెలరేగుతోందో, అతని చెయ్యిమాత్రం యాంత్రికంగా ఊగింది వీడ్కోలు చెపుతూ.

"జరిగింది మరిచిపో! హేమా! అర్హత తెలుసుకోకుండా ఆశలు పెంచుకున్నాను — ఎవరి కెంత ప్రాప్తమో అంత!" రైలుచక్రాల ధ్వనిలో కలిసిపోయి వినిపించాయి అతని మాటలు. అదే చివరిసారిగా అతనినోట తను విన్న మాటలు!

తరువాత ఎన్నెన్ని సంబంధాలు వచ్చాయో తనకి!

ఏ ఒక్కటీ నచ్చలేదు తనకి!

వచ్చిన ప్రతిపెళ్ళికొడుకునీ తనకు తెలియకుండానే తనమనసులోని అతనితో పోల్చుకుంటోందనీ ... అందుకే తన కెవరూ నచ్చటం లేదనీ ... నచ్చరనీ అప్పట్లో తనకు తెలిసిరాలేదు.

తెలియదు. తెలియదు...అదేఅజ్ఞానం ఆ అజ్ఞానంతోనే తెల్లవారిపోయింది బ్రతుకంతా.

"ఏమిటాలోచిస్తున్నావ్! కారు ఆపినా దిగటంలేదు ఇదే మా ఇల్లు-"

గతకాలపు స్మృతులలోంచి వర్తమానంలోకి ఉలికిపడి కారులోంచి క్రిందకు దిగింది హేమ.

రెండంతస్థుల మేడా, ఇంటిముందరి లాన్స్, ఇంట్లోని ఫర్నిచరూ అతని ఐశ్వర్యాన్ని ఎలుగెత్తి చాటుతున్నాయి.

అతను పెళ్ళిచేసుకున్నాడా?

అతని శ్రీమతి ఎలా ఉంటుంది?

ఇద్దరూ అన్యోన్యంగా ఉంటారా?

కుతూహలంతో కొట్టుకుపోతోంది హేమ మనసు. అతను ఫలహారం, కాఫీ - అన్నీ వంటమనిషితో తెప్పించాడు. ఏవేవో కబుర్లు చెపుతున్నాడు. ఎంతకూ తనశ్రీమతిని పరిచయం చెయ్యడేం? కథల్లోలా ఇతనూ తనను కలవరిస్తూ అలా ఉండిపోయాడా?

ఈనాటికి తామిద్దరూ కలుసుకోగలిగారా?

ఒక్కసారిగా హేమహృదయం ఎగసిపడింది. అలసిన కళ్ళలో కాంతులు అలుముకున్నాయి.

"నువ్వింకా పెళ్ళిచేసుకోలేదా?" అన్నది తను కాఫీ-తాగినా పొడిగా ఉన్నట్టున్న గొంతుసవరించుకొని.

ఒక్కక్షణం విస్తుపోయినట్లుగా చూశాడు రాము.

"చేసుకున్నాను. అప్పుడు...మనం విడిపోయిన కొత్తల్లోనే చేసుకున్నాను.




నువ్వొచ్చి వెళ్ళిపోయాక తోడులేకుండా బ్రతకలే ననిపించింది. మా ఆవిడ నీలా చదువుకోలేదు. నేను అప్పట్లో మామూలు యల్. డి. సి. ని. అందుకని ఏరికోరి ఏం చదువుకోని అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను. ఏదో, గంతకుతగ్గబొంత కదా!"

అతని స్వరంలో ఎత్తిపొడుపు ఏ కోశానాలేదు.

అతినిర్మలంగా చెపుతున్నాడు.

ఆ నైర్మల్యమే హేమ గుండెల్లో పొడిచింది.

ఏనాటివో తనఈసడింపు, తనచిన్నచూపు, ఇన్ని సంవత్సరాల ఒరపిడిలో పదునుదేరి తనమనసును ముక్కలుగా తరుగుతోంది.

ఎగసిన చివరి ఆశ సమసిపోగా స్థిరస్వరాన్ని తెచ్చిపెట్టుకొంటూ "మరి, ఆవిడని నాకు పరిచయం చెయ్యవేం?" అంది.

అతని ముఖం వడిలిపోయింది.

"ఆవిడకి ఇటీవల కొంచెం అనారోగ్యంగా ఉంది. తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతోంది, మంచంమీంచి లేవలేకపోతోంది."

"అయితే నన్ను చూడనియ్యి. నేను డాక్టర్‌నని మరిచిపోయావా?"

"చాలామందికి చూపించాను. ప్రయోజనం లేకుండా ఉంది. నీకే తెలుస్తుంది_ పరిచయం చేస్తాను. రా!"

రాము పరిచయం చెయ్యగానే ఎంతో కుతూహలంగా చూసింది హేమ.

నలుపువైపుకే మొగ్గే చామనచాయ. ముఖంలో పెద్ద ఆకర్షణలేదు. దానికితోడు

అనారోగ్యంవల్ల బాగా బలహీనంగా ఉంది.

మన మనసు లోపలి ఆలోచనలు ఎదుటివారికి తెలియకపోవటం ఎంత అదృష్టం!

ఆవిడని ఆస్థితిలో చూడగానే తన అంతరాంతరాల్లో తొంగిచూసిన పైశాచిక సంతృప్తి పైకి తెలిసిపోతే తానిక మనిషిగా ఎవరిముందైనా నిలువగలదా?

క్షణంలో సగంసేపు కదిలిన ఆ భావం మరుక్షణంలోనే కరిగిపోయింది.

ఇలా కరిగించుకో గలిగే శక్తి ఉండబట్టే మనుష్యులింకా మనుష్యులుగా మనగలుగుతున్నారు.

ఆవిడను పరీక్షచేసిన హేమ ఆశ్చర్యంగా రాము వంక చూసింది.

''ఇదంత నయంకాని జబ్బుకాదే! ఆపరేషన్ చేస్తే వెంటనే ఈ నొప్పి తగ్గిపోతుంది.''

''నాకు తెలుసు...కాని...''

రాము మాటలు పూర్తి కాకుండానే ఆవిడ బలహీన స్వరంతో అరిచింది.

''నాకు ఆపరేషన్ అక్కర్లేదు. నాకీ నొప్పి తగ్గిపోతుందిలెండి. అదే తగ్గుతుంది.''

ఆయాసపడిపోతోంది ఆవిడ.

రాము చటుక్కున ఆవిడ దగ్గరగా వచ్చి కూర్చుని లాలనగా శిరస్సు నిమురుతూ, ''సరే! సరే! ఆపరేషనొద్దులే. బెంగపడకు,'' అన్నాడు.

ఆవిడనెలాగైనా ఓదార్చాలని ఆదుర్దా స్పష్టంగా వ్యక్తమవుతున్న ధోరణిలో ఏదేదో మాట్లాడేస్తున్నాడు.

అంత నీరసంలోనూ ఆవిడ నవ్వింది.

''ఒకరిద్దరైనా పుట్టందే ఆపరేషనేమిటి నా బొంద!'' అన్నది.

బుజగింపుగా చెక్కిళ్ళు నిమురుతూ జాలిగా కళ్ళలోకిచూస్తూ ఆవిడన్న ప్రతి దానికీ ఔనంటున్నాడతను.

''నేను వెళ్తాను.'' లేచింది హేమ.

''నేను డ్రాప్ చెయ్యనా?''

''మీ దయ!''

''మీవారు ఇంకా రాలేదా?'' అన్నాడు యథాలాపంగా.

''మావారా! అటువంటివారెవరూ లేరు.''

రాము ముఖం పాలిపోయింది. ఏందో అనగా ''అంటే...''అని ఆగిపోయాడు.

విరగబడి నవ్వింది హేమ.

''నా ముఖంమీది బొట్టు చూస్తోంటే నేను వితంతువునుమటుకు కానని తెలియటంలా? ఇంకా పెళ్ళి చేసుకోలే!''

''తగినవాడు ఇంకా దొరకలేదా?''

హేమ మాట్లాడలేదు...

''అందమయినదానివి, చదువుకొన్న దానివి. నీకు తగినవాడు దొరకాలంటే మాటలా? తొందరపడి ఎవరినో కట్టుకోవటం కంటే తగినవాడికోసం నిరీక్షించటమే మంచిది.''



కొన్ని క్షణాలు రెప్పవాల్చకుండా అతని ముఖంలోకి చూసింది హేమ!

ఎంత ఆర్ద్ర హృదయం!

ఒకనాటి తన ఆహాన్ని దెప్పిపొడవటానికి అన్ని హంగులూ ఈనాడు ఇతనికున్నాయి. దెప్పకపోగా సముదాయిస్తున్నాడు!

"నేను వెళ్ళనా?"

"వెళ్ళు - ఎంత సేపని ఉంటావు?"

"అదేం? నీకేదైనా అవసరంఉందా?"

"ఉంటే, ఉంటావా?"

"ఏం కావాలో చెప్పు. వీలైతే నీ పని అయ్యాకే వెళతాను."

అతి అమాయకంగా స్వచ్ఛమైన

అతను వెళ్ళిపోయిన చాలా సేపటి వరకూ తను కూర్చున్న చోటినుంచి లేవలేక పోయింది హేమ.

జబ్బుతో మూలుగుతూ అతిసాధారణమైన అందచందాలున్న తన భార్యను, ప్రక్కన కూర్చొని బుజ్జగిస్తోన్నరాము ముఖం ఎంత ప్రయత్నించినా ఆమె మనఃపథంనుండి తొలగిపోలేదు.

"వంట్లో ఎలా ఉంది?" అని తన భార్యను అడగటానికొచ్చిన రాము, ప్రక్కనే కూచున్న హేమనుచూసి ఆశ్చర్యపోయాడు.

"నువ్వు వచ్చావా?"

"రోగిని చూశాక డాక్టర్ రాకుండా

వేళాకోళంగా నవ్వింది హేమ.

"ఆవిడ చాలా మంచివారండీ! ఆపరేషన్ అక్కర్లేకుండానే నాకు నొప్పి తగ్గిపోతుందిట!"

వికసించిన ముఖంతో అంది ఆవిడ. రాము ఆశగా హేమ ముఖంలోకి చూశాడు. హేమ ముఖం పక్కకి తిప్పుకుంది–ఒక్క నిట్టూర్పు విడిచాడు రాము.

ఆరోజు హేమను ఇంటిదగ్గిర డ్రాప్ చేస్తూ దారిలో అన్నాడు రాము

"నువ్వుచాలా మంచిదానివి హేమా! నువ్వింత చదువుకున్న దానివయినా, ఏం చదువుకోని మా ఆవిడతో ఎంతో స్నేహంగా మాట్లాడుతున్నావు"

గుండెలు చీల్చుకొంటూ ఒక్క నిట్టూర్పు వెలువడింది హేమకు.

"ఈ అంతస్థుల భేదాలు ఎంత అర్ధరహితమైనవో ఇప్పుడు తెలుస్తోంది రాముా! ఒకనాడు ఈ అంతస్థులకే ప్రాధాన్యంఇచ్చి నిన్ను దూరం చేసుకున్నాను. ఎంతమూర్ఖంగా ప్రవర్తించానో ఇప్పు డర్ధమవుతోంది."

"అవును. ఇప్పుడు నాకూ అంతస్థు ఉందిగా!" అతి మామూలుగానే అన్నాడు రాము. అయినా, 'కొరడాతో చరిచినట్లు అదిరిపడింది హేమ. తానన్న మాట హృదయపూర్వకంగా అన్నదే! అయినా ఆమాటకి విలువ ఆనాడు. ఈనాడు కాదు.

ఈనాడు ఆమాట అనటం తనను తాను అవమానించుకోవటం!

హేమను ఇంటిదగ్గిర విడిచి వెంటనే వెళ్ళటాని కుద్యుక్తుడయ్యాడు రాము.

"కాస్సేపు కూర్చోరాదూ! ఒక్కదానికీ బోర్ కొడుతోంది."

"పోనీ, మంచి పనిమనిషిని–ఎప్పుడూ నీతో ఉండేదాన్ని పెట్టుకో!"

రాము ముఖంలోకి చూసి నవ్వింది హేమ.

"పనిమనిషి నావంటరితనాన్ని దూరం చెయ్యగలదా?"

"చెయ్యలేదు!" అన్నాడతను సీరియస్‌గా!

కొద్దిసేపు ఇద్దరూ మాట్లాడుకోలేదు. ఉన్నట్టుండి రాము హటాత్తుగా లేచాడు.

"మళ్ళీ కలుస్తాను హేమా!" అంటూ హేమ సమాధానంకోసంచూడకుండానే వెళ్ళిపోయాడు.

చిత్తరువులా నిలిచిపోయింది హేమ.

మూడురోజుల తరువాత బాగా వడిలిపోయిన ముఖంతో వచ్చాడు రాము హేమ దగ్గిరకి...

ఆ ముఖంచూసి గాభరాపడుతూ "ఏం జరిగింది రాముా!"అంది అదుర్దాగా.

"మా ఆవిడకి మళ్ళీ నొప్పివచ్చింది విపరీతంగా!"

హేమ తేలిగ్గా ఊపిరి తీసుకుంది.

"అంతేకద! ఎప్పుడూఉండేదేగా!"

"అవును కానీ, ఈ క్షోభ ఇంకనేను సహించలేను. నువ్వీ విషయంలో నాతో కొంత సహకరించాలి. తప్పదు. తప్పే

అనుకో! అయినా అంతకంటె గత్యం తరం లేదు. నాలో సహనం చచ్చి పోతోంది.''

హేమ హృదయం ఊగిపోసాగింది. ఏం అడగబోతున్నాడితను?

"ఒక్క వాగ్దానం మాత్రం చెయ్యాలి. ఈ విషయం మా ఆవిడకు తెలియనియ్య కూడదు."

చటుక్కున హేమ రెండు చేతులూ పట్టుకున్నాడు రాము.

హేమ శరీరంవిలువెల్లాపులకించింది. హృదయస్పందన హెచ్చింది.

"నాకు తెలుసు. ఒక విధంగా ఇది మోసమే - అన్యాయమే. అయినా తప్పదు."

తనను పెళ్ళిచేసుకోమని అడగబో తున్నాడా? ఇందులో అన్యాయమే ముంది? ఆవిడ అలా రోగంతో తీసు కొంటూంటే ఇతను తన సుఖాల నన్నిం టినీ వదులుకొని సన్యాసిలా బ్రతకాలా?

ఇన్నాళ్ళ తన ప్రతీక్ష సఫలం కాబో తోందా? కేవలం ఒక పగటికలగా మారిపోయిన అలనాటి ప్రేమానుభూతి నిజమై తన జీవితంలో తిరిగి వెన్నెలలు విరియించబోతుందా?

"వింటున్నావా, హేమా? నేను కోరినట్లు చెయ్యగలవా?''

"వింటున్నాను చెప్పు. నువ్వు కోరితే నేను కాదనగలిగినదేదీ లేదు."

"నాకు తెలుసు. ఆ నమ్మకం ఉండ బట్టే అడుగుతున్నాను. నాతోపాటు నిన్నూ ఈ అన్యాయంలోకి లాగు తున్నాను.''

రాము చేతుల్లో హేమ చేతులు బిగుసుకున్నాయి.

హేమ సర్వచైతన్యమూ వ్యగ్రతతో ప్రతీక్షిస్తోంది అతను చెప్పబోయేది వినటం కోసం.

"ఆవిడను మభ్యపెట్టి అపరేషన్ చేసెయ్యాలి. ఆ బాధ నేను చూడలే కుండా ఉన్నాను. నాకు పిల్లలు లేకపో యినాపరవాలేదు. తను సుఖంగా ఉంటే చాలు. నాకు పిల్లలంటే ఇష్టమని అంత క్షోభనూ సహిస్తోంది. ఇష్టమయితే మాత్రం ఏం చేస్తాం! కావాలనుకున్న వన్నీ జీవితంలో రావు. అపరేషన్ అయినా పిల్లలు పుడతారని ఆవిడకు నచ్చజెప్పి అపరేషన్ చేసెయ్యి. ఇక నాకు పిల్లలు కలగరు. కానియ్యి. ఎవరి కెంత ప్రాప్తమో అంత!"

హేమ చేతులు రాము చేతుల్లోంచి జారిపోయాయి.

ఒక్కక్షణం సమస్తమూ శూన్య మైనట్టు అనిపించింది.

"ఏం? చెయ్యవూ?"

అప్రయత్నంగా హేమ రెండుచేతులూ జోడించింది.

ఆ నమస్కారం రాముకే కాదు, అతనిలోని మమతకీ మానవతకీ కూడా నని ఆ క్షణంలో ఆమెకు తట్టలేదు.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

వఎఎక్కాలిపీటమీద పెట్టివున్న లాంతరు తీసుకుని పెట్టెలోంచి వాయిల్‌చీర తీసుకుందామని వెళ్ళిననేను పెట్టెమీద నావెంట తెచ్చుకున్న వుమెన్ అండ్ హోమ్ మాగ్‌జైన్ వుండటంతో అదితీసి యదాలాపంగా ప్రక్కన మంచంమీద పడేసి పెట్టె తెరవబోయాను.

మంచంమీదికి విసిరేసినట్టు పడిన మాగ్‌జైన్ తెరిచినట్టుగా, పరిచినట్టుగా పడింది. అది మధ్యపేజీ. ఆ పేజీలో సీరియల్‌వుంది. యీ మాగ్‌జైన్‌సరిగ్గా నేను వూరు బైలుదేరబోతుండగా ఆరోజే వచ్చింది. అందులో రెండు మంచి ప్రేమ కథలు సీరియల్స్‌గా పడుతున్నాయి. వాటిని చదవటానికి వ్యవధి లేకపోవటంవల్ల నేను పెట్టెలోపెట్టి వెంట తెచ్చుకున్నాను.

అవి యీ మధ్యాహ్నం చదువుదామని పెట్టెలోంచి తీశాను కానీ వీలుపడనేలేదు. పేరంటానికి వెళ్ళేటప్పుడు పెట్టిమీద పడేసి వెళ్ళిపోయాను.

ఆపత్రికవాళ్లు ఆ సీరియల్స్‌కి మంచి ఆర్టిస్ట్‌చేత, నిజమైన ఫొటోలా అన్నంత సహజంగా బొమ్మలు వేయిస్తారు. పురుషులు, ముఖ్యంగా ప్రేమికులు ఒకరి చేరువగా మరొకరు గుండెమీద మనం దాచుకున్నట్టు, ఒకరిభుజంమీద యింకొకరు తల ఆనించుకున్నట్టు యిలాటిబొమ్మలు వుంటాయి. యీ సీరియల్‌పడిన భాగంలో సరిగ్గా ఆబొమ్మలు వున్నంతమేరా ఎవరో జాగ్రత్తగా కత్తిరించి పారేశారు. నేను

మాగ్‌జైన్ చేతిలోకి తీసుకుని చూసాను. ఆపుస్తకంలో అలా స్త్రీ పురుషులు సన్నిహితంగా వున్నట్టున్న నాలుగు పెద్దబొమ్మలూ లేవు. నాకు ఏడుపువచ్చినంత పనైంది. అసలు నిజంచెప్పాలంటే ఆకథలకంటే ఆబొమ్మలు నాకెంతోయిష్టం. ఎంతో అందంగా వుంటారు వాళ్లు. వాళ్ళ ముఖాల్లో భావం చెప్పలేనంత అప రూపంగా వుంటుంది. ఎవరు చేసివుంటారీపని ! క్రిందపెదవి గట్టిగా పళ్ళతో నొక్కిపట్టి ఆలోచించాను. ఎవరైవుంటారు ? నాకు వెంటనేతోచలేదు. ఈబొమ్మల వల్ల ఎవరికి నష్టంకలిగింది ? ఏంబాధ వచ్చింది వాళ్ళకి !

హఠాత్తుగా నాకు గుర్తుకు వచ్చింది.

అత్తయ్యకి ఇంగ్లీషురాదు.

పిల్లలు, రాజేశ్వరీ నాతో పేరంటానికి వచ్చేసారు.

యిక మిగిలిందెవరు ?

కృష్ణ !

నా మొహం జేవురించింది.

నాకు చాలా రోషంవచ్చింది.

ఎందుకు చేశాడీపని, బ్రూట్. ఇప్పుడే తేల్చుకోవాలి.

లాంతరు ఆపుస్తకం చెరోచేత్తో పుచ్చుకుని వెనక్కితిరిగిన నాకు బైటనుంచి, "వదినా ! బట్టలు మార్చుకుంటున్నావా ? నేను రానా లోపలికి' అన్న రాజేశ్వరి కంఠం వినిపించింది.

"రా !" అన్నాను. దగ్గరగా వేసివున్న తలుపులని తోసుకుని రాజేశ్వరి లోప లికి వచ్చింది.

లోపలకు అడుగుపెడుతూనే అదోలా నిలబడిన నన్నుచూసి, "అదేమిటి ? అలా వున్నావేం ? ఏమైంది ?" అంది.

'ఇలా రా నా దగ్గరికి' పిల్చాను.

దగ్గరగా వచ్చింది.

'చూడు. మీ అన్నయ్య చేసినపని ?' అన్నాను పుస్తకం చూపిస్తూ.

రాజేశ్వరికి అర్థం గాలేదు.

నేను వివరంగా చెప్పా.

'అరె ! ఇదేమిటి ! అన్నయ్య ఎప్పుడూ అలాచేయడే' అంది అపనమ్మకంగా చూస్తూ.

'చేస్తాడనటానికి యింతకంటే మంచి నిదర్శనం ఏం కావాలి !' అన్నాను.

'అన్నయ్య కారణంలేందే ఏపనీ చేయడే' యింకా నమ్మలేనట్టు అంది.

'కారణం లేకపోవటమేం? వుందిగా' అన్నాను.

'ఏమి టది?'

'నేను యిక్కడికి రావటం యిష్టంలేదు. మొదటిరోజుకే నా కనిపించింది.'

'ఛ. ఛ - అదేంకాదు. వుండు నే నిప్పుడే అడిగివస్తా,' రాజేశ్వరి వేగంగా వెళ్ళబోయింది.

నేను చెయిపట్టుకుని ఆపేశాను. 'ఆగు. నువ్వెందుకు? నువ్వువద్దు. నేనే అడుగుతా. అస లతని వుద్దేశ్యం ఏమిటో నేనే తేల్చుకుంటా. మూర్ఖులకి భయపడే అమాయకురాలినికాదు నేను,' అన్నా.

రాజేశ్వరి నాలాగే పెదవి కొరుక్కుంటూ నిలబడిపోయింది.

నేను బట్టలు మార్చుకున్నాను.

నేను విప్పిన చీర భద్రంగా మడతపెట్టి పెట్టేశాను.

రాజేశ్వరికూడా బట్టలు మార్చుకుంది.

ఇద్దరం బైటకి వచ్చాం.

నేను చేత్తో పుస్తకం పట్టుకునే యివతలకి వచ్చాను.

కృష్ణ ముందుగదిలో లేడు.

వాకిట్లోనూ లేడు.

వంటయింట్లోనూ కన్పించలేదు.

'ఏడీ?' అన్నా. నాకు యిప్పటి కిప్పుడు అదేదో తేల్చుకుంటేగాని వూపిరిసరిగ్గా ఆడనంత ఆవేశంగా వుంది.

'అమ్మా! అన్నయ్యేడి?' రాజేశ్వరి తల్లిని అడిగింది.

'దాగ్లీ ఆవుని చూసిరావటానికి వెళ్ళాడు. ఏం. ఎందుకు?' అంది.

రాజేశ్వరి మాట్లాడలేదు.

అత్తయ్య కూరవేయించే పనిలోవుంది.

నేను దొడ్లోకి వచ్చాను.

రాజేశ్వరి నా వెనకే రాబోయింది.

నేను వద్దని వారించాను.

దొడ్డంతా చీకటిగా ఉంది.

గొడ్లపాకలో కృష్ణ పెట్టిన లాంతరు కొద్దిగా యిటువైపుకి కాంతిని ప్రసరింప చేస్తూ మార్గం కన్పించేలా చేస్తోంది.




జాతీయ సమైక్యత,
అంతర్జాతీయ
సుహృద్భావాల
సేవలో
భారత తంతి,
తపాలా శాఖ

1,00,000 పోస్టాఫీసులతో
10,000 టెలిగ్రాఫు ఆఫీసులతో
పది లక్షల టెలిఫోన్లతో
ఈ శాఖ పనిచేస్తున్నది.
50, కోట్ల భారత ప్రజలను
300 కోట్ల ప్రపంచ ప్రజలను
దగ్గరగా చేర్చటం
తంతి, తపాలా శాఖ
తన అదృష్టంగా భావిస్తున్నది.




davp 68,396

నేను మెల్లగా పాకదగ్గరకు వెళ్ళాను. కృష్ణ ఆవుకి, గేదెలకి గడ్డివేస్తున్నాడు. నేను అక్కడే నిలబడ్డాను. నేను వచ్చినట్టు అతనికి తెలియనే తెలియదు. గడ్డి వేయటం అయింతర్వాత, రేపో మాపో యీనటానికి సిద్ధంగా, బరువుగా, భారంగా ఉన్నట్టున్న ఆవుని కొద్దిసేపు గంగడోలు నిమిరాడు. చివరికి వెళ్ళటానికి ఉద్యుక్తుడవుతూ, లాంతరు తీసుకుని యిటుతిరిగినవాడల్లా–చీకట్లో కన్పించీ కన్పించనట్టు తెల్లచీరతో నిలబడిన నన్ను చూసి ఉలిక్కిపడి, 'ఎవరు ?' అన్నాడు.

"నేనే!" అన్నాను. నాలో కోపం, అతిశయం, అహంకారం అంతా ఆ నేనే అనటంలో చూపిస్తూ.

నా కంఠస్వరం వినగానే అతను కొంచంగా వెనక్కి తగ్గాడు. 'చీకట్లో యిక్కడి కెందుకువచ్చావ్ ?' 'దీని ఉద్దేశ్యమేమిటో కనుక్కుందామని.' చేతిలో పుస్తకం చించినచోట తెరిచి అతనికి కన్పించేలా ముందుకు పెట్టాను. లాంతరు ఎత్తి పట్టుకోవటంవల్ల కృష్ణ ముఖం నాకు స్పష్టంగా కన్పిస్తోనేవుంది. నేను ముందుకు పట్టుకున్న పుస్తకం చూడగానే అతని ముఖంలో చిత్రవిచిత్రమైన భావాలు కదిలినాయి. అది రెప్పపాటుమాత్రమే. ఆ తర్వాత ఆ ముఖం ఎలాటి భావం లేకుండా నిర్లిప్తంగా ఉండిపోయింది.

చాలా నిదానంగా, మృదువుగా, గంభీరంగావున్న స్వరంతో పలికాడు. "చూడు మీనా. నువ్విక్కడ నాలుగురోజులుపాటు సరదాగా గడపటానికి వచ్చావని నాకు తెలుసు. దానికి మా ఎవరి అభ్యంతరమూ లేదు. పైనుంచి మేమంతా ఎంతో ఆనందించాంకూడా. నువ్వు సరదాకి, కాలక్షేపానికివచ్చి వెళ్ళిన యీ సమయం మాలో ఏ ఒక్కరి మనసుమీద ఎలాటి విపరీతమైన ముద్రావేయకూడదు. ఆ పుస్తకం ఇంతక్రితం గదిలో చూడగానే నా కెలాగో అన్పించింది. అది చదవకూడదనీకాదు. అవి అసభ్యంగా, జుగుప్సాకరంగా వున్నాయనీ నేను అనటంలేదు."

"మరి ఎందుకు చించావ్ ?"

"రాజు గుర్తుకు వచ్చింది. వయసులోవున్న పిల్ల. దాని వూహలకి, ఆలోచనల్ని ఆ బొమ్మలు ఎలా రెచ్చగొడతాయో కాస్త వూహించేసరికి నాకు చెప్పలేనంత చిరాకువేసింది. నీ సంగతివేరు. చిన్నప్పటినుంచీ అంతో ఇంతో అలాటి పుస్తకాలు చూడటానికి అలవాటుపడిన నీకు అంతగా ఏమీ అన్పించకపోవచ్చు. నా చెల్లెలు వేరు. పిల్లలకి వయసువచ్చినా, ఇబ్బందుల్లోపడి పెళ్ళిచేయలేని పెద్దవాళ్ళు, ఆ వయసువాళ్ళలో ఎలాటి వికారం రేకెత్తించకుండా జాగరూకతవహించే బాధ్యత కూడా తీసుకోవాలి. నేను చేసినది పొరపాటే. ఆ పుస్తకం ఖరీదు నాకు తెలుసు.

నేను మెల్లగా పాకదగ్గరకు వెళ్ళాను. కృష్ణ ఆవుకి, గేదెలకి గడ్డివేస్తున్నాడు. నేను అక్కడే నిలబడ్డాను. నేను వచ్చినట్టు అతనికి తెలియనే తెలియదు. గడ్డి వేయటం అయింతర్వాత, రేపో మాపో యీనటానికి సిద్ధంగా, బరువుగా, భారంగా ఉన్నట్టున్న ఆవుని కొద్దిసేపు గంగడోలు నిమిరాడు. చివరికి వెళ్ళటానికి ఉద్యుక్తుడవుతూ, లాంతరు తీసుకుని యిటుతిరిగినవాడల్లా-చీకట్లో కన్పించీ కన్పించనట్టు తెల్లచీరతో నిలబడిన నన్ను చూసి ఉలిక్కిపడి, 'ఎవరు?' అన్నాడు.

"నేనే!" అన్నాను. నాలో కోపం, అతిశయం, అహంకారం అంతా ఆ నేనే అనటంలో చూపిస్తూ.

నా కంఠస్వరం వినగానే అతను కొంచంగా వెనక్కితగ్గాడు. 'చీకట్లో యిక్కడి కెందుకువచ్చావ్?' 'దీని ఉద్దేశ్యమేమిటో కనుక్కుందామని.' చేతిలో పుస్తకం చించినచోట తెరిచి అతనికి కన్పించేలా ముందుకు పెట్టాను. లాంతరు ఎత్తి పట్టుకోవటంవల్ల కృష్ణ ముఖం నాకు స్పష్టంగా కన్పిస్తోనేవుంది. నేను ముందుకు పట్టుకున్న పుస్తకం చూడగానే అతని ముఖంలో చిత్రవిచిత్రమైన భావాలు కదిలినాయి. అది రెప్పపాటుమాత్రమే. ఆ తర్వాత ఆ ముఖం ఎలాటి భావం లేకుండా నిర్లిప్తంగా ఉండిపోయింది.

చాలా నిదానంగా, మృదువుగా, గంభీరంగావున్న స్వరంతో పలికాడు. "చూడు మీనా. నువ్విక్కడ నాలుగురోజులుపాటు సరదాగా గడపటానికి వచ్చావని నాకు తెలుసు. దానికి మా ఎవరి అభ్యంతరమూలేదు. పైనుంచి మేమంతా ఎంతో ఆనందించాంకూడా. నువ్వు సరదాకి, కాలక్షేపానికివచ్చి వెళ్ళిన యీ సమయం మాలో ఏ ఒక్కరి మనసుమీద ఎలాటి విపరీతమైన ముద్రావేయకూడదు. ఆ పుస్తకం ఇంతక్రితం గదిలో చూడగానే నా కెలాగో అన్పించింది. అది చదవకూడదనీకాదు. అవి అసభ్యంగా, జుగుప్సాకరంగా వున్నాయనీ నేను అనటంలేదు."

"మరి ఎందుకు చించావ్?"

"రాజు గుర్తుకు వచ్చింది. వయసులోవున్న పిల్ల. దాని వూహలకి, ఆలోచనల్కి ఆ బొమ్మలు ఎలా రెచ్చగొడతాయో కాస్త వూహించేసరికి నాకు చెప్పలేనంత చిరాకువేసింది. నీ సంగతివేరు. చిన్నప్పటినుంచీ అంతో ఇంతో అలాటి పుస్తకాలు చూడటానికి అలవాటుపడిన నీకు అంతగా ఏమీ అన్పించకపోవచ్చు. నా చెల్లెలు వేరు. పిల్లలకి వయసువచ్చినా, ఇబ్బందుల్లోపడి పెళ్ళిచేయలేని పెద్దవాళ్ళు, ఆ వయసువాళ్ళలో ఎలాటి వికారం రేకెత్తించకుండా జాగరూకతవహించే బాధ్యత కూడా తీసుకోవాలి. నేను చేసినది పొరపాటే. ఆ పుస్తకం ఖరీదు నాకు తెలుసు.

ఇచ్చేస్తాను. నువ్వు హైదరాబాద్ వెళ్ళగానే మరోటి కొనుక్కో. దీన్ని గురించి ఇంకెలాటి గొడవా చేయద్దు. దయయుంచి."

నేను అలాగే నిలబడ్డాను.

అంతో యింతో విచక్షణా జ్ఞానంగల నా బుద్ధికి అతను చెప్పింది సబబుగానే తోచింది.

కానీ అతను చెప్పింది మారుమాట్లాడకుండా ఒప్పుకోవాలంటే అవమానంగా కూడా తోచింది.

అందుకే వెక్కిరింతగా అన్నాను.

"రాజుకి ఏమైనా అన్పిస్తుందనా? లేక ఆ బొమ్మలు చూడగానే ఆ వికారం లాటి దేదో నీ కే కలిగిందా?"

వెళ్ళబోతున్న కృష్ణ చటుక్కున ఆగి నా వైపు చూసాడు.

అతనిముఖం కఠినంగా మారింది. ఎర్రబడిందికూడా.

క్షణంసేపు సూటిగా, రెప్పవాల్చకుండా నా కళ్ళలోకిచూసి, 'నీ యిష్టం. ఏలాగైనా అనుకో,' అన్నాడు.

ఆ అనటంలో నిర్లక్ష్యం, లెఖ్ఖలేనితనం నా అహంకారాన్ని, అతిశయాన్ని కాటువేశాయని వేరే చెప్పనవసరం లేదనుకుంటా.

కృష్ణ నా సమాధానంకోసం ఆశించకుండా లాంతరు అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు. చీకట్లో అదృశ్యమైపోతున్న అతనివైపు పరీక్షగా చూస్తూ నేను అక్కడే నిలబడిపోయాను.

పరధ్యానంగా నిలబడిన నా దగ్గిరకి రాజేశ్వరి గబగబా వచ్చింది.

నా చెయిపట్టుకుంటూ, 'వదినా! అన్నయ్య ఏమన్నాడు?' అంది.

'ఏమీ అనలేదు,' అన్నాను.

రాజేశ్వరి లాంతరు తీసుకుంది.

ఇద్దరం బైటకి వచ్చేస్తుండగా రాజేశ్వరి అడిగింది. 'అడిగావా నువ్వు?'

'పుస్తకము చూడగానే అతనికి ఏదో వికారంలాటిదికలిగిందిట.'

"వికారమా!" అంది రాజేశ్వరి.

"ఔను. వికారమే."

రాజేశ్వరి నా వైపు చూసింది.

రాజేశ్వరి ముఖం చూడగానే నేను ఫక్కుమని నవ్వాను.

రాజేశ్వరికూడా బలవంతంగా నవ్వింది.

ఇద్దరం లోపలికి వచ్చాం.

పెరటిగుమ్మందగ్గర మా కెదురైన కృష్ణని చూడగానే నేను నవ్వు ఆపేసి ముఖం సీరియస్‌గా పెట్టుకున్నాను.

* * * *

మేం భోజనానికి కూర్చోబోతుండగా, కృష్ణ, 'అమ్మా! రాజుకి దిష్టి తీయమని చెప్పాను? తీసావా?' అని అడగటం విన్పించింది.

'లేదురా! మర్చిపోయాను.' అంటూ అత్తయ్య మా యిద్దర్నీ పిలిచి ముందు నాకు తీసి, తర్వాత రాజేశ్వరికి తీసింది.

లాంతరు వెలుగులో ఆవిడముఖం దుఃఖాన్ని అణుచుకుంటున్నట్టుగా, బాధని దిగమింగుతున్నట్టుగా కన్పించటం గమనించిన నేను చకితురాలిని అయాను.

పిల్లలందరం భోజనం చేసాం.

కృష్ణ మాతో ఎప్పుడూరాడు. అతను, అత్తయ్యా కలిసి తినటం అలవాటు.

భోజనాలు కాగానే ముందుగదిలో పక్కలు పరుచుకున్నాం. పగలంతా ఆడి, అలిసిపోయిన పిల్లలు అంతలోనే నిద్రపోయారు. రాజేశ్వరి యింకా పడుకోటానికి రాలేదు.

నిద్రపట్టని నేను అలాగే చూస్తూ పడుకున్నాను.

వంటగదిలోంచి అత్తయ్య స్వరం దిగులుగా, మెల్లగా, బాధగా, ఏదో అంటం విన్పించింది.

కృష్ణ కంఠం, దానికి జవాబుగా స్థిరంగా, నిశ్చయంగా పలికింది.

"ఆ అమ్మాయివున్న నాలుగురోజులూ నువ్వు యిలాంటి విషయాలేమీ ఎత్త వద్దమ్మా. అయినా దిగులుపడినంత మాత్రాన జరిగేది ఏముంది. నేనున్నానుగా. ఆ విషయం నాకు వదిలేసి నువ్వు మర్చిపో. నువ్వు నిశ్చింతగా వుండు."

నేను చెవులు రిక్కించి విన్నాను.

ఆ తర్వాత వాళ్ళు ఆ సంభాషణ అట్టే పొడిగించలేదు.

నేను చాలాసేపు ఆలోచించాను.

ఏమైంది? అత్తయ్య ఎందుకు దిగులుపడుతోంది? ఏమిటా విషయం? ఏదై వుంటుంది! రాజుని అడిగితే చెబుతుంది నిజమే. కానీ – తెలుసుకుని నేనేం చేయ గలను! నాలుగురోజులు సరదాగా గడిపి వెళ్ళటానికి వచ్చానన్న విషయం నేను మర్చిపోకూడదు.

ఆలోచన్లు బలవంతంగా వదిలించుకుని నిద్రకి వుపక్రమిస్తూ కళ్ళు మూసుకు న్నాను.

మెల్లగా నాకు నిద్ర పట్టేసింది.

రాజేశ్వరి ఎప్పుడువచ్చి నా ప్రక్కన పడుకుందో నాకు తెలియనే తెలియదు.

*　　　*　　　*

గాఢనిద్రలోవున్న నాకు ఎవరో తట్టి లేపినట్టే మెలకువ వచ్చింది. వులిక్కిపడి కళ్ళు తెరిచి చుట్టూ చూసాను. క్షణంసేపు నేను అపరిచితంగా వున్న యీ పరిస రాలలో ఎందుకు వున్నానో నాకే అర్థంగాలేదు. తర్వాత మెల్లగా తెలిసింది. నేను వున్నది విమ్మలూరు అని, యిది అత్తయ్య యిల్లని. తల్లడిల్లినగుండె చల్లబడింది. నిదానంగా మళ్ళీ చుట్టూ చూసాను. అందరూ మంచి నిద్రలో వున్నారు.

ఒక్కొక్కసారి యిలా నిద్రలో చటుక్కున లేచి కూర్చోవటం నాకు అలవాటే. నా చేతికి వాచీ లేకపోవటంవల్ల టైమెంతయిందో తెలియలేదు. యిదే మా యింట్లో

అయితే, తలతిప్పి కుడివైపు చూస్తే నా మంచం ప్రక్కనేవున్న రోజ్‌వుడ్ టేబిల్ మీద రెండుపిట్టలు చెరోవైపూ నిలబడి ముక్కులతో పట్టుకున్నట్టున్న అందమైన గడియారం రేడియం డయల్‌తో నేను కళ్ళు తెరవగానే టైమ్ చెప్పటానికి సిద్ధంగా నిలబడినట్టు టిక్‌టిక్‌మంటూ వుండేది. అదీగాకుండా నైట్‌గవునుతో నిద్రపోటానికి అలవాటు పడిన నాకు యీ నూలుచీర ఎంత మెత్తగా వున్నా, ఏమిటో గుడ్డల మధ్య చుట్టేసినట్టు యిబ్బందిగానే వుంది.

ఓ ప్రక్కకు తిరిగి చెంపకిచెయి ఆనించుకుని పడుకుని నా ఆలోచనల సుడిగుండంలోకి మెల్ల మెల్లగా జారుతున్న నాకు హఠాత్తుగా, నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ దూరం నుంచి 'అంబా' అని ఆవు అరవటం విన్పించింది.

ఆ అరుపు మామూలు అరుపులా లేదు.

ఆక్రందనంలా వుంది.

ఆపదలో నిలబడి ఆప్తులకోసం ఎలుగెత్తి అరుస్తూ పిలిచిన పిలుపులా వుంది. రాత్రివేళ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూవచ్చిన అరుపుకి నా గుండెలు ఎలాగో అయినాయి.

మరోసారి, వెంటవెంట రెండుసార్లు విన్పించింది.

ఆవతలగదిలో గాఢనిద్రలోవున్న కృష్ణ మంచంమీద అటూ యిటూ కదిలిన చప్పుడు విన్పించింది.

మరోసారి ఆవు అరుపు విన్పించింది.

కృష్ణ చప్పునలేచి యివతలకి వచ్చాడు. మేం పడుకున్నగదిలో మూలగా పెట్టి వున్న లాంతరు తీసి, దానివత్తి ఎక్కించి పరుగులాటి నడకతో బైటకి వెళ్ళిపోయాడు.

నేను కళ్ళుతెరిచి ఆతన్ని గమనిస్తున్నానన్న సంగతి అతనికి తెలియదు.

దొడ్లోకి వెళ్ళిన పది నిముషాలకి కృష్ణ, 'అమ్మా - రాజూ' అని బిగ్గరగా పిలవటం విన్పించింది.

నేను చటుక్కున లేచి కూర్చున్నా.

అత్తయ్య కదులుతూ, లేచి కూర్చునివున్న నన్ను రాజేశ్వరి అనుకుని 'రాజూ ! అన్నయ్య పిలిచినట్టుందేవిటమ్మా ? పిలిచాడా నన్ను' అంది.

"ఔనత్తయ్యా. ఆవు అరుస్తోంది. కృష్ణలేచాడు. పిలుస్తున్నాడు మిమ్మల్ని" అన్నాను.

"ఔనా! అయ్యో! ఆవు యీనిందేమో" అంటూ అత్తయ్యకూడా లేచి దొడ్లోకి వెళ్ళింది.

నాకిక పడుకోబుద్ధి కాలేదు.

రాజేశ్వరిని తట్టిలేపాను.

మా మాటలకి మధుకూడాలేచాడు. ముగ్గురంకలిసి దొడ్లోకి వెళ్ళాం - బైట తెలతెల వారుతోంది. పిట్టలు కిచకిచలాడుతున్నాయి. తూర్పునంతా కుంకుమ అద్దినట్టు ఎర్రటి ఎరుపు అలుముకునివుంది. వెలుగునీడల్లో ఏ ఒక్కటీ కాని ఆ మిశ్రమ వాతావరణం నాకళ్ళకి ఆహ్లాదంగా, మనసుకి ఆనందంగా, అద్భుతంగా, సర్వంమరిచి తదేకంగా అటువైపే చూడాలన్నంత విచిత్రంగావుంది.

"అక్కయ్యా! ఔనేవ్. ఆవు యీనింది." మాతో నడుస్తున్నవాడల్లా మధు అరుస్తూ ముందుకు పరుగెత్తాడు.

"ఏదూడో అడగరా అన్నయ్యని" రాజేశ్వరికూడా పరుగెత్తింది. నెమ్మదిగా, మెల్లగా ప్రాగ్దిశనుంచి కళ్ళు తిప్పుకోలేనిదానిలా నడుస్తూ వచ్చిననేను పాకకి కొద్దిదూరంలో ఆగిపోయి పాకలోపలికి చూసాను.

స్వరంకూడా గంభీరంగానే పల్కింది.

"స్త్రీ సృష్టిని కల్పిస్తుంది నిజమే. కానీ ఆ సృష్టికి పురుషుడు చరిత్రని కల్పిస్తాడు. కాబట్టి ఆధిక్యత ఎంత లేదన్నా మగజాతిదే."

యదాలాపంగా ఆవువైపు తిరిగిన నాకు హఠాత్తుగా కృష్ణమాటలు విన్పించటం మానేసినాయి. వులిక్కి పడ్డట్టుగా చూసాను.

నేను పుట్టి యిన్ని సంవత్సరాలు అయింది. నేను పొరపాటుగాకూడా ఆడవాళ్ళు ప్రసవించటంగాని, జంతువులు యీనటంగాని చూడనేలేదు.

అలాటిది యీ నాడు హఠాత్తుగా, యీ ప్రాతఃకాలవేళ, బైట ప్రకృతి ఎంతో అందంగా రంగులు సంతరించుకుంటూ, చెప్పలేనంత అద్భుతంగా, వర్ణించలేనంత ఆహ్లాదంగా వుందని అనుకుంటున్న యీ సమయంలో అప్పుడే యీనిన ఆవుని చూడగానే నాకు భయం వేసింది. కడుపులో వికారపెట్టింది. మనసంతా జుగుప్సతో వుండచుట్టుకు పోయినట్టయింది. ఈ సృష్టి అనేది యింత భయంకరమా! యింత అసహ్యమైన పరిస్థితుల్లో ప్రాణి వుద్భవిస్తుందా! ఎంతవికృతం! ఎంతఅసహ్యం! ఎలాటిబాధ! నా కక్కడనుంచి మైళ్ళ దూరానికి వేగంగా పారిపోవాలని అన్పించింది. నేను జన్మ జన్మాలకి ఎంత ప్రయత్నించినా మరిచిపోలేనంత గాఢంగా యీ దృశ్యం నా హృదయఫలకంమీద హత్తుకు పోయింది.

అత్తయ్యా, రాజూ ఎలాటివికారంలేకుండా, అదంతా ఎంతో సహజమైనట్టు నిలబడివున్నారు. వాళ్ళదృష్టి అంతా అప్పుడే పుట్టిన ప్రాణిమీద కేంద్రీకరించివుంది.

కృష్ణ అయితే మరీను.

వెనకనుంచి మీదపడి మధు వూగుతుండగా, ఒళ్ళో పొదివిపట్టుకునివున్న దూడని ఎలాటి అసహ్యంలేకుండా, ఎంతో ఆపేక్షగా, శుభ్రంగా తుడుస్తున్న అతను నాకు విచిత్రంగా కన్పించాడు.

ఆ తుడవటంలో ఆప్యాయత, ఆ పట్టుకోవడంలో ఒకవిధమైన మమత, అతని చూపుల్లో కరుణ స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఓహ్! ఎంత మంచిభావం? ఎంత మంచి యాంగిల్? నేను గిరుక్కున వెనక్కుతిరిగి, గబగబా లోపలికి పరుగెత్తి, నాపెట్టెతెరిచి కెమేరా తీసుకుని దొడ్లోకి వచ్చాను.

మెడలమీద మధు, ఒళ్ళో వెన్నముద్దలాటి ఆవుదూడతో వున్న కృష్ణని మంచి యాంగిల్‌లో ఫోటోతీశాను. (సశేషం)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad-4 and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - 1. Phone 36336
Controlling Editor: Sri "CHAKRAPANI"